

# విషయానుక్రమణిక

## 27 జూన్ 1951

ముఖచిత్రం కృష్ణకుమారి





# ఆంధ్రపత్రిక

సంవత్సర చందా
రు 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder K NAGESWARA RAO

సంపుటము 43
సంచిక 41
27-6-51

ఖర సంవత్సర జ్యేష్ఠ బహుళ నవమి బుధవారము


## 'ప్రజాపార్టీ'

★ [సీతారామ్] ★

చిరకాలం గాంధీమహాత్మునికి సన్నిహితవర్తిగా, అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శిగా, అగ్రనాయకవర్గంలో ఒకరై కాంగ్రెస్ సేవచేసిన శ్రీ జె బి కృపలానీగారు కొత్త రాజకీయసంస్థను స్థాపించారు ఈ పార్టీ పేరు కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ, లేక క్లుప్తంగా ప్రజాపార్టీ అని పెట్టుకున్నారు రైతు ఉద్యమంతోనే తమ రాజకీయ జీవితాన్నంతా ముడిపెట్టుకున్నట్లు చెప్పుకునే శ్రీ ఎన్ జి రంగాగారు (శ్రీగోగినేని రంగనాయకులు గారు) ఈ పేరుతోనే ఆంధ్రదేశంలో కాంగ్రెస్‌లో ప్రత్యేక వర్గంగా వ్యవహరిస్తూ వచ్చారు దీనికి అచ్చ తెలుగులో రైతు కూలీ ప్రజా ఉద్యమం అని కూడా చెప్పుకునేవారు ఈ పేరునే ఇప్పుడు కృపలానీగారు తమ పార్టీకి పెట్టుకున్నారు కాని పేరు పెట్టడంలో పాట్నా సమావేశంలో ఆదిలోనే తగాదా వచ్చి బెంగాల్ వర్గం ఒకటి అలిగి నిష్క్రమించింది కూడా కిసాన్ సభ కమ్యూనిస్టుల పరం కావడంతో కిసాన్ కాంగ్రెస్ అంటూ మరొకటి స్థాపించిన రంగాగారికి, వారి కిసాన్ కాంగ్రెస్‌కి ఇంకా ఇంత పేరు తగిలించుకోకముందే పాట్నా వ్యవహారం తటస్థించింది ఇప్పుడు రంగాగారు ఈ కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీలో చేరడానికి వెనకముందాడినా ప్రయోజనం ఉండదు. ఆయ నింకొక ఉద్యమం ఏదైనా ప్రారంభించాలంటే ఇంకో పేరుకోసం కూడా వెతుక్కోవాలి

ఆదిలోనే ఈ రీతిగా ఇటువంటి పెద్ద పేరొకటీ చిన్న పేరొకటీ పెట్టుకుని ప్రారంభమైన ఈ కృపలానీ—ఘోష్—ప్రకాశం పార్టీకి ముగ్గురు అగ్రనాయకులూ చేరి ఎడ్‌హాక్ కార్యవర్గంగా స్థిరపడ్డారు కాంగ్రెస్ సమావేశాల ధోరణిలోనే కృపలానీగారు అధ్యక్షోపన్యాసం ఇంగ్లీషులో అచ్చువేయించి చదివారు సమావేశానికి జనం చాలమందే వచ్చారంటే కారణం ఒకటుంది ఆ కాంగ్రెస్‌కీ ప్రజాపార్టీ అని పేరుపెట్టుకున్న ఈ కాంగ్రెస్‌కీ తేడా ఏమైనా ఉంటే గమనించాలనే ఆశతో చాలామంది వచ్చారు అలా వచ్చినవారికి ఆశాభంగం కలిగిఉంటుంది పాక్షిక రాజకీయాల్ని జోరుగా నడిపిస్తే పుణ్యమూ పురుషార్థమూ కూడా ప్రాప్తాయనే ఉద్దేశంతో చేరినవారికి ఫరవా లేదనిపించి ఉంటుంది

కేవలం ప్రజల్ని ఉద్ధరించడంకోసం తప్ప మరొకందుకు పుట్టని రాజకీయ పక్షాల్లో, ప్రజాపార్టీ ప్రత్యేకత ఏమిటంటే, కేవలం కాంగ్రెస్‌వారిపైన ప్రజలలో ఏర్పడిన అసంతృప్తే తమకు బలమని భావించి ఎన్నికలకి సిద్ధం కావడం

దేశంలో కాంగ్రెస్‌పట్ల తీవ్రమైన అసంతృప్తి వ్యాపించినమాట నిజమే ప్రజల విశ్వాసాన్ని పొందగల మరొక పార్టీ ఏదైనా ఉంటే, వచ్చే ఎన్నికల్లో కాంగ్రెస్ పరాజయం పొందడం కూడా తథ్యమే కాని అటువంటి పార్టీని స్థాపించాలనుకుంటే, ప్రజలలో పరిపాలకులపట్ల విశ్వాసం ఎందుకు క్షీణించిందో, పరిపాలకుల ఆశయాలలో లోపమేఉందో లేక వారి వ్యవహారవిధానంలో లోపమేఉందో, కాంగ్రెస్ సంస్థ నియమాలలో లోపముందో లేక వ్యక్తులవల్లనే దోషముందో ఎవరూ తరిచి చూసినటు కనపడదు కృపలానీగారు రోగలక్షణాల్ని ఏకరువు పెట్టారు కాని రోగానికి మూలకారణాలేవో పరిశీలించలేదు దేహపుష్టి అంటే ఏమిటో చెప్పారు కాని పుష్టి ఎలా కలుగుతుందో సూచించనైనా లేదు ఒకరి రోగమే మాకు పుష్టి అనే ధోరణిలో మరొక కాంగ్రెస్ పార్టీని స్థాపించి, గాంధీజీ నామస్మరణ చేస్తే చాలన్నటు వ్యవహరిస్తే వీరి పార్టీపట్ల, పార్టీ నాయకుల పట్ల ప్రజలకు (అనగా వోటరకు) ఎలా విశ్వాసం కలుగుతుందో ఊహించటం కష్టం

దేశంలో ప్రజల స్థితి నానాటికి హీనమౌతోందన్నారు కృపలానీ గారు ప్రభుత్వంలో అవినీతి మితిమీరిపోయిందన్నారు వ్యాపారుల గుణ్డయీలకు అంతు లేదన్నారు పెద్ద ఉద్యోగుల జీతలు చిన్నవి చేసెయ్యాలన్నారు భూములు కష్టపడే కృషికులకే ఒప్పగించాలన్నారు.

పోషించిపోతున్న కుటీర పరిశ్రమల్ని బతికించాలన్నారు ఉరి తీస్తానన్న అక్రమ వ్యాపారుల్ని ఉరి తియ్యడానికి బదులు ఆలింగనం చేసుకుంటున్నారన్నారు

కృపలానీ గారు చెప్పినది నిజమేనని ప్రతి కాంగ్రెస్ వాదీ ఒప్పుకుంటాడు అంతే కాదు కాంగ్రెస్ ప్రభుత్వాలు కూడా నిజమే నంటాయి కాని ఈ సమస్యల్ని ఎలా పరిష్కరించాలో కాంగ్రెస్ ప్రభుత్వాలకు బోధపడలేదు ఎలా పరిష్కరించాలో కృపలానీగారు సూచించి ఉన్నా, లేక ఈ లక్షణాలన్నిటికీ మూలమైన రోగమేదో తెలిపినా అన్నివిధాలా చెడిన 'ప్రజ'కి కొంత ఉపశమనం కలిగి కృపలానీ గారిపట్ల వారికి భక్తి కుదిరేది కాని అదేం జరగలేదు

బలమైన ప్రతికూలపక్షం ఒకటుంటే ఈ బాధ లేవీ ఉండవని కృపలానీగారన్నారు అంటే అంకుశం లేకపోబట్టి కాంగ్రెస్‌వారు పరిపాలనపట్ల అశ్రద్ధ వహిస్తున్నారనో, విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారనో, వ్యక్తులలో అవినీతి పెచ్చు పెరిగిందనో, ఆరోపిస్తున్నారు కాని అంకుశంకూడా ఓటుదైనప్పు డేమాతుంది? కృపలానీగారి ప్రజాపార్టీలో చేరినవారిని గమనించినట్లయితే, వీరంతా చేరి ప్రతికూల పక్షమంటూ ఊరేగినా ప్రజలు వీరిని విశ్వసించబోరని స్పష్టపడుతుంది అదీకాక స్నేహభావంతో ప్రత్యర్థి వర్గాన్ని నిర్మిస్తే, అన్ని లక్షణాల్లోనూ వారికి దీటు పోరన్నమాట స్పష్టమే

కృపలానీగారి ప్రజాపార్టీలో నాయకవర్గాన్ని గమనించినట్లయితే ఈపార్టీ ఎందులోనూ కాంగ్రెస్ నాయకవర్గానికి తీసిపోదని తెలుస్తుంది కాంగ్రెస్‌ప్రభుత్వాలకు కాంగ్రెస్ సంఘాలు వైరివర్గాలుగా ఉండరాదని కేంద్రకార్యవర్గం మొదటినుంచీ చెప్తూనే ఉంది కాని కేంద్రంలో పరిపాలకవర్గం కార్యవర్గాలమధ్య వ్యవహారాలు కూడా అంతంత మాత్రంగానే ఉన్నాయి కాంగ్రెస్ మంత్రివర్గాలను అన్యపక్షాలకంటె కాంగ్రెస్ సంఘాలే అధికంగా విమర్శించ నారంభించాయి క్రమంగా కాంగ్రెస్‌లో కక్షలేర్పడ్డాయి మంత్రివర్గాలను పడగొట్టడానికి ప్రతికూల వర్గాలూ, తమ ప్రభుత్వాలను నిలుపుకోడానికి మంత్రివర్గాలూ ప్రయత్నించడంతో ఈ కక్షలు సుస్పష్టమై, దేశమంతటా రెండుకక్షలుగా స్థిరపడ్డాయి ప్రభుత్వాలను వశపరుచుకోడానికి ప్రతికూల వర్గాలూ, కాంగ్రెస్ సంఘాలను వశపరుచుకోడానికి మంత్రివర్గాలూ కిందటి కాంగ్రెస్ ఎన్నికల్లో కృషిచేశాయి ఈ కక్షలకు అన్నివర్గాలూ సమానమైన బాధ్యత వహించక తప్పదు ప్రతివ[illegible] చతుర్విధోపాయాలూ అనుసరించింది ఇందులో ఒకరు నీతి పరులైన వారనీ మరొకరు అవినీతి వరులనీ కేటాయించడానికి వీలులేని స్థితివచ్చింది చివరికి కాంగ్రెస్ ఎన్నికల ఫలితంగా చాల రాష్ట్రాలలో కాంగ్రెస్ సంఘాలు మంత్రివర్గాల హస్తగతమైనాయి మిగిలిన వారందరూ ఇప్పుడు కాంగ్రెస్ సంస్థనుంచి బైటపడుతున్నారు అలా బైటపడినవారిలో ధైర్యమున్నవారు, లబ్ధి ఉంటుందని ఆశపెట్టుకున్నవారు, కృపలానీగారి ప్రజాపార్టీలో చేరారు కృపలానీ గారు కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీచేసి ఓడిపోయినవారు రంగాగారు ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షపదవికి పోటీచేసి ఓడిపోయినవారు డాక్టర్ ప్రఫుల్ల చంద్రఘోష్ బెంగాల్‌లో ముఖ్యమంత్రి పదవికి రాజీనామా ఇచ్చినవారు వారు ప్రస్తుత మంత్రివర్గానికి పోటీగా ఉండిన పూర్వరాష్ట్రకాంగ్రెస్ వర్గంలోకూడా స్థానం పొందలేక పోయారు పాలివాల్, మహామాయప్రసాద్ సిన్హా, డా॥ గిద్వానీ, కేలప్పన్ వారివారి రాష్ట్రాలకు పూర్వ కాంగ్రెస్ అధ్యక్షులు ఈరీతిగా కాంగ్రెస్ కక్షలలో పరాజయం పొందినవారంతా, ఇంక ముందు ఎన్నికల్లో తమకు స్థానం ఉండదని భయపడినవారంతా ఈ పార్టీలో చేరారు వీరికే ఇప్పుడు మంత్రిపదవు లుంటే లంచగొండితనం, అవినీతి, అక్రమ వ్యాపారం, అధికార దుర్వినియోగం మొదలైనవి ప్రతికూలపక్షస్థాపనతో నివారించబడేవి కావని చెప్పేవారే, సందేహం లేదు

వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ కక్షల పోటీలలో విఫలులైన కారణంవల్లనే చేరిన ఈ నాయకులు, ఏకాభిప్రాయంతో దేశ సమస్యల్ని పరిష్కరించడానికి చేరారనుకోవడం పొరపాటు దేశసమస్యల్ని ఏ రీతిగా పరిష్కరించాలనే విషయమై ఈ నాయకులకు స్పష్టమైన అభిప్రాయం లేదు కృపలానీ ప్రభృతుల ఉపన్యాసాలను గమనించినట్లయితే వీ రెవ్వరికీ ఈ సమస్యల్ని పరిష్కరించగలరనే విశ్వాసంకూడా ఉన్నట్లు కనపడదు

కృపలానీగారి ఉపన్యాసాన్ని చూస్తే మరొక అపోహకూడా కలుగుతుంది ప్రతికూలపక్షాన్ని స్థాపించినట్లయితే చాలు, కాంగ్రెస్‌వారే ప్రభుత్వాన్ని సక్రమంగా నిర్వహించగలరనే విశ్వాసంతో వారున్నట్లు తోపింపచేస్తుంది ఇదే వారి ఆశయమయితే వారు కాంగ్రెస్‌నించి నిష్క్రమించి చేసిన త్యాగం అపూర్వమైనదని చెప్పాలి గాంధీగారు తమపై నొక విశేష కర్తవ్యభారం మోపి వెళ్లారని ఇప్పుడు చెప్పుకోడంలో, ఈవిధంగా ప్రజలూహించాలని వారి ఉద్దేశమా? అయితే తర్కదోషంవల్ల కలిగే అపోహమాత్రమే ఇది

కాని ఈ త్యాగశీలం వారి ఉపన్యాసాలలో ఎక్కడైనా కనపడుతుందని పరిశీలిస్తే అదీ కనపడదు చివరికి కాంగ్రెస్‌లో ప్రస్తుత నాయకత్వం తొలగకపోవడం వల్ల వేరే పార్టీ పెట్టుకున్నట్లుతప్ప మరొక ఆశయం గోచరించదు

అందువల్లనే ఈ పార్టీలో చేరినవారందరూ భిన్నాభిప్రాయాలతో చేరినట్లు ముందే తెలిసిపోయింది ఇటువంటి పార్టీ ఎన్నికలలో నెగ్గినా, లేక నెగ్గనిపక్షంలో నిర్మాణాత్మక కార్యక్రమమంటూ ఏదైనా తలపెట్టినా, వీరివల్ల ఏ కార్యమూ కొనసాగబోదని వేరే చెప్పనక్కరలేదు వేరే ఎన్నికలలో గెలవడమంటూ సంభవిస్తే, కులమత వివక్షతారహిత సమాజమనీ, పరపీడనా నిర్మూలనమనీ, ఆర్థిక సమసిద్ధాంతాలనీ ఇప్పుడెన్ని చెప్పినా, క్రియలో ఎవరిఅర్థాలు వారే చెప్పుకుని, వారిలో వారు తగువులాడుకుని వీరిపార్టీ ఎదిపార్టీలుగా చీలిపోక తప్పదు అధికారం రాకుండానే చీలికలిప్పుడే కనిపిస్తున్నాయి కాంగ్రెస్‌లో చీలికలకంటె ప్రజాపార్టీలో చీలికలు, అభిప్రాయభేదాలు, వ్యక్తిద్వేషాలు ముప్పెనగా వచ్చిపడేమాట నిజం పార్టీకి నిర్ణీత కార్యక్రమం, ఏకాశయం, పునాది, ప్రాతిపదిక లేకపోవడంవల్ల పేకఇల్లులా కూలిపోవడానికి ఆట్టే కాలం పట్టదు

## పంజాబ్‌లో గవర్నర్ పరిపాలన

తూర్పు పంజాబ్‌లో రాజ్యాంగనిర్మాణం ప్రకారం శాసనాధికార పరిపాలన తొలగించబడింది కాంగ్రెస్ పార్లమెంటరీబోర్డు ఆదేశంప్రకారం భార్గవా మంత్రివర్గం రాజీనామా నిచ్చింది వేరొక పార్టీ కాని, వేరొక కాంగ్రెస్‌వర్గం కాని మంత్రివర్గాన్ని నిర్మించేది లేకపోవడంవల్ల శాసనాధికార పరిపాలన ఇంక అసంభవమని గవర్నర్ చందూలాల్ త్రివేదీగారు రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ గారికి నివేదించారు అధ్యక్షులు 356 వ

రాజ్యాంగ నియమాన్ననుసరించి రాష్ట్ర పరిపాలనా బాధ్యత వహించి, గవర్నర్‌ను తమ ప్రతినిధిగా పరిపాలన కొనసాగించవలసిందని ఆజ్ఞ ఇచ్చారు

పాకిస్తాన్ పొరుగున ఉన్న తూర్పు పంజాబ్ రాష్ట్రంలో, సరిగ్గా ఎన్నికల ముందు ఈ రీతిగా శాసనాధికార పరిపాలన పతనం కావడంలో కాంగ్రెస్ వర్గ రాజకీయాలవల్ల ఎట్టి అనర్థకం సంభవిస్తున్నదో తెలుస్తున్నది దేశవిభజన అనంతరం తూర్పుపంజాబ్‌లో డా॥ గోపీచంద్ భార్గవా రెండుమార్లు, లాలా భీమసేన్ సచార్ ఒకమారు ముఖ్య మంత్రులుగా మొత్తం మూడు మంత్రివర్గాలు పరిపాలించాయి రెండుమార్లు విశ్వాస రాహిత్య తీర్మానాలను తూర్పుపంజాబ్ కాంగ్రెస్ ఎసెంబ్లీపార్టీ ఆమోదించింది మూడోసారి తీర్మానం వీగిపోయింది

ఇతర రాష్ట్రాలలోవలెనే తూర్పు పంజాబ్‌లో కూడా కాంగ్రెస్‌లో రెండు కక్షలేర్పడినాయి వీనిలో తరుణాన్నిబట్ట శాసనసభ్యులు కొందరు ఉభయపక్షాలమధ్య రంగులు మార్చుకు తిరగడం సంభవించింది చివరికి (గత మాసంలో పరిస్థితినిబట్టి) మంత్రివర్గం భార్గవాగారి చేతిలోనూ, ప్రదేశ్ కాంగ్రెస్ కార్యవర్గం సచార్, కైరాన్‌లవర్గం చేతిలోనూ స్థిరపడ్డాయి

కాని కేంద్ర కాంగ్రెస్ తూర్పుపంజాబ్‌లో వ్యవహారాల్ని ఇతర రాష్ట్రాల వ్యవహారాలతో సమానంగా పరిగణించలేకపోయింది దీనికి కారణాలు, తూర్పు పంజాబ్ పాకిస్తాన్‌కి పొరుగున ఉండడం, సిక్కుల ప్రత్యేక రాష్ట్రోద్యమం ఈగొండివల్లనూ ఆ రాష్ట్రంలో శాంతికి భంగం కలిగే ప్రమాదం ఉందని కేంద్ర ప్రభుత్వం భయం

భార్గవా, సచార్ వర్గాలు కలిసి సమిష్టిగా మంత్రివర్గం నిర్మించి సహకారంతో నెరపగలిగే అవకాశం ఎప్పుడో అంతరించింది కాని ఆవిధంగా సమిష్టిమంత్రివర్గం నిర్మించాలని కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు నిర్బంధించింది డా॥ భార్గవా ఈ ఆదేశాన్ని తిరస్కరించారు ఎసెంబ్లీ కాంగ్రెస్ పార్టీలో భార్గవా గారిపై విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించమని పార్లమెంటరీ బోర్డు సచార్ వర్గాన్ని ఆదేశించింది కాని ఈ తీర్మానం వీగిపోయింది మొత్తం 77 మంది శాసన సభ్యులలో 70 మంది కాంగ్రెస్ సభ్యులు వీరిలో 40 మంది భార్గవావర్గానికి, 24 మంది సచార్‌వర్గానికి చెందినవారు తూర్పుపంజాబ్ కాంగ్రెస్‌లో వైరాలను నివారించి సమిష్టి మంత్రివర్గాన్ని నిర్మించే అవకాశం లేనందువల్ల కాంగ్రెస్ పార్లమెంటరీబోర్డు భార్గవామంత్రి వర్గాన్ని రాజీనామా ఇవ్వాలని ఆజ్ఞ ఇచ్చి శాసనాధికార పరిపాలనను తొలగించవలసి వచ్చింది ఈ విషయంలో మొదటినుంచీ పండిట్ నెహ్రూ పట్టుదలతో ఉన్నారు డా॥ భార్గవాను రాజీనామా చెయ్యాలని ఆజ్ఞ ఇవ్వకపోతే పార్లమెంటరీబోర్డు సభ్యత్వానికి రాజీనామా ఇస్తానని పండిట్ నెహ్రూ బెదిరించారట

కాంగ్రెస్‌లో కక్షలవల్ల పరిపాలన అల్లకల్లోలంగాఉన్న ఇతర రాష్ట్రాలలోకూడా సమిష్టి మంత్రివర్గాలను స్థాపించాలని పండిట్ నెహ్రూ పట్టుబట్టినట్లయితే ఏమయేదో ఊహిస్తే చిత్రంగా ఉంటుంది మద్రాసురాష్ట్రంలో కాంగ్రెస్ వ్యవహారాలు, పరిపాలనా వ్యవహారాలు చక్కబడేవా? చక్కబడినా లేకపోయినా, అగ్రనాయక వర్గానికి కక్షలతో ప్రమేయం లేదనే నమ్మకం ప్రజలకు కలిగేది

ఇప్పుడు పంజాబ్‌లో గవర్నర్ పరిపాలన ప్రారంభమైనందువల్ల రాష్ట్రానికి పరిపాలనా ప్రతిష్టంభన తప్పవచ్చును కాని కాంగ్రెస్‌లో కక్షల కల్లోలం, వైరాలు తగ్గే సూచనలు కనపడవు మంత్రివర్గంలో ఉభయ వర్గాలనూ చేర్చడానికి ప్రయత్నించినట్లే అగ్రనాయకవర్గం పంజాబ్ కాంగ్రెసు కమిటీలో కూడా భార్గవావర్గానికి స్థానమిస్తేగాని వైరాలు తగ్గవు రానున్న ఎన్నికలలో పంజాబ్ కాంగ్రెస్ జయించాలంటే కాంగ్రెస్‌లో ఐకమత్యం అవసరం ఐక్యత సాధించలేని పక్షంలో, ప్రత్యక్షంగా ప్రత్యేక సిక్కు రాష్ట్రాన్ని, పరోక్షంగా ప్రత్యేక సిక్కు రాజ్యాన్ని స్థాపించాలని ఆందోళన చేస్తున్న సిక్కులు, పాకిస్తాన్‌పై పగతీర్చుకోవాలని కోరే హిందూ మహాసభ రాష్ట్రంలో శాంతిని భంగపరచగల ప్రమాదం ఉంది

అయితే నిత్యం కీచులాడుకునే మంత్రుల పరిపాలన తొలగిపోయినంతమాత్రంచేత, ప్రభుత్వోద్యోగులు వారికంటె మేలుగా పరిపాలన నిర్వహించగలరనే నమ్మకం కూడా ఆశ్చర్యం ఈ రోజుల్లో మిగలడం లేదు.

## పర్షియాలో క్లిష్టపరిస్థితి :

పర్షియాలో పరిస్థితి ప్రమాదభరితంగా ఉందని అమెరికన్ విదేశాంగమంత్రి ఎచిసన్ అన్నారు బ్రిటన్ సైన్యాలను పంపాలా వద్దా అనే విషయమై బ్రిటిష్ పార్లమెంట్‌లో చర్చ జరిగింది రష్యన్ సేనలు పర్షియా పొరుగున సన్నాహాలు చేస్తున్నాయని పుకార్లు బయలుదేరుతున్నాయి బ్రిటిష్ పెరాషూట్ దళాలు, "లారీదళాలు" సిద్ధపరచబడుతున్నాయని రోజుకొక బ్రిటిష్ స్థావరంనుంచి బ్రిటిష్‌అధికారులు పనిగట్టుకుని పత్రికా ప్రకటనలు చేస్తున్నారు

ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ తరఫున ముగ్గురు ప్రతినిధులను బ్రిటిష్ ప్రభుత్వం టెహరాన్ నగరానికి పంపి సమాలోచనలకు అంగీకరించింది కాని బ్రిటిష్ ప్రతినిధులతో పర్షియన్ ఆయిల్ బోర్డు సమాలోచనలు రెండురోజులు దాటి సాగలేదు ఈ రాయబారాలు విఫలంకాక తప్పదని అందరూ భావించినదె ఆయిల్ పరిశ్రమను పర్షియన్ ప్రభుత్వం అధీనమైనట్లు మొదట అంగీకరించి, ఆ షరతుపైనే ఏ విధంగా యాజమాన్యం ఒప్పగించాలి,

పెట్రోల్ అమ్మకానికి ఎటువంటి ఏర్పాట్లు చేసుకోవాలి, అనే విషయాలను చర్చించాలని పర్షియన్ ప్రభుత్వం పట్టుబట్టింది అలా కాకుండా, ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీతో 1933 లో చేసుకున్న ఒడంబడికలో పర్షియన్లకి సమ్మతంకాని షరతులేవి, ఆ ఒడంబడికను ఏవిధంగా సవరణ చెయ్యవచ్చును, లాభాలలో పర్షియన్లకోరే వాటా ఎంత, మొదలైన విషయాలను చర్చించాలని బ్రిటిష్ ప్రతినిధివర్గం పట్టుబట్టింది మొదటిరోజు చర్చల ఫలితంగా తేలిన పరిస్థితి ఇది అంటే ఆయిల్ పరిశ్రమ తను వాస్తగతమైపోయినట్లు భావించి, ఇంక ఆపైన చెయ్యవలసిన తతంగాన్ని గురించి చర్చించాలని పర్షియన్ ప్రభుత్వం ఉద్దేశం కాని అసలీ అసంతృప్తి సమస్య ఎందుకుత్పన్నమైనాయో, ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ అంతం కాకుండా ఎప్పటిమాదిరిగా నిర్వహించాలంటే ఎటువంటి కొత్తఒడంబడిక సమ్మతమౌతుందో, తేల్చుకోవాలని బ్రిటిష్‌వారి ప్రయత్నం అందువల్ల ఇంక సమాధానం కుదిరే అవకాశం లేదని మొదటిరోజునే తేలిపోవడంతో, పర్షియన్ ప్రభుత్వం సంప్రతింపులకు ముందు ఒక షరతు అంగీకరించాలని బ్రిటిష్ ప్రతినిధులకు చెప్పింది మార్చి 20వ తేదీనుంచీ (అనగా ఆయిల్ పరిశ్రమను ప్రభుత్వపరంచేసుకునే శాసనం షా ఆమోదంపొందినప్పటినుంచీ) పరిశ్రమ పర్షియన్ ప్రభుత్వానికి చెందినదని గుర్తించి, అప్పటినుంచి ఆయిల్ అమ్మగా వచ్చిన ఆదాయంలో ఖర్చులు పోను, నాలుగింట మూడువంతులు పర్షియన్ ప్రభుత్వంపేర పర్షియన్ నేషనల్ బాంక్‌లో కట్టాలనీ, మిగతా ఒకవంతూ ఏదో ఒక బ్రిటిష్ బాంక్‌లో కట్టి నష్టపరిహారం లెక్కలు తేలేవరకూ అది అలానే ఉంచాలనీ పర్షియన్ ప్రభుత్వం షరతుపెట్టింది

బ్రిటిష్ ప్రతినిధులు ఏ ఉద్దేశంతో వచ్చారో, అది దీనితో భంగపడిపోతుంది అందువల్ల బ్రిటిష్ ప్రతినిధివర్గం ఈ షరతును నిరాకరించింది వెంటనే పర్షియన్ ప్రభుత్వం సంప్రదింపులను విరమించి, పరిశ్రమను, అబడాన్ రిఫైనరీ యంత్రాగారాలనూ స్వాధీనపరుచుకుని స్వయంగా నిర్వహించాలని పర్షియన్ ప్రభుత్వం పర్షియన్ ఆయిల్‌బోర్డుకు ఆజ్ఞ ఇచ్చింది యంత్రాగారాలను స్వాధీనపరుచుకోవాలని జూన్ 20వ తేదీని ఆజ్ఞఇచ్చింది మరునాడు టెహరాన్ నగరంలోనూ, అబడాన్ ప్రాంతంలోనూ, పర్షియన్ ప్రజలు ఊరేగింపులు జరిపారు కనపడిన చోటెల్ల ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీబోర్డులు తీసివేశారు యంత్రాగారాల కార్యాలయంపైన పర్షియన్‌పతాక ప్రతిష్ఠించబడింది కంపెనీ ప్రచారకార్యాలయాలు ప్రభుత్వాజ్ఞప్రకారం మూసివెయ్యబడినాయి కంపెనీకిచెందిన పత్రిక నిషేధించబడింది కంపెనీ ఉద్యోగులందరూ పర్షియన్ ప్రభుత్వోద్యోగులని ప్రభుత్వం ప్రకటించింది కాని కంపెనీ ఉద్యోగులలో బ్రిటిష్‌వారు ఆయిల్‌బోర్డు ఆజ్ఞల్ని పాటించబోరని తెలిపారు పాటించవద్దని కంపెనీ బ్రిటిష్ మేనేజరు ఆదేశమిచ్చాడు బ్రిటిష్ ఉద్యోగుల ప్రాణాలకు ముప్పు సంభవించినట్లయితే బ్రిటిష్ ప్రభుత్వం ఊరుకోదని బ్రిటిష్ విదేశాంగమంత్రి మారిసన్ హెచ్చరించాడు

పర్షియన్ ప్రభుత్వం తొందరపడకూడదని అమెరికన్ విదేశాంగమంత్రి, పర్షియాలోని అమెరికన్‌రాయబారి పర్షియన్ ప్రభుత్వాన్ని హెచ్చరించారు బ్రిటిష్‌వారిని వెళ్లగొట్టినట్లయితే, పర్షియన్ పరిశ్రమల్ని నిర్వహించడానికి అమెరికన్లు ఎవ్వరూ సహాయం చెయ్యరని అమెరికన్ ప్రభుత్వమూ, అమెరికన్ ఆయిల్ కంపెనీలూ ప్రకటించాయి అయినప్పటికీ పర్షియన్ ప్రభుత్వం పట్టుదలను విడవటంలేదు ఆయిల్ పరిశ్రమ నిలిచిపోయినాసరే కాని ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీని ఇంక ఎంతమాత్రం సహించబోరని పర్షియన్ ప్రధాని డా॥ మహమ్మద్ ముసాదిక్ ప్రకటించాడు

ఈ సందర్భంలో పర్షియన్ ఆయిల్ పరిశ్రమను ప్రభుత్వం స్వాధీనపరుచుకోడంలో వారి ఉద్దేశాలను గురించి సర్వత్రా దుష్ప్రచారం సాగుతోంది బ్రిటిష్‌వారిస్తున్న ధనం చాలక దురాశతో ఇటువంటిపనికి పూనుకున్నారని బ్రిటిష్‌వారు ప్రచారం చేస్తున్నారు కొందరు అమెరికన్లే, ముఖ్యంగా అమెరికన్ విదేశాంగశాఖ సహాయమంత్రి మెఘీ, బ్రిటిష్‌వారిని వెళ్లగొట్టడానికి పర్షియన్ రాజకీయ నాయకులను రహస్యంగా ప్రోత్సహించారని బ్రిటన్‌లో అనేకులు ఆరోపించారు ఇది సర్వాబద్ధమని అమెరికన్లు అన్నారు కమ్యూనిస్టుల ప్రోద్బలంపైన పర్షియన్ ప్రభుత్వం ఈ సాహసానికి దిగిందనీ, దీని ఫలితంగా రాగల అరాచకంకోసం వారు వేచి ఉన్నారనీ అమెరికాలో ప్రచారం జరుగుతోంది కాని పర్షియన్ ప్రభుత్వమూ, ప్రజలూ ఏకకంఠంతో ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ అంతమైపోవాలని ఆందోళన చేస్తున్నారంటే, పర్షియా రాజకీయదాస్యంనుంచి ముక్తి పొందడానికేనని నాయకులు స్పష్టపరిచారు ఇందులో కమ్యూనిస్టుల ప్రమేయం లేదని బ్రిటిష్‌వారే అంగీకరించారు పర్షియన్ ఆయిల్ పరిశ్రమ బ్రిటిష్‌వారి అధీనంలో ఉండడంవల్లనే రెండో ప్రపంచ యుద్ధంలో పర్షియాను, బ్రిటిష్, అమెరికన్ రష్యన్ సైన్యాలు ఆక్రమించడం సంభవించింది ప్రస్తుతం ప్రపంచరాజకీయాలలో అమెరికా రష్యాల మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్న, ప్రత్యక్ష సంఘర్షణల ఫలితంగా మళ్లీ త్వరలోనే పర్షియా పరాయి సైన్యాల ఆక్రమణకు గురికాక తప్పదని పర్షియన్ ప్రజలకు తెలుసును అంతేకాదు రష్యా అమెరికాలమధ్య ప్రత్యక్షయుద్ధం సంభవించేపక్షంలో ఉభయసైన్యాలకూ పర్షియా కూడా ఒక రణరంగం కాగలదని వారికి తెలుసును ఎప్పుడో ఒకప్పుడు తమ ఆయిల్ పరిశ్రమ సంరక్షణ మిషతో బ్రిటిష్‌వారు తమ సైన్యాలను పంపి దక్షిణ పర్షియను ఆక్రమించగలరు ఈముప్పు నివారించాలంటే పరదేశాలవారికి పర్షియాలో ఆలంబనం లేకుండా చెయ్యవలసిన అగత్యం ఉంది అందువల్ల ప్రత్యక్షయుద్ధం సంభవించకముందే, బ్రిటిష్‌వారికి గల ఈ ఆలంబనాన్ని తొలగించినట్లయితే పరుల ఆక్రమణకు బలికాకుండా తప్పించుకునే అవకాశం పర్షియాకు మిగుల్తుంది ప్రస్తుతపరిస్థితే ఇందుకు అనుకూలమైనదని వారికి తెలుసును ఇప్పుడైతేనే బ్రిటిష్‌వారు తమ సైన్యాలను పంపడానికి జంకుతారు రష్యాతో పర్షియా 1922 లో చేసుకొన్న ఒడంబడికప్రకారం అన్యదేశాల సైన్యాలు పర్షియాదేశం ప్రవేశిస్తే, తమ సైన్యాలను పంపే అధికారం రష్యాకు ఉంటుంది ప్రపంచయుద్ధం ప్రారంభం కావడానికి పర్షియా హేతువు కావడం బ్రిటన్‌కికాని, అమెరికాకుగాని ఇష్టం ఉండదు ప్రారంభమైనతరువాత విషయం వేరు అందువల్ల ఈతరుణంలోనే పర్షియాకుగల ప్రమాదావకాశాన్ని నివారించడానికి వీలుంది.

ఇప్పుడు సైన్యాలను పంపకుండానే బెదిరించి సాధ్యమైనంతవరకూ తమ ఆయిల్ పరిశ్రమను నిలబెట్టుకోవాలని బ్రిటన్ ప్రయత్నిస్తోంది కాని పర్షియా ఈ బెదిరింపులకు లొంగడంలేదు మధ్య




## ఆదివారం, జూన్ 17

టెహరాన్‌లోని ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీవారి పత్రికను పర్షియన్ ప్రభుత్వం నిషేధించింది అబడాన్ రేవు నుంచి బ్రిటిష్ స్త్రీలు పిల్లలతో సహా బయలుదేరి స్వదేశం వెళ్లిపోయారు

—క్యూబాలోని బ్రిటిష్ రైల్వేలను ప్రభుత్వం స్వాధీనపరుచుకోగలదని క్యూబాఅధ్యక్షుడు కార్లోక్ ప్రయో హవానా నగరంలో ప్రకటించాడు

—జపాన్ శాంతిసంధి సమాలోచనలలో చీనాతరఫున ఏప్రభుత్వం పాల్గొనాలో నిర్ణయించే బాధ్యతను ముందు జపాన్‌కు విడిచిపెట్టడం మేలని, ప్రస్తుత సమాలోచనలలో ఏ ప్రభుత్వాన్నీ చేరనివ్వడం అనవసరమనీ బ్రిటన్, అమెరికాలు నిర్ణయించుకున్నట్టు జాన్ ఫాస్టర్ డలెస్ తెలిపారు

—కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ నియమాలు, ఆశయ విధులు పాట్నా సమావేశంలో ఆమోదించబడినాయి

—రానున్న ఎన్నికలలో కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీతో సహకరించడానికి సోషలిస్టులు సమ్మతించగూరని శ్రీ జై ప్రకాశ నారాయణగారు పాట్నాలో ప్రకటించారు

—పంచదారపై కంట్రోల్‌ను తొలగించవలసిందని మద్రాసుప్రభుత్వం భారత ప్రభుత్వాన్ని కోరుతున్నదని మంత్రి రోష్ విక్టోరియాగారు ప్రకటించారు.

—చేనేత సత్యాగ్రహం మద్రాసురాష్ట్రమంతటా నిన్న ప్రారంభమైనట్లు వార్తలు వచ్చాయి

## సోమవారం, జూన్ 18·

—ఆయిల్ అమ్మకంవల్ల వచ్చిన ఆదాయంలో 75 % తమ కొప్పగించాలని పర్షియా ప్రభుత్వం ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ కిచ్చిన ఆజ్ఞను పాటించ లేరని బ్రిటిష్‌ప్రభుత్వం తెలియపరిచింది

—కొరియాలో మిత్రరాజ్య సైన్యాల విజయాల ఫలితంగానైనా శాంతి సాధించబడవచ్చునని సమితి కార్యదర్శి ట్రిగ్వేలీ అన్నారు

—కొరియా సమస్యనుగురించి ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వేలీ కొన్ని ముఖ్యదేశాల ప్రతినిధులతో సంప్రదించారు

—ఐర్లండ్ విభజన అంతమయేవరకూ ఐర్ రిపబ్లిక్ అట్లాంటిక్ పాక్ట్‌లో చేరబోదని ఐర్ నూతన ప్రధాని డి వెలరా ప్రకటించారు

—దక్షిణయూరప్‌లో మిత్రరాజ్యాల సైన్యాలకు అధిపతిగా అమెరికన్ ఎడ్మిరల్ రాబర్ బి కార్నీని నియమించారు అయితే బ్రిటిష్ మెడిటరేనియన్ నౌకాబలాలు ఇతని అధీనంలో ఉండవని లండన్ అధికారి ఒకడు ప్రకటించాడు

—జపాన్‌తో శాంతి సంధి సమాలోచనల్లో తమ ప్రభుత్వం పాల్గొనకపోతే సంధి సక్రమంగా పరిగణించబడదని జనరల్ చియాంగ్‌కై షేక్ ప్రకటించాడు

—జపాన్‌లో శాంతి సంధి సమాలోచనల విషయమై అమెరికన్ ఉద్యోగులు కరాచీలో పాకిస్తాన్ ప్రభుత్వంతో జరిపిన సమాలోచనలు తృప్తిగా నెరవేరినవని అమెరికన్ ప్రతినిధి జాన్ ఎలిసన్ ప్రకటించాడు

—ఫ్రాన్స్‌లో ఎన్నికల ఫలితంగా ప్రస్తుత ప్రభుత్వంలోని పార్టీలు, అనగా సోషలిస్టులు, రాడికల్స్, పాపులర్ రిపబ్లికన్స్, అధిక స్థానాలు గెలిచారు ఫ్రెంచి ఇండియాలో 'సోషలిస్టు' గౌబర్ట్ గెలిచాడు

—భారతదేశంనించి చీనా దేశానికి యుద్ధావసరవస్తువులు అసలు ఎగుమతి కావడమే లేదని భారతప్రభుత్వం ఐక్యరాజ్యసమితికి తెలియపరిచింది

—రాజ్యాంగ నిబంధనల సవరణ శాసనాన్ని రిపబ్లిక్ అధ్యక్షులు డా॥ రాజేంద్రప్రసాద్ ఆమోదించారు

—మద్రాసు రాష్ట్రంలో రేషనింగ్ అములులోఉన్న ప్రాంతాలలో రేషన్ ప్రమాణాన్ని జూన్ 24 మొదలు 9ఔన్సుల నుంచి 12 ఔన్సులకు హెచ్చిస్తూ ప్రభుత్వం ఆజ్ఞ ఇచ్చింది ఇందులో బియ్యం 8 ఔన్సులే ఉంటుంది గోధుమలు 4 ఔన్సులు ఇస్తారు రేషనింగ్ అములులో లేని ప్రాంతాలలో చౌక షాపులలో ఇకనుంచి 6 ఔన్సులకుబదులు 12 ఔన్సుల చొ॥ ఇస్తారు అయితే బియ్యం 2ఔన్సులే ఇస్తారు గోధుమలు 10 ఔన్సులు ఇస్తారు

—ప్రజాపార్టీ నివేదికనుగురించి కలకత్తాలో ప్రసంగిస్తూ రంగాగారు, కేవలం ప్రభుత్వ ప్రతికూల కార్యక్రమాన్ని అనుసరించకూడదనీ, ప్రజల అభ్యున్నతికోసం సమగ్రమైన ప్రణాళిక ప్రతిపాదించబడాలనీ అన్నారు

—64 మంది చేనేత సత్యాగ్రహులు చెన్నపట్నంలో అరెస్టయినారు

## మంగళవారం, జూన్ 19:

—తమ సూచనకు బ్రిటిష్ ప్రభుత్వమిచ్చిన సమాధానాన్ని నిరాకరిస్తూ, ఆ సూచనకు అంగీకరిస్తేగాని సమాలోచనలు జరగరాదని పర్షియన్ ప్రభుత్వం ప్రకటించింది పర్షియన్ ప్రభుత్వం సమాలోచనలు విరమించింది తమ సూచనకు సమ్మతించకపోతే ఆయిల్ యంత్రాగారాలను వశపరుచుకోగలదనికూడా పర్షియన్ ప్రభుత్వం ప్రకటించింది

---

ప్రాచ్యంలో రక్షణ సన్నాహాలు బొత్తిగా లోపభూయిష్ఠంగా ఉన్న ప్రస్తుత పరిస్థితిలో బ్రిటన్ అమెరికా ఫ్రాన్స్ దేశాల రక్షణశాఖాధికారులు మంతనాలు జరుపుతున్నారు ఎంతగా సన్నాహాలు చేసినా మధ్య ప్రాచ్యంలో రష్యాతో తలపడ్డానికి బ్రిటన్ అమెరికాలు సిద్ధంగా లేవు ఆ కారణంవల్ల పర్షియాపట్టుదల నెరవేరే సూచనలు కనపడుతున్నాయి

పర్షియా పరిస్థితి ఏవిధంగా పరిష్కారమైనప్పటికీ, పరిష్కారం కాక ప్రచ్ఛన్న సంఘర్షణ మరొకరూపంలో కొనసాగినప్పటికీ, ఒక్కటిమాత్రం స్పష్టపడుతోంది బ్రిటన్ అమెరికాలు ఆసియా దేశాల్ని ఇంకెంతమాత్రం మభ్యపుచ్చలేవు వాణిజ్య పారిశ్రామిక వ్యవహారాలలో ప్రాచ్య, పాశ్చాత్య దేశాలమధ్య సంబంధాల రూపం మార్పు చెందుతోందని గుర్తించకతప్పదు ★

—అమెరికన్ శాసనాన్ని అనుసరించి మొదటితడవ 9600 టన్నుల గోధుమలు ఫిలడెల్ఫియా రేవులో భారత రాయబారి విజయలక్ష్మీ పండిట్‌గారికి ఒప్పగించబడినాయి అమెరికన్ రేవు కార్మికుల సమ్మె నిర్వాహకులు, భారతదేశానికి ఆహార సామగ్రిని పంపే ఓడలలో సమ్మె జరగదని ప్రకటించారు ఇకనుంచి ప్రతిమాసం 4 లక్షల టన్నులు భారతదేశానికి రవానా కాగలవని ఎచిసన్ చెప్పారు

—అట్లాంటిక్ పాక్ట్ దేశాల సైనికులు స్వదేశంలో కాక అన్యదేశాలలో ఉన్నప్పుడు వారిపౌర ప్రతిపత్తి ఏరీతిగా నిర్ణయమవాలో పాక్ట్ దేశాలమధ్య ఒప్పందం కుదిరింది

—అమెరికాలో నిర్బంధ సైనిక నియామక శాసనాన్ని మరొక నాలుగేళ్ళకు పొడిగించే శాసనం ట్రూమన్ ఆమోదం పొందింది

—బ్రిటన్‌లో వ్యాపారులూ, పారిశ్రామికదారులూ ఏకమై అమ్మే వస్తువులకు చిత్తంవచ్చిన ధరలను నిర్ణయించే పద్ధతిని నిర్మూలించడానికి బ్రిటిష్‌ప్రభుత్వం నిశ్చయించింది

—ప్రపంచ బాంక్ వద్దనుంచి భారత ప్రభుత్వం ఇంతవరకూ 7 కోట్ల 85 లక్షల డాలర్లు ఋణం తీసుకుందని ప్రకటించబడింది

—పాకిస్తాన్, భారతదేశాల మధ్య హిందువులు, ముస్లిముల వలసల నిమిత్తం పర్మిట్లుఇచ్చే విధానంగురించి ఉభయ ప్రభుత్వాలకూ ఒప్పందం కుదిరింది

—పదుగ్గురు భారతీయులు (రచయితలు, డాక్టర్లు, ఇంజనీర్లు మొదలైనవారు) రష్యా పర్యటననిమిత్తం బయలుదేరారు

—రాజ్యాంగ నియమ సవరణ శాసనం నియమవిరుద్ధమని ఆక్షేపణ తెలుపుతూ పదిమంది ఉత్తరప్రదేశ్ జమీందారుల తరఫున సర్ జగదీశ్ ప్రసాద్ గారు సుప్రీంకోర్టులో పిటిషన్ పెట్టారు

—భారతప్రధాని పండిట్ నెహ్రూ బీహార్‌లోని క్షామప్రాంతాలను దర్శించారు దేశంలో క్షామం నివారించబడిందని నెహ్రూ అన్నారు

—మెడికల్, ఇంజనీరింగ్, ఎగ్రికల్చరల్, వెటర్నరీ కాలేజిలలో విద్యార్థులను ప్రవేశపెట్టడానికి మద్రాసుప్రభుత్వం కొత్తనియమాలను ప్రకటించింది

—ఎన్నికలు వాయిదా వేయాలని తాముకోరినట్లు ప్రచురించబడినవార్త అసత్యమని కాంగ్రెస్ అధ్యక్షులు టాండన్‌గారు కాన్పూర్‌లో ప్రకటించారు

## బుధవారం, జూన్ 20

—ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ యంత్రాగారాలను పర్షియా ప్రభుత్వం వెంటనే స్వాధీనపరుచుకోవాలని తన ఉద్యోగులకు ఆజ్ఞ ఇచ్చింది

—పర్షియాలో పరిస్థితి క్లిష్టంగా ఉన్నట్లు అమెరికన్ విదేశాంగ మంత్రి ఎచిసన్ ప్రకటిస్తూ, పర్షియా ప్రభుత్వం సమాలోచనలను విరమించకూడదన్నారు

—పర్షియాలో బ్రిటిష్ జాతీయులకు ముప్పువచ్చినట్లయితే బ్రిటిష్‌ప్రభుత్వం ఊరుకోదని బ్రిటిష్ విదేశాంగమంత్రి హెర్బర్ట్ మారిసన్ హెచ్చరించాడు

—టెహరాన్ సమాలోచనలను విరమించుకుని రావలసిందని బ్రిటిష్ ప్రతినిధివర్గాన్ని బ్రిటిష్ ప్రభుత్వం ఆదేశించింది

—అట్లాంటిక్ పాక్ట్‌నుకూడా విదేశాంగ మంత్రుల చర్చనీయాంశాలలో చేర్చితీరాలని సోవియట్‌ప్రభుత్వం పారిస్‌లోని అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి డిప్యూటీ మంత్రులకు తెలిపింది కార్యక్రమ నిర్ణయం నిమిత్తం పారిస్ సమాలోచనలను నిలిపివెయ్యరాదనికూడా సోవియట్‌ప్రభుత్వం ఆదేశించింది

—అమెరికాలో కొందరు సైనికాధిపతులు సూచిస్తున్న చీనాపై నౌకాదిగ్బంధాన్ని కెనడా ఒప్పుకోదని కెనడాప్రధాని పార్లమెంట్‌లో ప్రకటించాడు

—కొరియా యుద్ధంలో పాల్గొంటున్న పదిదేశాలూ యుద్ధాశయాలను స్పష్టపరచాలని ఆస్ట్రేలియా సూచించినట్లు వాషింగ్టన్ వార్త

—జపాన్‌తో శాంతి సంధికిసరైన వాతావరణం వ్యాపింపచెయ్యాలనే ఉద్దేశంతో అమెరికన్ అధికారులు నిర్బంధాలను క్రమంగా తొలగించనారంభించారు దీనిప్రకారం వెంటనే 60 వేలమంది యుద్ధనేరస్థులు విడుదలౌతున్నారు

—అమెరికాలో కమ్యూనిస్టుపార్టీపై ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలలో రెండోమెట్టుగా రెండో తరగతి కమ్యూనిస్టు నాయకవర్గాన్ని 17 మందిని అరెస్టుచేశారు మొదటి తరగతివర్గం పదకొండుమందికీ ఇదివరకే శిక్షలు విధించబడినాయి

—ఐక్యరాజ్యసమితి విద్య, విజ్ఞాన సంస్కృతి సంఘంలో చీనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని చేర్చుకోవాలని భారత ప్రభుత్వం వాదించింది కాని ఈ ప్రతిపాదన నిరాకరించబడింది

—తూర్పు పంజాబ్‌లో శాసనసభను రద్దుపరిచి, పరిపాలనా వ్యవహారాలను రిపబ్లిక్ అధ్యక్షులు అధీనంచేసుకుని, గవర్నర్‌వల్ల నిర్వహింపచేయడానికి ఆజ్ఞ ఇచ్చారు ఈ ఆజ్ఞపట్ల అసమ్మతి సూచకంగా ఎసెంబ్లీ స్పీకర్ రాజీనామా నిచ్చారు

—రైల్వే కార్మికుల కిచ్చిన రు 5 కరువుభత్యం హెచ్చింపు బొత్తిగా చాలదనీ, కనీసం రు 40 హెచ్చించాలనీ అఖిల భారత రైల్వే కార్మికసమితిఅధ్యక్షులు జై ప్రకాశ్ నారాయణగారన్నారు

—దేశంలో వస్త్రానికీ నూలుకీ వచ్చిన కరువు ఆగస్టులోకాని తీరదని మంత్రి పెరుమాళ్ స్వామిరెడ్డిగారన్నారు

—ఆంధ్ర, సంస్కృత పండితులు రచయితలుఅయిన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు బరంపురంలో స్వర్గస్థులైనారు

—64 మంది చేనేత సత్యాగ్రహులు చెన్నపట్నంలో అరెస్టయినారు

## గురువారం, జూన్ 21

పర్షియాలో ఆయిల్ పరిశ్రమను ప్రభుత్వం అధీనం చేసుకోవాలని ఇచ్చిన ఆజ్ఞకు పర్షియన్ మజ్లిస్ ఆమోదించింది

—టెహరాన్ నగరంలో బ్రిటిష్ ప్రతికూల ప్రదర్శనలు జరిగాయి అబడాన్ యంత్రాగారాల కార్యాలయంపైన పర్షియన్ పతాక ప్రతిష్ఠించబడింది

—ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీ యంత్రాగారాలను పర్షియన్ ప్రభుత్వం స్వాధీన పరుచుకోకుండా నిలుపుతూ ఆజ్ఞఇవ్వవలసిందని బ్రిటిష్ ప్రభుత్వం అంతర్జాతీయ న్యాయస్థానాన్ని కోరింది

—పర్షియన్ ఆయిల్ పరిశ్రమ ఉద్యోగులను ఇప్పుడు తరలించే ఉద్దేశం లేదని బ్రిటిష్ విదేశాంగమంత్రి మారిసన్ బ్రిటిష్ పార్లమెంటులో ప్రకటించారు

—అట్లాంటిక్ పాక్టునుకూడా చర్చనీయాంశంగా చేర్చాలని సోవియట్ ప్రభుత్వం పెట్టిన షరతును నిరాకరించి, ఇంక పారిస్ సమాలోచనలను కట్టిపెట్టాలని అమెరికన్ బ్రిటిష్, ఫ్రెంచి డిప్యూటీ మంత్రులు నిశ్చయించుకున్నారు

—మంచూరియాలో కమ్యూనిస్టుల విమానబలాల వృద్ధిని గురించి సమితి సేనాధిపతులు చర్చించారు

—కొరియాలో కైసాఙ్ రైల్వే జంక్షన్ సమితి సేనల వశమయింది

—ఇండియా, పాకిస్తాన్, సింహళాలు మినహా మిగతా ఆరు బ్రిటిష్ కామన్వెల్త్ దేశాల రక్షణశాఖామంత్రులూ, తదితర రక్షణ శాఖోద్యోగులూ లండన్‌లో సమావేశమై కామన్వెల్త్ దేశాల రక్షణగురించి రహస్య సమాలోచనలు జరిపారు

—చీనా రష్యాలమధ్య వాణిజ్య పుటొంబడిక ఒకటి కుదిరినట్లు టాస్ ప్రకటించింది

—జెనీవా అంతర్జాతీయ కార్మిక సంస్థలో జపాన్ ప్రతినిధులు ప్రవేశపెట్టబడ్డారు

—అఖిలభారత రైల్వే కార్మిక సమితికి చెందిన 25 సంఘాలలోనూ దాదాపు నూరింట 95 మంది సమ్మెకు సుముఖంగా ఉన్నారని బాలట్ వల్ల తేలినట్లు శ్రీ యస్ గురుస్వామిగారు ప్రకటించారు

—నాజూకు రకం వస్త్రం ధరలను నూరింట 1 వంతు చొప్పున, ఒక మోస్తరు నాజూకు రకం వస్త్రం ధరలను నూరింట 11½ మొదలు 14 వంతుల చొ॥ తగ్గించినట్లు భారతప్రభుత్వం ప్రకటించింది

—ఒరిస్సారాష్ట్రప్రభుత్వం క్లిష్టఆర్థిక సమస్యలో చిక్కుకుందని కటక్ వార్త

—మైసూరురాజ్యంలో కర్షక సత్యాగ్రహ సందర్భంలో అరెస్టయిన డా॥ రామమనోహర లోహియా విడుదలనిమిత్తం మైసూరు హైకోర్టులో పెట్టబడిన హెబియాస్ కార్పస్ పిటిషన్ నిరాకరించబడింది

## శుక్రవారం, జూన్ 22 :

—కొరియాలో యుద్ధానికి సుముఖంగా 1950 జూన్ 25 తీర్మానానికి వోటుచేసిన దేశాలను సైన్యాలను పంపాలని కోరవలసిందిగా అమెరికన్ ప్రభుత్వం ఐక్యరాజ్య సమితి కార్యదర్శి ట్రిగ్వీ లీని ఆదేశించింది

—కాశ్మీర్‌లో రాజ్యాంగపరిషత్సమావేశాన్ని జరపకుండా భారత ప్రభుత్వాన్ని నివారించాలని పాకిస్తాన్ ప్రభుత్వం భద్రతామండలిని కోరింది

—ఫ్రెంచి ఇండియా ఎన్నికలలో అక్రమం జరిగిందని ఆరోపిస్తూ ఓడిపోయిన ఒక అభ్యర్థి మద్రాసులో పత్రికా ప్రకటన చేశాడు

—సుప్రసిద్ధ ఆంధ్రచరిత్ర పరిశోధకులు, పండితులు, గ్రంథకర్తలైన కళాప్రపూర్ణ డా॥ చిలుకూరి నారాయణరావుగారు మద్రాసులో దివంగతులైనారు

—వాడుకనిమిత్తం కొనేవారికొనుగోలు ధరలు పెంచకుండా ఉక్కు ఎక్స్-ఫాక్టరీ ధర టన్ను రూ 30 చొ॥ పెంచడానికి భారతప్రభుత్వం ఉక్కుఫాక్టరీలకు అనుమతి ఇచ్చింది

—దేశంలో ఆర్థికపరిస్థితి చక్కబడుతున్నదనీ, ధరలింక పెరగకుండా స్థిరపడుతున్నవనీ భారత ఆర్థికమంత్రి దేశముఖ్ బొంబాయిలో చెప్పారు

—మద్రాసుప్రభుత్వం పంచవర్షప్రణాళికలో ప్రజారోగ్యాభివృద్ధి నిమిత్తం మొదట వేసిన అంచనా రు 12 కోట్లను రు 8 కోట్లకు తగ్గించవలసి వచ్చిందని మంత్రి రాజన్‌గారు పత్రికాసమావేశంలో ప్రకటించారు

—చెన్నరాష్ట్రంలో అవసరమైన చోట్ల ఎలిమెంటరి స్కూళ్లు షిఫ్ట్‌సిస్టమ్‌ను అనుసరించవచ్చునని రాష్ట్రప్రభుత్వం ప్రకటించింది

—మైసూరు ప్రభుత్వం సోషలిస్టు నాయకుడు డా॥ రామమనోహర లోహియాను విడుదలచేసింది

—ప్రపంచంలో అమెరికన్ స్థావరాల నిర్మాణంనిమిత్తం ఆరున్నర బిలియన్ల డాలర్లు మంజూరుచేయాలని అమెరికన్ కాంగ్రెస్‌ను ప్రభుత్వం కోరింది

## శనివారం, జూన్ 23 ·

—కొరియా యుద్ధంలో పాల్గొంటున్న పక్షాల ప్రతినిధులందరూ 38 వ అక్షాంశరేఖా ప్రాంతంలో ఒక చోట సమావేశమై యుద్ధవిరమణ సమస్యనుగురించి చర్చించాలని సోవియట్ రష్యన్ ప్రతినిధి జాకబ్ మాలిక్ సూచించాడు

—పర్షియన్ ఆయిల్ సమస్య కిష్టంగా ఉన్నపరిస్థితిలో రష్యా కల్లోలం తెచ్చిపెట్టడానికి కుట్ర పన్నుతున్నదని అమెరికన్ ప్రభుత్వం ఆరోపించింది

—పర్షియన్ ఆయిల్ పరిశ్రమలో బ్రిటిష్‌ఉద్యోగులు, పర్షియన్ ప్రభుత్వాధీనంలో పరిశ్రమలో పనిచేసేదీ చెయ్యనిదీ 32 గంటల్లో తెలపవలసిందిగా ఉద్యోగులకు ప్రభుత్వం ఆయిల్ బోర్డుద్వారా తాఖీగు పంపింది

—బ్రిటిష్ బాంకులలో పర్షియా పేరనున్న 3 కోట్ల పౌనుల స్టెర్లింగ్ నిలవలను బ్రిటిష్‌ప్రభుత్వం బిగబట్టినట్లులండన్‌వార్త

—1951 జూలైనుంచి అక్టోబరు ఆఖరు వరకూ లక్షా 45 వేల టన్నుల నారను భారతదేశానికి ఎగుమతిచెయ్యగలదని పాకిస్తాన్ ప్రభుత్వం ప్రకటించింది

—వాక్స్వాతంత్ర్యాన్ని అరికట్టే రాజ్యాంగనియమ సవరణగురించి చర్చించడానికి అఖిలభారత పత్రికా సంపాదకుల సంఘం బొంబాయిలో సమావేశమయింది



---

వర్తకుడు (కొడుకుతో) అబ్బీ, వర్తకంలో పైకిరావాలంటే నియమమూ, వివేకమూ అనే రెండు గుణాలుండాలి.

కొడుకు : నియమమంటే?

వర్తకుడు నూరు ఆరయేది, ఉన్నదంతా తుడుచుకు పెట్టుకుపోయేది, ఎట్టిబాధలైనా కలిగేది ఇచ్చిన మాట నెగ్గించటం.

కొడుకు : వివేకమంటే ?

వర్తకుడు చచ్చినా మాట ఇవ్వకపోవటం.

సీరియల్ నవల:

# కౌంట్ ఆఫ్ మాంటే క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 38

మరునాటిఉదయం మాంటే క్రిస్టోని దర్శించడానికి ఆల్బర్ట్ బయలుదేరుతూ, ఫ్రాంజ్‌నికూడా రమ్మన్నాడు కొంత భీతితో మిళితమైన ఏదో చిత్రమైన ఆకర్షణ ఫ్రాంజ్‌ని మాంటే క్రిస్టోవైపుకు లాగుతోంది అదీ కాక మాంటే క్రిస్టో ప్రభావానికి మిత్రుడు ఒక్కడినీ లోనుచెయ్యడం అతని కిష్టంలేదు అందువల్ల ఫ్రాంజ్ ఆల్బర్ట్‌ని అనుసరించి మాంటే క్రిస్టో నివాసానికి వెళ్ళాడు మాంటే క్రిస్టోని చూడగానే ఆల్బర్ట్ ఇలా అన్నాడు

"నిన్నరాత్రి నా కృతజ్ఞతాభావాన్ని హృదయపూర్వకంగా మీకు ప్రకటించలేకపోయాను మీరు చేసిన ఉపకారాన్ని ఈ జన్మలో మరవలేను నేను ఆజన్మాంతం మీకు ఋణపడ్డాను"

మాంటే క్రిస్టో చిరునవ్వుతో ఇలా అన్నాడు "నేను చేసినది అల్పాల్పం నేనేదైనా ఉపకారం చేసి ఉంటే, అది మీకు నాలుగువేల స్పానిష్ డాలర్ల ఖర్చు తప్పించాను అది చెప్పుకోవలసింది కాదు కాని నిన్నటి ప్రమాదస్థితిలో మీరు చూపిన నిర్లక్ష్యభావానికి మనస్థైర్యానికి మిమ్మల్ని మెచ్చుకోవాలి"

"అందులో మెచ్చుకోవలసిందేముంది? నేనా స్థితిలో అంతకంటె చెయ్యగలిగినది మాత్రమేముంది? ఫ్రెంచివారు మృత్యుసన్నిధిలోకూడా చిరునవ్వుతో ఉండగలరని ఆ దొంగలకి నిరూపించాలనుకున్నాను అంతే అయితే అదంతా మీ ఔదార్యానికి సాటిరాదు మీరు నాకు చేసిన ఉపకారానికి ప్రతిఫలమేమివ్వగలననే నా ఆలోచన అది మీరే చెప్పండి నాతండ్రి కౌంట్ డి మార్సెర్ఫ్ స్పానిష్ జాతీయుడైనప్పటికీ, పారిస్, మాడ్రిడ్ రాజధానీనగరాల్లో పరపతి సంపాదించుకున్నారు మీ కేది కావలసినా నేను నిరాకరించలేను నేను మీకు చెయ్యగలిగేదేదైనా ఉందా?"

"మీ రిలా అంటారని నాకు తెలుసు ఇందులో ఆశ్చర్యపడవలసిందికూడా లేదు మీ స్వభావం నాకు తెలియకపోదు మీరు చెయ్యగల ఉపకారాన్ని మనసారా స్వీకరిస్తాను నిజంగానే మీవల్ల నాకొక ఉపకారం కావలసిఉంది నేను పారిస్‌నగరానికీ, అక్కడ సమాజానికీ బొత్తిగా అపరిచితుణ్ని ఇంతవరకూ నేనా నగరాన్ని చూడలేదు"

"అంటే ప్రపంచంలోకెల్ల ఉత్తమమైన రాజధానీ నగరాన్ని మీ రింతవరకూ చూడనేలేదా? నిజంగా నమ్మశక్యం కాకుండా ఉంది"

"కావచ్చును కాని అది నిజం! అది నాకే నామర్దాగా ఉంది ఆలోటు తప్పకుండా తీర్చుకోవాలి అక్కడ ఉన్నత సమాజంతో నాకు పరిచయం చెయ్యగలవారుంటే, ఇదివరకే ఆ నగరాన్ని చూసే అదృష్టం పట్టిఉండేది"

"మీవంటి ప్రతిభాశాలికి వేరే ఒకరు పరిచయం చెయ్యడం అవసరమా?"

"అదంతా మీ ఉదారబుద్ధిమాత్రమే సమృద్ధధనసంపద తప్ప ఇంకే ప్రజ్ఞ నాకుందో తెలియదు కాని పారిస్ రావడానికి నా ధనసంపదకీ వ్యాపారాలకీ సంబంధంలేదు సుమా! నా కోరిక నెరవేర్చుకోడానికి తరుణంకోసమే వేచిఉన్నాను ఇప్పుడు మీ ఆహ్వానంతో ఆ తరుణం లభిస్తోంది నన్ను మీ సమాజంతో పరిచయపరచగలరా, ఆల్బర్ట్?"

"తప్పకుండా సంతోషపూర్వకంగా పరిచయం చెయ్యగలను ఇప్పుడే నా తండ్రిదగ్గరనుంచి నాకు ఉత్తరంకూడా వచ్చింది —వెంటనే రావాలని అక్కడ నా వివాహవిషయమై వెళ్ళాలి వధువు ఉన్నతవంశానికి చెందినది నువ్వు నవ్వనక్కరలేదు ఫ్రాంజ్'"

"పెళ్ళి ఇదివరకే నిశ్చయమయిందికదా ఆల్బర్ట్?" అన్నాడు ఫ్రాంజ్ నవ్వుతూ

"ఏదయితేనేంలే నవ్వవలసిందేమీ లేదు" అన్నాడు ఆల్బర్ట్ "ఎలా చెప్పినా ఒకటే కౌంట్! మీరు ఎప్పుడు రాదల్చుకున్నా సరే నాకు కబురుపెట్టండి నేను మిమ్మల్ని స్వయంగా సత్కరించి తీసుకుపోగలను"

"అయితే అది సరే, స్థిరపడినట్టే" అన్నాడు మాంటే క్రిస్టో

ఆల్బర్ట్ ఇలా అన్నాడు "నిజం చెప్పండి కౌంట్ నిజంగా రావాలనే మీరు చెప్తున్నారా? మనం జీవితంలో అనేకం తల్చుకుంటాం 'ఎప్పుడో వెళ్ళాలి అక్కడికి' అని కాని అది సామాన్యంగా సమకూడదు ఇటువంటి యత్నం కాదు గదా మీరు చెప్తున్నది?"

"ప్రమాణంచేసి చెప్తున్నాను ఆల్బర్ట్ నాకు కేవలం కోరిక ఉండడమే కాదు అవసరంకూడా ఉంది నేను నెరవేర్చవలసిన కార్యాలు కొన్ని అక్కడున్నాయి మీ రెప్పటికి పారిస్ చేరుకుంటారు?"

"రెండు మూడు వారాలలో"

"అయితేం? మూడుమాసాలు వ్యవధి ఇస్తున్నాను మీకు రాగల అడ్డంకులనూ అనివార్య కార్యాలనూ యోచించి, సర్దుబాటు చేసుకోడానికి మూడుమాసాలు చాలుననుకుంటాను"

ఆల్బర్ట్ అన్నాడు "అయితే మీరు తప్పకుండా మూడుమాసాల్లో మా ఇంటికి వస్తారన్నమాట నిర్ధారణేనా?"

"అయినా ఫలానిరోజని ఇప్పుడే నిర్ణయించుకుంటే మంచిది కాదు? వేరేకూడా నిర్ణయించుకుంటే మంచిది నా నిర్ణయాలెప్పుడూ తిరుగుండదని మీకు ముందే చెప్పడం మంచిది"

(20-వ పేజీ చూడండి)

అనువాదం: సీతారామ్




1

'అమ్మా! బుక్కెడు గంజినీళ్లు' ఆయింటికి ఎదురుగా నిలబడి అరిచాడు దీనంగా అవిడ వైపుచూసి ఆమె దృష్టిమాత్రం యింకొకవైపు పోయింది

'ఏమండీ రత్నమ్మగారూ! చూస్తూ అలాగే వెళిపోండి మాయింటికి రాకూడదా?' పిలిచింది ప్రాధేయంగా

'ఇప్పుడు కాదమ్మా! యింకొకమాటు పనిమీద వెళ్తున్నాను

'పనిలేకుండా వెళ్తారా ఏమిటి లెండి, ఎన్నిసార్లు తప్పించుక పోయారు కాదు! ఇప్పుడు విడిచిపెట్టను'

గుమ్మందిగి రోడ్డుమీదికి పోయి చెయ్యి పట్టుకొని లాగింది ఆమెను 'వొద్దు వొద్దు' అని తప్పించుకుంటున్నా

'అమ్మా!' అని మరికొంచెం గట్టిగా అరిచాడు ముష్టివాడు ఆమెకు వినిపించలేదేమోనని

'వళ్లబ్బి వెళ్ళి వాడివైపు చూడనైనా లేదు వాడు నిరాశ చెందకుండా అలాగే నిలబడ్డాడు యింట్లోకి చూస్తూ, వడికిలాంటి జవాబులు పరిపాటే

* * *

ఒక్కక్షణం అదీ యిదీ మాట్లాడి 'వస్తానండి' అని లేచింది రత్నమ్మ

'అమ్మో యింతతొందర లేమిటండీ! కాఫీ పెట్టాను పుచ్చుకొని వెళ్దురుగాని'

లేచిందాన్ని బలవంతంగా కూర్చోబెట్టింపా యిల్లాలు

'నాయనా! హోటలుకి వెళ్లి టిఫిను తీసుకురా

అని పెట్టితీసి అర్ధరూపాయి యిచ్చింది కొడుక్కి

* * *

'కళ్లు తిరుగుతున్నాయి తల్లీ! బుక్కెడు గంజి'

'చెయ్యి ఖాళీ కాదు పో పో'

తెరిచివున్న తలుపు దభీమని మూసుకుంది

2

ప్రతీయింటి యెదుట నిలబడి 'అమ్మా' అని అరుస్తూ ఏమీ దొరక్కపోగా నే కాళ్లీడ్చుకుంటూ సాగిపోతున్నాడు ముందుకు ముష్టివాడు ప్రాణులు జీవించి వుండటానిక్కి, కష్టనష్టాల్ని భరించడానిక్కి ప్రోత్సాహం ముందు కేదో లభిస్తుందన్న ఆశయే కదూ! వెధవాశ'

* * *

సినిమాహాలు దగిర మూకమూకలుగా చేరి వున్నారు జనం టిక్కట్లకోసం ప్రపంచంలోని కోలాహలమంతా అక్కడే వున్నట్టుంది

'బాబూ!' అని చెయ్యి చాపుకుంటూ వెళ్తున్నాడు ముష్టివాడు

* * *

'ఒకే అర్ధరూపాయి టిక్కట్లు బందయిపోయాయి రూపాయి టిక్కట్టయినా దొరుకుతుందో లేదో పద, పద

తనస్నేహితుడ్ని యీడ్చుకుంటూ పోయాడొకాయన తనకు టిక్కట్టు దొరికే ప్రాప్తలేదే అని యీసరోమంటున్నాడొకవ్యక్తి

'బాబూ!' అన్నాడు అతని దగ్గరికి వెళ్లి

పో! వెధవ! అని అసహ్యంగా కసిరాడా పెద్దమనిషి

'బాబూ! రెండ రోజులనుంచి తిండి లేదు మీలాంటి పెబువులు'

'తిండిలేకపోతే అఘోరించు ఏయింటికో పోయి అడుక్కోకూడదూ, ఇక్కడ తగలడకపోతే' ఛిరాకుపడ్డాడు

'ఒక్కకానీ యిప్పించండి బాబయ్యా!'

'ఇక్కసా పొమ్మని చెబుతుంటే? కండ్లెర్రచేసి మొహం త్రిప్పకున్నాడు విసురుగా

* * *

'ఒకే సీటు టిక్కట్టు దొరక లేదటరా?'

ఆవ్యక్తి పెదవి విరిచి తల ఆడించాడు విచారంగా దొరక లేదని

'అర్ధరూపాయి టిక్కట్టు ముష్టావలాయిస్తే ఈయనిస్తాడు తీసుకుంటావా?'

అతని ముఖం వికసించింది!

'వెధవ ముష్టివెధవా, రూపాయైనా సరే యివ్వడాన్కి సిద్ధం ఏడిబాబూ ఆమహానుభావుడు !'

*      *      *

'బాబూ !' అని మళ్లీ అడ్డంగా వచ్చి చెయ్యిచాపాడు ముష్టాడు

'ఈముష్టిగాడిద కొడుకు యింకా యిక్కడే వున్నాడురా వెధవకి నెమ్మదిగా చెబితే బుద్ధిలేదు' అంటూ వాడ్ని ప్రక్కకు తోసి హాల్లోకి పోయాడు టికట్టు దొరికిందన్న వుత్సాహంతో

# 3

ఎలక్ట్రిక్ దీపాలకాంతికి అద్దపు బీరువాలలోని మిఠాయి సామాను మిలమిలలాడుతూ దారిపోయే వార్కి చొంగలు కారిస్తోంది వాటివైపుచూస్తూ నాలుక చప్పరిస్తున్నాడు తన దురదృష్టాన్ని నిందించుకుంటూ ముష్టివాడు ఎన్నెన్నో రకాలు పోగుపోగులుగా చూపుకు ఆకర్షవంతంగా పేర్చి వుంచారు పళ్లాల్లో కంటికింపుగా అనితే మనస్సున కప్పడే యింపుగా వుంటుందన్న సత్యాన్ని గ్రహించినవారు వర్తకులు, అందులో ముఖ్యంగా హోటలు యజమాన్లు

అయితే ఆపేర్పు, ఆతీర్పు యీముష్టిమొహంకోసమని ఎవరేనా అనుకోగలరా ? ఈ ప్రపంచంలో ఏపని చెయ్యడానికేనా, చివరికి సరియైనతిండి తినేందుకూడా ఓ తాహతంటూ వుండాలి ఆతాహతు డబ్బువల్ల కలుగుతుంది ఆడబ్బును సంపాదించాలి ఎలా సంపాదించాలన్నది వెధవప్రశ్న ప్రొద్దుటినుంచి తిరిగి తిరిగి ఓగుక్కెడు గంజినీళ్ళు డబ్బుమాటకేం సంపాదించుకోలేని ముష్టపీనుగ మిలమిల్లాడే అద్దపు బీర్వాలోని మిఠాయి ఎలా వాంఛించగలడు ? అది కావాలంటె డబ్బు చెల్లించాలి డబ్బులేనప్పుడు ఆవస్తువు అందదు అదేకాగు ఏదీకూడా ఆ అంతే ఈ ప్రపంచంలోని సకల వస్తువులూ అంతే నిత్యావసరాలు డబ్బు తీర్చవలసిందే కాని మనశ్శక్తి సామర్థ్యాలు, బుద్ధిబలం కూడా యీవిషయంలో వుపకరించవు అది సంపాదించలేనివాడులోకాన్ని చూసి కళ్లుమూసుకొని, లేని అంధత్వం అభినయించవలసిందే కాని దేబిరిస్తే దొరకదు

డబ్బుకీ, జీవితాన్కి నేటి ప్రపంచంలో ఉండుకున్న సంబంధం అలాంటది డబ్బు డబ్బు డబ్బు ప్రతిదాన్కి డబ్బు మనిషి ప్రతి కదలికలో డబ్బు కావాలి పుట్ట, పెరిగి, చచ్చిందాక డబ్బుతోనే పని చచ్చింతరవాతకూడా డబ్బు మిగిల్చేపోవాలి శవాన్ని తగలబెట్టేందుకు కట్టెలకోసం, కట్టుకున్న వాళ్ల కాలక్షేపంకోసం

'బాబూ !' అని రెండుచేతులూ జోడించాడు ఆమిఠాయికొట్టు దగ్గిర వెధవ, ఎవడికాక్కావాల పీడిముష్టిగోల ! కావలసినవి అడిగేవారి కేకలు, తెచ్చేనౌకర్ల సందడి, నవ్వులు, పరిహాసాలూ, ప్లేట్లచప్పుడు, ఆగల్లంతులో పీడిగోల వినపడే దెవరికి వినపడినా వినిపించుకొనే వాళ్లెవళ్లూ

*      *      *

'టీతాగి పోదాంరారా !'

'ఇంటిదగ్గర కాఫీ పుచ్చుకొనే బయల్దేరానురా నువ్వెళ్లి తీసుకో'

'అయితేమాత్రం ఏమైందిలే నేనూ తాగేవొచ్చా ననుకో వాళ్లెవెహం 'కాఫీ' 'టీ'లు యింట్లోవాళ్లు తయారు చెయ్యడమేంటి పోనిద్దూ !'

చెయ్యిపట్టుకొని లాక్కుపోయాడు తన నేస్తాన్ని హోటలుకి

'కూర్చుంటాను నీతో తిన్నంతసేపూ ! కాని నాకుమాత్రం ఏమీ వొద్దుసుమా'

'మొగమోటంపడకబ్బాయ్ మరేం పరవాలేదులే నాకెప్పుడైనా యిప్పించవలసి వుంటుందని జడవమోకు'

'అబ్బే ! మొగమోటం దేనికిరా ? కడుపు పుల్లుగా వుంది నాకు'

'నువ్వేగాని తినకపోతే నాకూ అక్కర్లేదు పోదాంపద'

మొహం చిట్లించి కోపం నటించాడు స్నేహితుడు తిరిగి మాట్లాడ్డానికి సాహసించలేదు

ఫలహారం ముగించగానే స్నేహితుడు తనవంతు చెల్లించడాన్కి తీశాడు డబ్బులు

'డబ్బు లిస్తున్నా వేంటిరోయ్ ! ఊ ! కావి ! గొప్ప వాడివయ్యావే ! చాలుచాల్లే జేబులో పెట్టు'

*      *      *

'బాబూ !' అని ముష్టివాడు దోసిలి పట్టాడు పైకిరాగానే స్నేహితుడు బీడీతీసి వెలిగించాడు నోట్లోని బీడీ అపశంగా ఎగిరి పడి పోయింది నేలమీద, స్నేహితుడి మొహం జేవురించింది

'చండాలం బీడీకాల్చడం ఏమిప్రారబ్ధంరా ! యిందసిగరెట్టు'

ఇద్దరూ నవ్వుకొని ముట్టించారు సిగరెట్లు రివిగా యాచకుడిదృష్టి నేలమీది బీడీ పైకి పోయింది దానివైపు ఆప్యాయంగా చూస్తున్నాడు వాడిమొహానికి వాడికి బీడీ అలవాటుకూడా కాబోలు కక్కుర్తిపడ్డా కడుపు నిండలేదు గడీంలోలనకున్న అసహ్యంగొద్దీ దాన్ని నలిపి పప్పవేశాడా మొదటవ్యక్తి

*      *      *

# 4

కోర్కెలు తీరినందుకు మ్రొక్కులు చెల్లిచేవారు, అభీష్టసిద్ధికై ప్రార్థనలు సల్పేవారు, ఇంట్లో విరక్తి కల్గి భగవత్సాన్నిధ్యాన్ని కాంక్షించిన మహాభక్తులు, పొట్టపోషించుకునే సాకుమార్గంగా ఎంచి పెట్టుకున్న ముష్టిమంతులు, ఇంకా అనేకరకాలైన మహామహులతో నిండి సందడిగా వుంది ఆలయం అర్చకుడు ఉషారుగా పండ్లూ కాయలూ అందుకొని, కొబ్బరికాయలు యిచ్చినవారికి కొబ్బరిచెక్కలూ, అరటిపండ్లు యిచ్చినవాళ్లకో అరటిపండూ, మొహం చూసి ఎవరికి కలా యివ్వాలో అలాగ ప్రసాదం పళ్లెంలో పెట్టి పంచిపెడుతున్నాడు ప్రసాదం కళ్లకద్దుకొని స్వీకరిస్తున్నారు భక్తులు

ఒకమూలగా నిలబడి తానుకూడా చెయ్యి చాచాడు ఎంతో వినయంగా యాచకుడు అందరి చేతుల్లోనూ పడుతున్న ప్రసాదం తనచెంతదగ్గిరగావచ్చి దాటిపోయి యింకొకరి హస్తంలో పడుతోంది ఎంతసేపటికీ ఆనకు గరికే ప్రాప్తి లేకపోవడంచేత 'బాబూ!' అని రెండుచేతులూ ఎత్తి దండం పెట్టాడు వుడరికి పూజారి చురమర చూశాడు వాడివైపు, నువ్వు నిజంగా కొబ్బరికాయ యిచ్చావా అన్నట్టు ఆచూపులోని తీక్షత ఎదుర్కోలేక తల దించుకున్నాడా బిచ్చగాడు వాడు కొబ్బరికాయ ఎక్కడిదిచ్చాడు తుచ్ఛుడు వొర్ర పుణ్యానికి ప్రసాదం దొబ్బుకుపోదల్చుకున్నాడు

*      *      *

'దయచెయ్యండి బాబూ!' అని ఆహ్వానించాడు అర్చకుడు ఒక మహాఆగంతుకుణ్ణి

'తమ నెక్కడో చూసినట్టుగా వుంది తమవంటి వారు దయచేయడం యీవేళ మాకు సుదినం' అన్నాడు ఆ మహానుభావుడు రావడంవల్ల అక్కడున్న దేవునికొక గౌరవం జరిగిందన్న భావంతో

'అబ్బె ! అస లిక్కడుండు వొద్దామని రాలేదులెండి' అన్నాడా వచ్చిన తను మనిషి తిరస్కార భావాన్ని సూచించే చిరునవ్వుతో

(19-వ పేజీ చూడండి)

# బుద్ధిః కర్మానుసారిణీ

శ్రీమతి తిరుగూరి రత్నమ్మ

మాధవరావు స్ఫురద్రూపి, చాలా బుద్ధిమంతుడు అందంగా కూడా వుంటాడు మంచి చురుకైనవాడు ఇంటరు చదువుతున్నాడు కాలేజీలో వున్న అన్ని స్పోర్ట్సులోనూ, వుత్సవాలలోనూ పాల్గొంటూ చాలా ఉత్సాహంకల యువకుడనీ తెలివైనవాడనీ పేరుపొందేడు

మాధవరావుకి తండ్రి చిన్నతనంలోనే పోవడంనుంచి మేనమామ నారాయణరావు గారి దగ్గర నే పెరుగుతున్నాడు భర్త గతించిన వెంటనే రామలక్షమ్మ అయిదు సంవత్సరాల పిల్లవాడగు మాధవుడినీ, పది, పదిహేను వేల రూపాయిల ఆస్తినీ పట్టుకుని అన్నగారింటకి ధవిళేశ్వరం చేరుకుంది అన్నగారూ, వదినగారూ కూడా, ఆమెకూ, ఆమెకుమారునికీ ఏవిధమైన లోపం రాకుండా చూస్తున్నారు నారాయణరావు గారికి ధవిళేశ్వరంలో చాలాభూవసతివుంది మంచి పలుకుబడి వుంది దానధర్మాలకు, సంప్రదాయ ఐశ్వర్యాలకు ఆ చుట్టు ప్రక్కల వున్న కుటుంబాలన్నిటిలో గొప్పకుటుంబమని పేరుపొందింది నారాయణరావుగారి భార్య లక్ష్మిందేవికూడా, కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ అన్నట్టు భర్త అభిప్రాయాలకు విరుద్ధంగా నడవక ఆయన అడుగుజాడలనే అనుసరిస్తూ ఉత్తమ ఇల్లాలని అనిపించుకుంటూంది

రామలక్ష్మమ్మ పుట్టింటికి వొచ్చిన సంవత్సరం లోపుగానే లక్ష్మిందేవికి ఆడపిల్ల పుట్టింది ఆ బిడ్డకు రాధ అని పేరు పెట్టేరు మేనకోడలిని చూచుకుని, భర్తపోయిన దుఃఖం రామలక్ష్మమ్మ కొంతవరకు మరవగలిగింది రాధా మాధవులిద్దరూ దినదిన ప్రవర్ధమానులై పెద్దవారలకు ఆనందం కలుగ చేస్తున్నారు

మాధవరావుని అచ్చటవున్న చిన్నస్కూలులో ప్రవేశపెట్టారు స్వతస్సిద్ధంగా తెలివైనవాడవడంచేతనూ, మంచి ప్రైవేటు మేష్టారుని పెట్టి మేనమామ ఇతని చదువు విషయం ఎక్కువ శ్రద్ధతీసుకోవడం చేతనూ ప్రతీక్లాసులో ఫస్టుగా పాసయి పదకొండో ఏటికల్లా 'ఫస్టుఫారం' పాసయినాడు ఇక పైచదువు అచ్చట లేనందున రాజమండ్రి స్కూల్లో ప్రవేశపెట్టి అతని రాకపోకలకు ఒక జట్కాబండీ కొన్నాడు మేనమామ నారాయణరావు

ఒక్కగానొక్క కూతురు అవడంచేత, చాలా రోజులకు పుట్టడంనుంచీ రాధకు చాలాముద్దు ఎక్కువైంది తను ఏదికోరినా తల్లి దండ్రులు మేనత్తకూడా ఏముపాలమీద తెప్పించిఇవ్వడంనుంచీ వాళ్లు చేసే అపురూపం ముద్దువల్ల ఎంతో నెమ్మదయిన పిల్లయినప్పటికీ పంతం, పట్టుదలా రాధకు ఎక్కువైనాయి తను కోరగానే, 'కొండమీద కోతి' అయినా దగిరావలసినదే తల్లి, తండ్రి' మేనత్తకూడా రాధ క్రిందనడిస్తే ఎక్కడ కందిపోతుందో అని అరచేతి నిమ్మపండులాగ చూచుకుంటున్నారు కాని ఎంత మారాం చేస్తూన్నా, ఎంత పట్టుదల పట్టి ఏడుస్తూన్నా కూడా 'అదిగో' బావవస్తూన్నాడంటేమాత్రం టక్కున వూరుకుంటుంది

ప్రతి సంవత్సరం క్లాసులో ఫస్టుమార్కు కొడుతూ మాధవరావు పదిహేన్నో ఏటికల్లా స్కూలుఫైనలు పాసయి ఇంటరుక్లాసులో ప్రవేశించాడు

రాధకుకూడా పదోఏడు వచ్చింది రోజూ స్కూలుకు వెళ్లి చదువుకుంటూంది తనకు స్కూల్లో ఇచ్చిన లెక్కలు, పాఠాలు మొదలయినవి మళ్ళీ బావ ఇంటిదగ్గర బోధపరచనిదే రాధకు సంతృప్తిలేదు ప్రతీరోజు రాత్రి మాధవుడు మరదలికి పాఠాలు బోధపరుస్తూంటాడు

సాయంకాలం నాలుగుగంటలకల్లా స్కూలునుంచి వచ్చి కాళ్లుచేతులుకడుక్కొని బట్టలు మార్చుకుని మస్తాబై బావఎప్పుడు వస్తాడా అని రాధ ఎదురుచూస్తూంటుంది జట్కాబండీచప్పుడు దూరంగా వినపడగానే ఎదురుగా వెళ్లి బావచేతిలో పుస్తకాలందుకుని తీసుకువస్తుంది అతను కాలేజీనుంచి ఒకక్షణం రావడం ఆలస్యమైతే రాధ 'కాలుగాలిన పిల్లిలాగ' ఇంట్లోకీ వాకిట్లోకీ తిరుగడం మొదలు పెడుతుంది. కాలేజీనుంచి రావడంతోనే డ్రెస్సు మార్చుకుని బావామరదళ్లిద్దరూ రామలక్ష్మమ్మ పెట్టిన ఫలహారం తీసుకొని ఆనకట్టవేపు షికారువెళ్లేవారు కాలేజీలో జరిగిన సంగతులన్నీ మాధవుడు చెప్తూంటే రాధ చాలా కుతూహలంగా వింటుంది మేనకోడల్ని చూచుకుని రామలక్ష్మమ్మ, మేనల్లుడ్ని చూచుకుని నారాయణరావు మురిసిపోతుంటారు వీళ్లే కాకుండా వూరిలో జనంయావత్తూ రాధా మాధవులు షికారు వెళ్లినప్పుడు చూసి ముచ్చటపడుతారు రాధ పుట్టిననాడే నారాయణరావుగారికి కూతురు పుట్టినదని అనేవారికంటే మాధవరావుకి పెళ్లాం పుట్టిందని అనేవారే హెచ్చుమంది ఉన్నారు వీరిద్దరూ దంపతులయితే చూడ ముచ్చటగా వుంటుందని అందరూ అనుకుంటూ వుండేవారు

తనకు ఇతర మొగ సంతానం లేనందున తనకు చేదోడు, వాదోడుగా వుంటాడనీ, ఎరుసు, ఎబ్బెట్టు వుండదనీ, పిల్లాడుకూడా బుద్ధిమంతుడు, తెలివైనవాడు, రూపసీ, చదువుకుంటున్నాడు చేతికీ నోటికీ ఎరుసు లేని సంబంధం ఆస్తికూడా వుంది అయినా తన ఆస్తిమాత్రం ఇంకెవ్వరు తినాలి' అనీ తనకూతుర్ని మేనల్లుడుకు ఇవ్వాలని నారాయణరావుకు చాలా అభిలాషగా వుంది కాని, లక్ష్మిందేవికి మాత్రం 'ఒక్కగానొక్కపిల్ల ఇంట్లో ఇంట్లోనే ముడిపెడితే ముద్దుముచ్చటలేమీ తీరవనీ రాధకు పై సంబంధం మంచిది, అనుకూలమైంది చూచి చెయ్యాలనీ, మనసులో వుంది కాని నిండుకుండ లవడంనుంచి ఎక్కడా తొణకడంలేదు పెండ్లిమాట ఎవరు ఎత్తినా "చూదాములెండి ఎవరెవరికి ఘటనో అలా గవుతుంది మన ప్రయత్నం ఫలిస్తుందా," అని లక్ష్మిందేవమ్మ జవాబు చెప్తుంది రామలక్షమ్మ మాత్రం రాధను తన కొడుక్కే ఇస్తారని మురిసిపోతూ తన నగలన్నీ పెట్టి కోడలికి అలంకారంచేసి ఆనందిస్తూంటుంది ఆమె ఆనందానికి లక్ష్మిందేవి అడ్డురాదు కాని 'నీ పెళ్లాన్ని పిలు' అని మాధ

వరావుతో చెప్పినా, 'నీమొగుడికి తీసుకెళ్లియ్య' అని రాధతో చెప్పినా, లక్ష్మీదేవి "ఇప్పటినుండీ అలాగనకండి వదినా వాళ్ల లేతమనస్సుల్లో ఇలాంటి వుద్దేశాలు మనం కలగజేయరాదు," అని అంటుంది

"తప్పేముందమ్మా! మూడుముళ్లు పడడానికి ఆటంకం ఏముంది? ఎలాగా రాధ మావాడిసొత్తే అది నా కోడలే?" అని రామలక్ష్మమ్మ జవాబుచెప్పతుంది.

"పోనిస్తురూ, అయినప్పుడలాగే అందురు కాని ఇప్పటినుంచే అలాగ పేర్లు పెట్టడం నాకిష్టంలేదు ఎవరెవరకు ఘటనో మనం చూడొచ్చామా?" అని లక్ష్మీదేవి అంటుంది

ఆమె లోతుహృదయంలో ఏముందో ఆడబిడ్డ కంతుదొరకటంలేదు తమమీద అభిమానం లేదనకుండామా అంటే తనన్నా తనకుమారుడన్నా అతి ప్రేమగా ఆదరంగా చూస్తుందేకాని ఏవిధమైన లోపం రానీయదు పెళ్లిమాట ఎత్తితే మాత్రం ఎవరెవరికి ఘటనోఅంటుంది ఆమె మనస్సులో మాట తెలిస్తే బాగుండును ఈ మాగ అన్నయ్యని అడిగి అటో ఇటో తేల్చాలి వాళ్ల పిల్లను ఇవ్వకపోతే నేను క్షణం ఇక్కడ వుండను మా వాడి కేం తక్కువనో ఈ విడ ఆతీరుగా అంటుంది అని రామలక్ష్మమ్మ ఒకనాడు మనస్సులో తీర్మానించుకుంది

* * *

మాధవరావు ఇంటరు క్లాసులో ప్రశిడెన్సీకి మొదటివాడుగా వచ్చాడు అతనికి మొదటినుండీ వైద్యవిద్యయందు అభిలాష హెచ్చుగా నుండుటచే మదరాసు మెడికలు కాలేజీలో సీటుకొరకు అప్లికేషను పెట్టాడు రాజధానికి ప్రథముడుగా రావడంచేత ఎవరి సిఫారసులు అక్కరలేకుండానే సులభంగా వైద్యకళాశాలయందు సీటుదొరికింది

'కాని, రాధని విడిచి ఎల్లా వుండడం? కాసేపు చూడకుండా వుండలేనుకదా! ఒక్కొక్క సెలవుమధ్య మూడేసి నెలలు గడవాలి అబ్బ తొంభయి రోజులు తలచుకుంటే భయమేస్తోంది' అని తనలో అనుకోడం మొదలు పెట్టాడు

మదరాసులో చదువుకునే అమ్మాయిలు సీతాకోకచిలుకల్లాగు సింగారించుకుని కాలేజీలకు వస్తారనీ తోటి అబ్బాయిలను భ్రమింపజేస్తారనీ ఎవరో చెప్పగా రామలక్ష్మమ్మ వింది అందుచేత తన కొడుకు కూడా అటువంటి అమ్మాయిలను చూచి పల్లెటూరిలో పెరిగిన తన మేనకోడలు రాధని చేసుకోనంటాడేమో కొడుకు కాబట్టి, మద్రాసు వెళ్లేముందుగానే పెళ్లికాస్తా అయిందనిపిస్తే బాగుంటుందని రామలక్ష్మమ్మకు తోచింది - (అతి ప్రేమ ఎచ్చట వుంటుందో అనుమానంఅక్కడే తోస్తుంది) ఒకనాడా విషయం అన్నగారితో "అన్నయ్యా మనవాడు మద్రాసు వెళ్లే ముందుగానే శుభకార్యంకాస్తా జరిగిస్తే బాగుంటుందేమో, 'శుభస్య శీఘ్రం' అన్నారు" అని అంది

"అవునమ్మా! నేనూ అదే ఆలోచిస్తూన్నాను," అని అతను జవాబు చెప్పేడు

తనతో సమానబాధ్యత గల సతీమణితో ఇంతవరకూ ఆప్రస్తావన ఎందుకు ఎత్తలేదా అనుకుని ఇవాళరాత్రి తప్పక ఆవిడతో ఆలోచించాలి, అని నిశ్చయించుకున్నాడు

శారదాబిల్లు అమలులోకి వచ్చినా చాటు మాటుగా బాల్యవివాహాలు యాధృచ్ఛికంగా జరుగుతూనే ఉన్నాయి అందునించి రాధకుకూడా వ్యక్తురాలు కాకుండా పెళ్లిచేయాలనీ సంప్రదాయమైన కుటుంబములో శాస్త్రదూష్యమైన రజస్వలానంతరవివాహం చేయడం ఇష్టంలేదనీ లక్ష్మీదేవి అభిప్రాయం ఏరోజున నారాయణరావు కుమార్తె వివాహవిషయం భార్యతో ప్రస్తావించాలనుకున్నాడో ఆనాటిరాత్రి భోజనాలు, చక్కబెట్లు ముగించుకుని, మంచినీళ్ల చెంబు, తాంబూలం పళ్లెం చేత ధరించి లక్ష్మీదేవి పడకగదిలోకి వచ్చింది ఆమె వచ్చుసరికి నారాయణరావు మంచంమీద పరుండి అర్ధనిమీలిత నేత్రుడై కుమార్తె పెళ్లివిషయం, అల్లుడి చదువుగురించి ఆలోచిస్తూన్నాడు "ఏమిటో చాలా దీర్ఘంగా ఆలోచిస్తూన్నారే" అని లక్ష్మీదేవి అడిగేసరికి, అతని ఆలోచనాప్రవాహానికి ఆప్రశ్న అడ్డుగట్టు అయింది భార్యను చూచి "ఆఁ ఏమీ లేదు నీవింకా రాలేదేమా అని చూస్తూన్నాను" అన్నాడు నారాయణరావు

"సరే కానీండి మనరాధకు పన్నెండో ఏడు వచ్చింది ఆట్టే కాలం ఇంక పిల్లను అట్టే పెట్టడం నాకిష్టంలేదు ఏదో లేక లేక పుట్టినపిల్ల, దానికి తొందరగా పెళ్లిచేశి ముద్దుముచ్చట చూడాలని వున్నది అదీ గాక సాంప్రదాయకమైన కుటుంబం మనది పిల్ల పెద్దమనిషి కాకుండా పెళ్లిచేసి తీరాలి మీతో ఈవిషయం ఎన్నోరోజులుగా చెప్పాలనివున్నా మీరే ప్రస్తావిస్తారేమో మీకుమాత్రం అదివుంటేగా అని ఊరుకున్నాను ఎంతకీ మీలో కదలిక కనబడడం లేదు" అనిమంచందగ్గరవున్న తివాసీ మీద కూర్చుని తమలపాకుల సున్నంరాసి చిలకలు చుట్టుతూ రాధ పెండ్లివిషయం ముందుగానే లక్ష్మీదేవి ఎత్తింది

"లేదే, నేనూ ఇప్పుడదే ఆలోచిస్తూన్నాను నీ అభిప్రాయం తీసుకుని సిద్ధాంతిగారిదగ్గరకెళ్లి ముహూర్తం పెట్టిద్దామనే నేను ఇవాళ అనుకున్నాను" అన్నాడు నారాయణరావు భార్య ఇచ్చిన తమల పాకుల చిలక లందుకుంటూ

"అదేమిటండీ? పెళ్లికి పెళ్లికొడుకూనా? అన్నట్లు సంబంగం ఏదీ చూడనిదే పెళ్లిముహూర్తం ఏమిటి? యజ్ఞానికి ఏమిటి యత్నం అంటే కత్తులు, కటార్లు అన్నట్లు లాగుంది మీమాట ముందు సరి అయిన సంబంధం నిశ్చయమైతే తరువాత ముహూర్తం చూపించవచ్చును" అని అంది

దానితో నారాయణరావుకు తన భార్యామణివుద్దేశం మేనరికం ఇవ్వడం ఇష్టంలేనట్టు స్పష్టమైంది కాళ్లు చేతులు చల్లబడ్డాయి అవతల తననే నమ్ముకుని వున్న చెల్లెలు మనస్సు కష్టపెట్టడం ఇష్టంలేదు ఇటు భార్యమాట జవ దాటడం ఇష్టంలేదు ఇరుకున పడ్డాడు. కాని, తాను బోధపరచి చెప్పితే తన ఇల్లాలు వినకపోతుందా అన్న దైర్యంతో ఆమెమనస్సు మార్చదలంచాడు "చూడూ సంబంధం వేరే చూడడం ఎందుకు? అల్లుడు ఇంట్లోనే వున్నాడుగా! మన మాధవుడికి ఏం తక్కువ? వాడిలో ఏం లోపం వుంది?

"తక్కువ లోపం వుందనికాదు నాఅభిప్రాయం నిక్షేపంలా వున్నాడు కాని—

"మరి కానీ, ఏగాని ఏమిటది? నీ మనస్సులో వున్న మాటేదో సరిగా చెప్పు మనం చేసే పొరపాట్లవల్ల జీవితాంతంవరకూ సుఖదుఃఖాలు అనుభవించేది మన చిట్టితల్లి. అందునించి మనం నిదానంగా ఆలోచించి మరీ ఈ విషయం నిర్ధారణ చెయ్యాలి కాబట్టి నీమనసులో వుద్దేశం ఏమిటో స్పష్టంగా చెప్పు"

"అబ్బే, మరేమీ లేదు ఒక్కగానొక్క పిల్ల ముద్దు, ముచ్చట, రాకపోక ఏమీ వుండవు"

"ఓస్ అంతేనా? నీ అమాయకత్వానికి నాకు నవ్వొస్తూంది చూడు నామాట విను. చిట్టితల్లిమీద నీకెంత బాధ్యతవుందో నాకూ అంతబాధ్యతవుంది నేను చాలాదూరం ఆలోచించేను నీకు ఒక్కొక్క పాయింట్ చెప్పతాను విను ఒకటి పిల్లాడా బుద్ధిమంతుడు రెండు బాగా చురుకుగా చదువుకుంటూన్నాడని వాడికొచ్చిన ఫస్టుక్లాసు మార్కులే చెప్పతూన్నాయి మూడు

సంప్రదాయానికీ లోటులేదు నాలుగు పిల్లవాడు మంచి రూపసి అయిదు ఇంక ఆస్తిపాస్తులు ఎనిమిదెకరాల మాగాణి, నాలుగెకరాల మెట్ట పొలం వుంది పదివేల దాకా రొఖ్ఖం వుంది లక్షిని నాలుగైదువేల రూపాయిల నగలున్నాయి ఇదిగాక అయిదారేళ్లకు వాళ్ల సంసారం దేమునిదయవల్ల వృద్ధి అయేసరికి డాక్టరుపరీక్షపేసయి ప్రయివేటు ప్రాక్టీసు పెట్టుకుంటే దోసిళ్ళతో గడిస్తాడు అయినా మన ఆస్తీ ఎవరు తినను చెప్పు? నేను పెద్దవాడినైపోతున్నా కా? దస్తు, నీస్తులు, వసూలుచేయడానికీ, కవులు కదపాలు రైతులదగ్గర కట్టించుకుందుకీ నాకు చేదోడు వాదోడుగా వుంటాడు మనం మాధవుడిదగ్గర చనువుగా వునట్టు పరాయి సంబంధం పిల్లాడితో వుండగలమా? ఇదయితే చేతికీ నోటికీ ఎడంలేని సంబంధం లక్ష్మీకూడా చాలా నెమ్మదైనది దాని మనసు కష్టపెట్టినవాళ్లం అవుతాము లక్ష్మికి కూతురైనా, కోడలైనా చిట్టితల్లే చిట్టితల్లి ఎంత అపురూపంగా పెంచబడిందో లక్ష్మికి బాగా తెలుసును దాన్ని పూవుల్లో పెట్టుకుంటుంది లోకనిందకూడా పడిపోతాము నీవుకూడా ఆలోచించు నీమాట తోసిపాశేయడం నాకిష్టం లేదు నీవూ తెలివైన దానివి గుట్టుగా సంసారం ఇంతవరకూ నడుపుకొస్తున్నావు కేవలం ముద్దుముచ్చటలకొరకని దూరభారం సంబంధం చేయడం నాకిష్టంగా కనబడదు దూరపుకొండలు నునుపని వెళ్లితే అందులో ఎన్నికంటకవృక్షాలు వుంటాయో ఎవరికి తెలుసు? జమీందారులు ముచ్చటపడి ఎగిరిగంతేసి ఇవ్వవలసిన సంబంధాల్ని తోసిరాజని పై సంబంధాలకు వెళ్లడమంత తెలివితక్కువ ఇంకొకటి కనబడదు అదీగాక సరిఅయిన సంబంధంకూడా నాకు ఎక్కడా కనబడదు నేను ఏదో నాచెల్లెలిమీద అభిమానం కొద్దీ చెప్పుతూన్నా ననుకోకు, నీవూ ఆలోచించు రాధా మాధవులిద్దరి ప్రవర్తన నీవు చూస్తూనేవున్నావు కదా! మద్రాసులో సీటు దొరికిందన్న రోజున చిట్టితల్లి 'నాన్నగారూ అయితే, బావ మనందర్నీ విడచిపెట్టి వెళ్లిపోతాడా?' అని బిక్కమొగం వేసి అడిగింది

భర్త ఇచ్చిన దీర్ఘమయిన ఆర్గ్యుమెంటు లక్షిందేవి మౌనంగా వింది పై సంబంధాల మోజు కొంతవరకు తగ్గింది అన్నిటికన్నా లోకనింద చాలా పడిపోతానను కుంది ఇంతవరకూ కొంత జాగ్రత్తగా కాపాడుకుంటూ వచ్చిన తన మంచితనానికి తీరని కళంకం అయిపోతుంది ఇక ఆడబిడ్డ తృణం తన యింట్లో వుండదు కూతురికి పైసంబంధం చేసి ఆడబిడ్డను వెళ్లకొట్టిందన్న అపకీర్తి తనకు వస్తుంది అదీగాక ఎంచదగిన లోపాలు మాధవుడిలో ఏమీ లేవు తనన్నా మేనమామన్నా ఎంతో భక్తిశ్రద్ధలు కలిగి వుంటాడు ఇటు భర్తమనస్సు, అటు ఆడబిడ్డ మనస్సుకష్టపెట్టి ఆ లేత హృదయాలకు గాయం కలిగించి తాను బావుకొనేదేముంది? రాధను వదలి తృణం మాధవుడు వుండలేడు అతనుతృణం కనబడకపోతే రాధ నిలువలేదు అటువంటివారి ప్రేమలతకు తానేల గొడ్డలిపెట్టు కావాలి అనుకుంది

"మీరు చెప్పిన విషయాలు అన్నీ బాగానే వున్నాయి నాఅల్పబుద్ధికి తోచిన దేదో నేను అన్నాను క్షమించండి మీ అభిప్రాయానికి ఎదురీదడం నాకు మొదటనుండి అలవాటులేదు ఇష్టంకూడా లేదు మీ ఇష్టప్రకారం తప్పక మేనరికం చేదాము ముహూర్తంమాత్రం తొందరలోనే పెట్టించాలి "చూడూ అదికాదు చిట్టితల్లిని ఇంకెవరికయినా ఇస్తామనుకో వాళ్లు దాన్ని సరిగా చూస్తారో లేదో మన లక్ష్మయితే కందకుండా చూచుకుంటుంది ఇక ముద్దుముచ్చటలు మనం కావలసినన్ని జరుపుకోవచ్చును వాళ్లూ ఇంతో అంతో వున్నవాళ్లు కాని, దరిద్రులు కారుగదా! రాకా, పోకాకి మనవాడు ఎలాగూ మద్రాసు వెళ్ళిపోతున్నాడు వక్కగా నొక్క కొడుకుని విదలి లక్ష్మి వుండలేదు కదా! అక్కడ వాళ్లు కాపురం పెట్టుకుంటే మనం వెళ్లవలసిన పండుగలకు మనం వెళ్లొచ్చు వాళ్లు రావలసిన పండుగలకు వాళ్లు రావచ్చును"

ఇంతలో రాధ నిద్రలో 'బావా పారిపోకు—పట్టుకున్నాలే! ఇంకెక్కడికి పారిపోతావు నాకు చిక్కకుండా పారిపోవాలనుకున్నావేం దొంగా, దొరికావులే' అని కలవరించింది దానితో లక్షిందేవి మనస్సు పూర్తిగా పైసంబంధాలమీద మోజు పోయింది భర్తతో "చూశారా మన చిట్టితల్లికి నిద్దరలోకూడా బావధ్యానే," అంది

"చూచావా మరి?" అన్నాడు నారాయణరావు

వైశాఖశుద్ధ పంచమినాడు రాధా మాధవుల పెళ్లి దివ్యంగా జరిగిపోయింది పెళ్లిపందిట్లో పెళ్లిపీటలమీద రాధా మాధవులు రతీ మన్మధుల్లా వున్నారు దివ్యమైన తేజస్సు వధూవరు లిద్దరి ముఖాలమీద చూపరులకు కనబడింది కొడుకు కోడలు తలబ్రాలు పోసుకుంటూంటే రామలక్ష్మమ్మ కళ్లు చెమ్మగిల్లాయి

* * * *

పది కేలెండర్ల కాగితాలు చింపివేయబడ్డాయి ఈ పదేండ్ల కాలప్రవాహంలో జరిగిన మార్పుల్లో మాధవరావు M B BS డిగ్రీ సంపాదించి మదరాసులో ప్రైవేటు ప్రాక్టీసుపెట్టేడు చాలా ద్రవ్యంతోబాటు మంచి నెమ్మదిగల డాక్టరనీ చెయ్యిచలవ వుందనీ కీర్తికూడా ఆర్జిస్తున్నాడు ఇద్దరు ఆడపిల్లలు పుట్టేరు పెద్దమ్మాయి రేవతికి అయిగోయేళ్ళు, రెండో అమ్మాయి రోహిణికి మూడోయేడు నడుస్తూంది రాధ అయిదోమాసంగర్భిణీ ఇద్దరుపిల్లలూ చక్కనివారే రేవతి కొంచెం చాయ తక్కువ కాని ముఖం చాలా కళగా వుంటుంది రేవతి అచ్చంగా తండ్రిపోలిక చిన్నపిల్ల రోహిణి పసుపుతోకూడిన తెలుపు ఛాయతో పసిమిమ్మ పంగు లాగుంటుంది ముఖంలో చాలా నాజూకితనం అమాయకత్వం తొణుకులాడుతూంటుంది. మొత్తానికి ఇద్దరూ జనముద్దు పిల్లలే ఎరుపు డ్రస్సు రేవతికి, నలుపుడ్రస్సు రోహిణికి వేసి తోపుడు బండీలో షికారుకు పంపితే తోవపొడుగునా అందరూ ముద్దులాడుతుంటారు

మూడేండ్లక్రిందట గోదావరి పుష్కర స్నానాలకని రాజమండ్రి వెళ్లిన రామలక్ష్మమ్మ అచ్చట కలరా తగిలి అన్నగారింట్లో తన భౌతికదేహం వదలిపెట్టింది అందుచే మదరాసులో రాధా మాధవులిద్దరే పిల్లలను పెట్టుకుని కాపురమున్నారు వారి దాంపత్యము ఇరుగు పొరుగువారికి ఆదర్శప్రాయంగానూ, ఆనందప్రదంగానూ కనబడుతుంది'

సెలెక్టు థియేటరులో స్వర్గసీమ సినిమా వచ్చింది అది క్రొత్తగా 'రిలీజు' అవడం చేత భానుమతి తన అభిమానతార అవడం చేత సినిమాకు తీసుకెళ్లమని రాధ భర్తను కోరింది ఎన్నడూ అడుగని తనభార్య నాకు సినిమాకు వెళ్లుదామని అనుటచేత ఒకనాడు మాధవరావు రాధను పిల్లలను సినిమాకు తీసుకువెళ్లేడు

మాధవరావింట్లో వుండవలసిన హంగులన్నీ వున్నాయి ప్రాక్టీసు పెట్టిన రెండో ఏట ఇరవయివేలు పెట్టి ఒక పెద్దమేడ మైలాపూరులో కొన్నాడు ఒక అయిదువేలు పెట్టి మోటారుకొన్నాడు ఇంకొక పదివేలు ఖర్చుపెట్టి హాస్పిటలుకు కావలసిన పరికరాలు, మందులు తెప్పించాడు ఈ ఖర్చులన్నిటికి తన తల్లి అతి జాగ్రత్తగా దాచిన పదిహేను వేలు మెరకపొలం

అమ్మేస్తే వచ్చిన పన్నెండు వేలు, మామగారు సహాయంచేసిన అయిదు వేలు ఖర్చుకాగా బేంకిలో అయిదు వేలు అప్పుచేశాడు ఇంటి పనికి ఒక మగనౌకరు, ఒక ఆడమనిషి, వంట కొక అయ్యరుని పెట్టేడు. రాధకు ఏవిధమైన లోటు కలుగచేయ లేదు నారాయణ రావు లక్ష్మిందేవి అప్పుడప్పుడు వచ్చి కూతుర్నీ అల్లుణ్ణీ చూచి మనుమలని ముద్దులాడి నాలుగురోజులుండి ఆనందించి వెళ్లుతుంటారు.

సినిమా ప్రారంభమైంది ఇంతలో పరిమళ మిళితమైన ఒకపిల్లవాయువు మాధవరావుని చుట్టుముట్టింది 'ఎక్కడనుంచి వస్తూంది ఈ దివ్య పరిమళం?' అని అటు ఇటు చూచేడు తన ప్రక్కనే వున్న కుర్చీలో సుమారు పద్దెనిమిదేళ్ల అమ్మాయి కూర్చునుంది ఆమె తలలో తురుముకొనిన మల్లెలు, మొల్లలు, విరజాజుల కదంబపు పుష్పవాసనయే మాధవరావుని అలముకుంది ఎవ రీమె అని ఆమెను తదేక ధ్యానంగా చూచాడు తనకు తెలిసిన వాళ్లలో ఇటువంటి అమ్మాయిని ఎన్నడు చూచినజ్ఞాపకం రాలేదు తాను పదిపన్నెండేళ్లగా మదరాసులో కాపురముంటూన్నాడు చాలమంది ఇళ్లకు వైద్యం చేయుటకు వెళ్లుతుంటాడు మిక్సెడ్ క్లబ్బుకీ లన్నింటిలోనూ తాను మెంబరే అయినప్పటి ఎన్నడూ ఈ జవ్వనిని చూడలేదే అనుకున్నాడు సినిమా చూడడంలో లీనమైయున్న సుందరి ఈతనిని గమనించలేదు ఇంతలో 'గృహమే కదా స్వర్గసీమ' అని జయమ్మపాడిన పాట మాధవర వుని ప్రకృతిస్థుని చేసింది కొంచెంసేపటికి 'ఇంటర్వల్' అవడంచేత హాలులో దీపాలు వెలిగించేరు 'సోడాలైంజూస్' 'పాన్‌బీడా' వాళ్ల కేకలతో హాలంతా మారుమోగుతోంది ఎవరిసందడిలోవాళ్లున్నారు మాధవరావుప్రక్కను కూర్చున్న యువతి ఈయనను చూచి 'హల్లో, డాక్టర్ నమస్తే' అని నమస్కరించింది ఆమె ఆవిధంగా పలకరించడం చూచి తెల్లపోయేడు ఎందుకో కంగారుపుట్టింది కొంచెంసర్దుకుని "నమస్తే, క్షమించాలి మీ రెవరో నాకు గుర్తులేదు," అన్నాడు

"నే నెవరయితేనేమిలెండి మిమ్మలను, మీకీర్తిని, మీ ప్రతిభను నేను బాగా ఎరుగుదును సుమారు ఏడాదినుండి మీపరిచయభాగ్యంకోసరం నేను ఎదురుచూస్తూన్నాను అనుకోకుండా నేడు అది లభ్యమైంది"

"ఓహో అలాగా!" అని మాత్రం మాధవరావుఅనగలిగేడు ప్రక్కనే కూర్చున్న తన భార్య ఈ అపరిచిత వ్యక్తితో ఈ విధంగా మాట్లాడ్డం చూచి ఏమనుకుంటుందో అని చాలా భయపడ్డాడు కాని ఇంకా ఆ వ్యక్తి ఇతనిని వదలునట్లులేదు డాక్టర్ రేపు మీరు మా యింటికి ఒకసారి రావాలి మీతో చర్చించి నేర్చుకోవలసిన విషయాలు కొన్నివున్నాయి పోయిన సంవత్సరం మెడికల్ కాలేజీలో ఆంధ్రా వీక్ సెలబరేషన్సులో మీ రిచ్చిన స్పీచ్ ఎంత బాగుంది? సెలయేటి ప్రవాహంలాగ జలజల ప్రవహించింది మీ వాగ్ధోరణి ఎంత ఉద్దండులండీ మీరు మీ వుపన్యాసం విన్నతరువాత తతిమ్మా వారి వుపన్యాసాలు పేలవంగా కన్పడ్డాయి నాకు"

ఆమె ధోరణి ఏమీ మానేటట్టు లేదు తనభార్య కేసి చూశాడు మాధవరావు తమ సంభాషణ తన కిష్టము లేనట్లు రాధ మొఖంలో స్పష్టంగా కనబడింది సినిమా చూచి వికలమవుతున్న రాధ మనస్సుకు వీరి సంభాషణ సహింపరానిదే అయింది భర్తను వారింపదలంచి రాధ "రోహిణికి దాహం వేస్తూందిట కొంచెం లైంజూస్ ఇప్పిద్దామా?" అని అడిగింది

భార్యవుద్దేశము గ్రహించి మాధవరావు రోహిణిని ఎత్తుకుని బయటకు తీసుకువళ్లి ఆమెకు కావలసిన పానీయ మిప్పించి 'చాక్లేట్లు' పేకెట్టును కొని తీసుకువచ్చి భార్యచేతి కిచ్చేడు ఈసారి కూర్చునేటప్పుడు రోహిణిని తనకు ఆసుందరికి నడుమనున్న కుర్చీలో కూర్చోపెట్టి తాను భార్య పక్కని కూర్చున్నాడు మొదట అట్లు కూర్చుండుటకు సిగ్గుపడిన రాధ ఇప్పుడేమీ అభ్యంతరపెట్టక భర్త చేసిన పనికి మనస్సులో ఎంతో సంతోషించి నమస్కరించింది మాధవరావు బయటకు వెళ్లినదిమొదలుగా ఆ సుందరి వింత మృగాన్ని చూచినట్లు రాధని ఒకటే చూడడం మొదలుపెట్టింది రాధ ఆమెను చూసి ముఖం తిప్పుకుంది 'నీ గర్వం అణుస్తాలే' అన్నట్టు ఆ సుందరి తలపంకించింది మాధవరావు రాగానే 'ఆవిడ ఎవరండీ?' అని ప్రశ్నించింది సుందరి

"నా భార్య, వీళ్లిద్దరూ నా పిల్లలు" అన్నాడు

"ఓహో అలాగా మీ చిన్నమ్మాయి ఎంత బాగుంది అచ్చంగా మీపోలికే ముద్దులు మూటకట్టుతోంది"

ఇంతలో సినిమా ప్రారంభమైంది ప్రపంచంలో ఇంత అందమైన మనుష్యులుంటారా? అని మాధవరామెను చూచి ఆశ్చర్యపోయాడు అందానికి తగిన వాక్చాతుర్యం, చురుకుదనం కలసి బంగారానికి తావి అబ్బినట్లుంది ఆమె మాట్లాడితే మల్లెపూలు పైని చల్లినట్లు, పన్నీరు చిలికినట్లు అనిపించింది ఇంతవరకూ కూపస్థమండూకంలాగ ప్రపంచంలోకల్లా రాధే చక్కనిదని భ్రమించాను పరాయిమగవాడెవడైనా తన కొరకు వస్తే మా రాధ నేను ఇంట్లోవున్నాను, లేను అని చెప్పడానికి జంకుతూ జంకుతూ తలుపుచాటునుండి చెప్పతుంది ఈమె ఎంత ధారాళంగా ఇంగ్లీషు మాట్లాడింది అనుకున్నాడు అతనికి సినిమామీద ధ్యాసలేదు. ఏదో తప్పనిసరిగా చూస్తూన్నాడే కాని, అతని మనో విహంగం ఎచ్చటెచ్చటనో ఎగిరిపోతూంది. ఆ సుందరి రోహిణిని ముద్దులాడు నెపం మీద ఇతనికి ఆమె తనచేతిని తగిలించినప్పుడల్లా ఇతను కులిక్కిపడుతూన్నాడు కాని, ఆమె స్పర్శసుఖం తన శరీరం మరల మరల గోరుతూన్నట్లు చూచాయగా తోచింది

ఇంతలో సినిమా ఆఖరైపోవచ్చింది ప్రక్కను కూర్చున్న సుందరి 'నే నిప్పుడే బయటకు వళ్ళివస్తాను' అని చెప్పి మెరుపుతీగలా అంతర్ధానమైంది

జయమ్మ కష్టాలలో తాను కూడా పాల్గొంటూ సంతతధారగా కండ్లంబట నీళ్ళు కారుస్తూన్న రాధ ఈవిషయం ఏమీ గమనించలేదు సినిమా ముగిసింది దీపాల వెలుగులో తన ప్రక్కకుర్చీలో పడివున్న పర్సు మాధవరావుకి కనబడింది ఆ సుందరిదే అయి వుంటుందని తీసి పట్టుకున్నాడు

మోటారులో కూర్చుని అంతా ఇంటికి వచ్చేసినారు మాధవరావుకు నిద్రపోదామంటే నిద్ర రావటంలేదు కళ్ళుమూసేసరికల్లా ఆ సుందరి ప్రత్యక్షమవుతోంది మనస్సు దేనికొరకో వెదకుతూన్నట్లనిపించింది ఏదో ఆరాటం, చెప్పలేని ఆందోళన ఏమిటిది? ఏనడూ లేనిది నేను ఎంతమంది అందమైన లేడీ పేషెంట్లను చూచేను మిక్సెడ్ క్లబ్బులలో ఎంతమంది స్త్రీలతో కలసి మెలసి ఆటలు ఆడేను కాలేజీలో

ఎంతోమంది యువతులతో కలసిపనిచేసేను నాకు ఎన్నడూ ఈవిధంగా కాలేదు నా హృదయ తంత్రులను తన కొనగోటితో మీటుతూన్నట్టు ఆ సుందరి నా హృదయం కదలించివేస్తూంది కొంపదీసి రాధకు ద్రోహం తలపెట్టనుగదా! పాపం! అమాయకురాలు, ప్రశాంతంగా నిద్రపోతోంది సినిమాలో కథానాయకి జయమ్మ పడుతూన్న కష్టాలు చూచి ఎంత కన్నీరు గార్చింది— భానుమతికూడా ఎంతబాగా యాక్టుచేసింది నిజంగావేషానికంటే ఆవేషానికతికినట్లు యాక్టుచేసింది సినిమాలోలాగే ఈ సుందరి కూడా మా స్వర్గసీమలో అడుగు పెట్టదు గదా! ఈ ఆలోచన మనస్సులో తట్టగానే భయకంపితుడైనాడు

'ఛీ—ఛీ అటువంటిపని ఎన్నటికీ చేయరాదు అమాయకురాలు, చిన్నప్పటి నుండి నామీద అతిప్రేమ ఒలకబోసి, నన్ను ప్రేమించి పెళ్లిచేసుకున్న నాచిట్టి మరదలు, అర్ధాంగికి లేశమాత్రం కష్టం కలిగించను మా మామకు, అత్తయ్యకు తెలుస్తే ఏమనుకుంటారు? ఊరిలో ఎంత అప్రతిష్ఠ! నా ప్రాక్టీసు కెంత భంగం? తలెత్తుకు తిరగగలనా? అటువంటి ఆలోచనే నామనస్సుకు తెచ్చుకోరాదు, నేను ఇక పోయి పడుకుంటా?' అని పడకకుర్చీలోంచి లేచి పక్కమీదకు వెళ్లి పడుకున్నాడు

తీరా కళ్లుమూసుకునేసరికి సినిమాలో సుందరి తన మనశ్చక్షువులకు ప్రత్యక్షమైంది

'అబ్బ! ఏమిది!! నిద్రపోదామంటే నిద్ర రావటంలేదే కళ్లుమూసుకునే సరికల్లా ఆ జవ్వని ప్రత్యక్షమవుతూంది అబ్బ ఎంత నాజూకుగా వుంది 'నమస్తే' అని నమస్కారం పెట్టినప్పుడు ఆమెచేతులు దంతపు ముక్కలేమోయని భ్రమింపచేశాయి ఆమె పొడుగాటివేళ్ల గోళ్లకు రాసుకున్న 'క్యూటక్సు' దీపాల వెలుగులో నక్షత్రాలలా మెరిసేయి కట్టుకున్న కనకాంబరం జార్జెట్టుచీర ఆమె అందానికి మెరుగులు దిద్దుతో దేహచ్ఛాయలో సమ్మిళితమైపోయింది ధరించిన ఎరుపురంగు శాటిన్ జాకెట్టు ఎంత అమరివుంది నడకలో ఎంత ఠీవి కనబరుస్తూ వెళ్ళింది ఇంతకూ ఆమె ఎవరో చెప్పిందికాదు కన్యకో,పరకీయో? కన్యకయితే మాత్రం నాకేం ప్రయోజనం? పరకీయను మాతృభావమున చూచు పవిత్రమైన భారతదేశములో పుట్టిన నాకిట్టి ఆలోచన రారాదు ఆమె పేరయినా కనుక్కోలేదే! నీవెవరో నాకు గుర్తులేదంటే ఎంత చమత్కారంగా తప్పించింది?'

ఇంతలో బల్లమీద పెట్టిన ఆమె పర్సుమీద అతని దృష్టిపడింది

'అన్నట్లు ఈపర్సు ఆమె కెట్లందీయాలి? ఒకవేళ ఇందులో ఆమె అడ్రసు ఏమైనా వుంటుందేమో! తెరచిచూస్తాను'

అని అనుకుని తెరచిచూస్తే అందులో ఒక అయిదు రూపాయిలనోటు కొంత చిల్లర కనబడింది మధ్యనున్న 'జిబ్' లాగాడు అందులో కార్డుసైజులో ఆ సుందరి ఫోటోవుంది దానికింద 'పుష్పలత 112 కీల్పాకు మెడ్రాసు అని వ్రాసివుంది ఆఫోటో తీసి తదేకధ్యానంగా చూచాడు పుష్పలత పార్శీవేషంలో తీయించుకున్న పోటో అది అర్ధచంద్రుడివంటి ఆమె నుదుటిపై ముంగురులు జీరాడుచు వింత అందమిస్తున్నాయి నిడుదలై విశాలములైయున్న ఆమెకండ్లకు కాటుకరేఖలు తీర్చివున్నాయి యవ్వనపు పొంగు పొరలి ప్రవహించుచున్నట్లున్న ఆ సుందరివిగ్రహం చూచిన కొలది మాధవరావు ఉన్మత్తుడు కాసాగేడు ఆపోటోని కండ్లకు అద్దుకున్నాడు హృదయానికి హత్తుకుని ఈసుందరి కొరకు ఏ పురుషుడు తపస్సు చేస్తూన్నాడో కదా! అని అనుకున్నాడు తాను చేస్తున్నపని తప్పేమో అని తోచింది స్త్రీ కళాస్వరూపిణి అట్టి కళామూర్తిని ఆరాధించానేకాని నే నెట్టి దోషము చేయలేదుగదా! పేరు పుష్పలత ఎంత చక్కని పేరు తల్లిదండ్రులామె చక్కదనము చూచి పేరు పెట్టినట్లున్నారు ఏమయినాసరే రేపు వుదయం ఈమెదగ్గరకు వెళ్ళి వివరాలన్నీ కనుక్కుంటాను లత పొరపాటుగా పర్సు పారేసుకుందనుకున్నాను-నేను పొరపాటుపడ్డాను ఆమె బుద్ధిపూర్వకంగానే వదలిపెట్టి వెళ్ళింది నాకు తన అడ్రసు ఇచ్చేవుద్దేశంతోనే వెళ్లినట్లు ఇప్పుడు తోస్తూంది 'ఈవిధంగా ముందుకూ, వెనకకూ' దాగట్లో పడ్డ వెలంకాయలాగ ఉగులాడుతుండగా గోడనున్న గడియారం టంగు టంగున రెండుగంటలు కొట్టింది

రాధకు మెలకువ వచ్చి చూచింది మంచముపై భర్త లేడు అటు ఇటు కలయ చూచింది తలవేపున వున్న కుర్చీలో భర్త కూర్చునివుండడం చూచింది పాపమా యిల్లాలు తన భర్త ఏదో వైద్య గ్రంథం చదువుకొంటున్నాడనుకుంది

"ఇంకా పడుకోనేలేదా మీరు డాక్టరై వుండికూడా ఆరోగ్యవిధులు పాటించరు కదా! ఏం చదువో! అస్తమానం ఒకటే చదువు," అని భర్తతో అంది

రాధ ఎక్కడ లేచి వస్తుందో, తన చేతిలోవున్న ఫోటో ఎక్కడ చూస్తుందో అని మాధవరావు కంగారుపడి 'లేదు లేదు రాధా వస్తూన్నాను నీవు పడుకో. అయిపోయింది' అని రాధకు జబాబిచ్చి పుష్పలత ఫోటో భార్యకు కనబడకుండ జాగ్రత్తగా పర్సులో పెట్టేసి వచ్చి పడుకున్నాడు

"సినిమాలో జయమ్మపడ్డకష్టాలు చూడలేకపోయానండీ ఏదో స్వర్గసీమ అంటే ఏమిటో అనుకున్నాను"

"కష్టసుఖాలు కావడికుండలు అంటారుగా, ప్రతీవాళ్ల జీవితంలోనూ కష్టసుఖాలు సమ్మిళితమైయే వుంటాయి"

"సుఖం అనుభవించవచ్చునుగాని కష్టం అనుభవించడం కష్టం ఒకళ్లు కష్టపడుతూవుంటే చూడలేముకూడా!"

"వెర్రిదానా ఒకళ్లు సుఖపడుతుంటే చూడలేనివాళ్లుకూడా వుంటారు మనం అనుభవించలేమంటే తప్పుతుందా? మనం ఇంత స్వర్గసౌఖ్యం అనుభవిస్తూన్నామా? మరొక గడియకు ఏమవుతుందో నీవూ, నేనూ చెప్పగలమా?"

భర్త యథాలాపంగా అన్న మాటలకు రాధ వులిక్కిపడింది సినిమాలో, పుష్పలతను చూచినదగ్గర్నుండి ఆమె మనస్సు ఎందుకో బాధపడుతోంది దానిపై భర్త అన్నమాట ఏదో రానున్న ఆపదకు సూచన అన్నట్లు అయింది సంభాషణ మార్చదలంచి "ఏమండీ మరీ ఈ వూరిలో ఆడపిల్లలకు సిగ్గుఎగ్గులు బొత్తిగాలేవు మీ పక్కని ఆ అమ్మాయి అలాగ వచ్చి కూచుందేమిటి? పైగా ఎన్నాళ్లబట్టో పరిచయమున్నవాళ్లలా కబుర్లుకూడాను ఆ అమ్మాయి అలాగ మాట్లాడుతూంటే నాకూరికే వెంపరమేసింది పరాయి మగవారన్న జంకు ఏకోశానా లేదు ఒకటే పకపకలూ, బెకబెకలూను

"కూర్చుంటే తప్పేముంది? కాలేజీల్లో కలసిమెలసి చదువుకోవటం లేదా? ఆఫీసుల్లో కలసి పనలు చేయడంలేదా? పురుషులతో సమాన హక్కులు కావల

(47-వ పేజీ చూడండి)

# గొప్పోరింటోపెళ్లి

కె. జగన్మోహన్

"యేం జనం! యేం జనం!!" అంటూ ముక్కుమీన యేలేసుకుంది మంగి. యేటా యిస్త్రమని మంగాయి గుడిసెలోంచి పేటికి తలెట్టి సూశాడు

"యెంత మందొత్తే' యేమే యెంకట సుబ్బయ్య గోరికో లెక్కా జమా! యిట్టాటియి వాల్లునా యేకబిగువున సేత్తాడాయన"

"మొన్నమానానికి మొన్న మనూర్లో జరిగిందానికి ఆయనగోరుంపమట్టి సరిపోయింది కాని అరెరెరె ఇంకేమన్నా వుండదా?

"అద్సరేగాని మంగా అరింటికాడ యివాగం యెప్పుడేటి? యెల్దారా మరి?

"తెలేటి — ఓయబ్బోహ్ బెమ్మాండంగా పందిరేయింఎంచి అందరికీ ముద్దే యిప్పాలైడంట — పొప్పు ముద్ద రేపే!

యెంకటసుబ్బియ్ గోరంటే పెద మోతుబరి రైతు ఆయన మాట కాదనేవాడెవుడూ లేడంటే తెలుత్తది ఆయనస్తాత్తా బంగమీసం మెలేసి చేత్తో కోలబుక్కరుచ్చుకుని, నోట్లో సుట్టెలిగిచ్చి, తలగుడ్డసుట్టి కిర్రుచెప్పులు అవజాన మోగుతావుంటే వూరిమీనకొత్తే ఆయన సుట్టూ జనమే సరకారోళ్ళు లోగూడ సానా పలుకుబడుం దారికి అదే కాకపోతే మొన్నమానానికి మొన్న పరాబవం తప్పేదిగాదు తెల్లారేతలకల్లా నాలు గొందలు మిలిట్రోళ్లు సుట్టేశారూరుని గొడ్డును తోలినట్టు వూర్లో పెద మనుసుల్ని గూడ లెక్కసేయక డా తోలుతావుంటే యదవ నాయాళ్ళు యెంకట సుబ్బియ్‌గోరికి మండి ఒక్కగీత కాయితకంమీన గీసి కరిసీలో కూకుంటాయన కిత్తే తెల్లమొగమేసి గుక్క తిప్పుకోలేక అల్లనాపర్ని వూరు కోమన్నాడు పెదపురుగు లాదిలినట్టొదిలి పోయారు ఆయన కడుపు పల్లగుండ!

పూలపల్లకీ, బాండు, సనాయి, బోగమోళ్లు యేహ్ ఒకటేంటి సమత్తముండాలి సూడ ముచ్చటగా వుండది పిల్ల పూలపల్లకీలో పెల్లికూతురు సుక్కలా మెరుత్తా వుండాది మూడు పొద్దుల పెళ్లి అయిపోయె!

మంగి, మంగాయ బుట్ట లుచ్చుకుని పప్పుముద్ద కల్లారు పెల్లోరు భోం చేత్తా వుండారు యేయ్ పప్పు, చారుపప్పో ఓసి పులుసెదీ! యీ అవజాన నివరకంటా సానా వుసారుగానే జరిగింది సానాసేపుండాక యెంకట సుబ్బియగోరు కాసింత వుసులుబోటు సూసుకునొచ్చి "యేమిరా మంగా! రేపొద్దుటజాము నను వుమోళీ యేయాలి" అన్నాడు మంగాయికి సంబరమేసి అన్నాడుగదా — "అడెంత లెగుండి సాటిం పే యిచ్చండి"

మంగేపు కన్నుగీటాడు కోరమీసం నంచుంది

* * * *

మంగడంటే సానావూర్లు పేరు మోగిపోయాడు ఆ పక్కల మంగడలో నాగసారం వాయిచ్చి నాగుబాముని ఆడిచ్చే మొనగాడే లేడు కట్టుకట్టాడంటే అవజాన మూడుగంటలయినా వుండాలిసిందే అంత నిబ్బరముండది గాబట్టే మంగాయి మొన్న పట్టిన కోడెతాసుకి కోరలు తీయలా 'రేపొద్దుటజామున మంగాయ నాగ

(22-వ పేజీ సూడండి)





# గులాబిపూల అనుభవాలు

శ్రీ కాలజ్ఞానం నారాయణరావు

తెల్లతెల్లవారేసరికి బాటవెంబడి గులాబి మొక్క రెమ్మపైన జంటగా రెండు పరిమళించే పెద్దగులాబిపూలు రేకులు విప్పాయి దారివెంట పోయే పక్షులు మందమారుతాలు భ్రమరాలు ఆగి రెప్ప వేయకుండా చూసి మరీ కదిలేవి ఆ జంట గులాబిపూలలో ఒకటి అక్క మరొకటి చెల్లెలు అక్క చెల్లెలికన్నా ఒక్కక్షణం ముందు వికసించింది

అక్కకు దారివెంబడి వచ్చిపొయ్యే ఆ బాటసారులు చూసే చూపులు కోపం తెప్పించింది వాళ్లకళ్లలోని ఆత్రాన్ని చూసి ఏవగించుకుంది చెల్లెలితో "చూడవే చెల్లాయ్ వీళ్ళపొగరు దారివెంబడి పొయ్యే వాళ్లు తమ పని చూసుకోక మనల్ని ఏలా నిలబడి చూస్తున్నారో? మటు మర్యాదా ఏమైనా ఉండి ఏడ్చింది?" అంది కానీ చెల్లెలికి వాళ్లు అలా చూడ్డం ఎంతో గర్వ కారణంగా తోచింది తన అందచందాలకి మురిసి తన్ను అందరూ చూస్తుంటే విచారం దేనికి? ఆనందపడాలి కానీ! అనుకుంది అంతేకాదు ఈ మొక్కపైన ఆకులచాటునుంటే ఏం జీవితం? ఏదో ఒకరూ, యిద్దరూ వచ్చిపోతుంటా వాళ్లుమాత్రమే చూస్తారు కానీ తన అందచందాలు అంతటా చూడబడాలి వీళ్లలో ఒకరు తన్ను భద్రంగా తీసికెళ్లి ప్రపంచానికంతా చూపరాదూ? అనుకుంది

చెల్లె గులాబికి ఎంతసేపైనా తన అందచందాలు అందరిచేత పొగడబడ్డంతప్ప వేరే ఆలోచనే లేదు అందుకనే "అక్కా! చూడనీవే మన అందంచూసి వాళ్లు స్థబ్దులై నిలిచిపోతున్నారు వాళ్ల కొంటెతనమా అది? మనం గర్వించాలికానీ? చూడనీ ఎంత చూస్తే అంత సంతోషించాలి" అంది అక్కతో

అక్కకు చెల్లెలి అవినీతికి చాల కోపం వచ్చింది చెల్లాయితో "అదేమిటే తెలివి లేనిదానా! నీకు అహంతప్ప వేరే చింత లేదు నీ అందచందాలు, నిన్నూ అందరూ చూడ్డమేనా ప్రధానం? హృదయం ఉంటే తగినవాళ్లెవరినో ఏరుకుని వాళ్ల సిగపైన, వాళ్ల ఆనందానికి జీవితమివ్వాలికానీ, మన అందచందాలు ప్రకటించుకునే వదుప్రబతుకెందుకు? కాల్చనా?" అంది

కానీ చెల్లెలికి ఆ మాటలు రుచించలేదు "సిగపైకెక్కి ఎవరికో ఒకరికి ఆనందం యివ్వాలా? ఛా! ఛా! నాల్గుమంది నోటా "ఆ పూవు చూడు ఎంత అందంగా ఉంది!" అనిపించుకోవాలి నా చుట్టూ మల్లెపూలుపేర్చి నన్ను అందంగా దిద్దగల వాళ్లు నేను వాడకుండా గొడుగుపట్టి నన్ను నలుగురూ చూసేలాగు వీధువెంబడి త్రిప్పగలిగేవాళ్ల సిగ ఎక్కుతాను వాళ్లు నా అందానికి తీరులు దిద్దేవాళ్లుగా ఉండాలి వాళ్లే త్యాగంచెయ్యాలి, జీవితమివ్వాలి నేనెందుకు వృధా నాశనమౌతాను? అని గర్వంతో రేకులు కేసరాలు తోడిమా కదిలిస్తూ వొయ్యారంగా బదులిచ్చింది

అక్కకు చెల్లెలిమీద అసహ్యం పుట్టుకొచ్చింది "ఒకటిగా పుట్టి, ఒక రెమ్మమీద పెరిగి, ఒకతల్లిఆకు చాటులోనే ఎదిగాం బుద్ధులూ అభిరుచులూ వేరైనాయ్ నీ ఇష్టం నిన్ను మార్చగలనా" అని ఊరుకుంది

ప్రొద్దు పైకెగబ్రాకడంతో ఎండ ఎక్కువై గులాబిపూలకు వేడి తగుల్తోంది చెమట పడ్తోంది ఇంతవరకు వాళ్ల కోరికలు ఫలించేమార్గం కనిపించలేదు అక్క ఇంతలో బాటవెంబడి వచ్చే ఓ చిన్న అమాయకపు పిల్లను చూసింది తలంటుకొ వదులుజడ వేసి తెల్లటి దుస్తులు తొడిగి ఆడుకుంటూ పాడుకుంటూ వస్తున్న

ఆ అమ్మాయిని చూడంగానే అక్క గులాబి తన హృదయాన్ని అర్పించింది చెల్లెల్ని చూసి "ఆ వచ్చే పిల్లదాన్ని చూశావ్" అంది

"ఎవరూ! చినిగిన పావడకట్టుకుని వచ్చే బీదపిల్లా? ఒక్క నిముషంలో నిన్ను సిగలో తురిమి, ఎండలో ఆడి వాడ్చి పారేస్తుంది దానిసిగ ఎక్కుతావా?" అంది

"కానీ ఎంత ఆనందంతో వస్తోందే? తనకు గులాబిపూవు కావాలి ఆశతో నన్ను తలలో పెట్టుకుని ఆనందిస్తుంది నావల్ల ఎంత ఆనందం ఆ పిల్లకి? అంతకంటే జీవితం దేనికి?" అంది చెల్లెలు నవ్వొచ్చింది

"అదృష్టవంతుణ్ణి చెరిచేవాళ్లూ లేరూ, దురదృష్టవంతుణ్ణి బాగుపరిచే వాళ్లూ లేరూ, దురదృష్టవంతుణ్ణి బాగుపరిచే వాళ్లూ లేరే అక్కా! ఓ అక్కా! ఆలా మాడు"

"ఎవరే! ఆ నల్లగా, ముఖం నిండా బూడిదరాసుకుని, చెమట కార్చుకుంటూ, ఎత్తు మడమల చెప్పులు తొడిగి, చాలీచాలని గొడుగుపట్టుకుని బిగువు దుస్తులలో పోయే ఆవిడా? వళు వెళ్లు, ఆ చెమట గబ్బులో, కంపు సిగలో ఏం ఆనందమే? నలుగురిలోకి పోయి నిన్ను త్రిప్పుతుందనా? సరే వెళ్లు తిరిగీ కలుసుకుంటే మాట్లాడుకుందాం? లేకపోతే యిదే కడసారి చూసుకోవడం" అంది అక్క

అక్క ఆచిన్నపిల్ల సిగలోకి చేరింది చెల్లి ఆడంబరస్తురాలిసిగనెక్కి కూర్చుంది ఎవరిదారిన వాళ్ళు వెళ్ళారు

సాయంత్రం కావచ్చింది ఆడుకోడానికి తోటలోనికి ఆబీద పిల్ల వచ్చింది తలలో వాడిన ఆ అక్క గులాబి తల్లియొక్క దగ్గరే రాలి పడింది సిగనుండి ఎదురుగా తెల్లవారి బయల్దేరిన విలాసిని చెమటలు కార్చుకుంటూ నలిగినచీర, చెదిరిన జుట్టుతో వస్తోంది సగం రేకులు ఊడిపోయి, కేసరాలు నలిగి వాడి చితికిన చెల్లె గులాబి నిట్టూరుస్తూ అదే ప్రదేశంలో గసి వదిలి సొమ్మసిల్లి క్రిందపడింది అక్క గులాబి సాయంత్రానికి కొంత సేద దీరి చెల్లాయిని లేపింది "ఏం చెల్లీ యీలా అయ్యావే? ఎంత ఆపదవచ్చిపడింది" అంటూ కంట తడిపెట్టింది చెల్లికి దుఃఖం ఉంపబట్టక మిగిలిన కేసరాలు, రేకులు చాచి అక్కను కౌగిలించుకుని బోరునఏడ్చింది "నీవన్నది నిజం అక్కా బుద్ధి గడ్డితిని, మెప్పుకని ప్రాకులాడాను ఒక్క క్షణమైనా ఆత్మతృప్తి లేకపోయింది కృత్రిమ వాతావరణంలో, కళ్ళంతా చూస్తూ తిరిగి విసిగి మనుష్యులంటేనే రోత పుట్టింది" అంటూ విలపించింది

"అదేం చెల్లీ! బుద్ధున్న మానవుల్నే ఆలా తిట్టున్నావ్" అంది అక్క

"ఏం బుద్ధే పాడు బుద్ధి! స్వార్థంతప్పితే ఒకరిగొడవే అక్కరలేదిమానవులకి దారి వెంబడి పోతో అందరివేపూ చూశాను ప్రతి సిగలోనూ గులాబులే ఒక్కరైనా నావేపు మాడలేదు ఈ తోటలో మనం అరుదేమో కానీ, ఆ వీధిలో అందరి తలలో మన మే ఏం చౌకబడిపొయ్యామే అక్కా! ఆ విలాసిని వళ్ళి ఎవరో ప్రియుణ్ణి కలుసుకుంది సరాసరి వాణ్ణి చూడ్డంతోనే నన్ను తీసి వాడికిచ్చింది వాడుమాత్రం నన్ను చూడకుండానే ఆ నల్ల కోతి ముఖంలోకి చూస్తూ-(అక్క గులాబికి నవ్వొచ్చింది)- "ఆహా నీ ముఖం ఈ గులాబికంటే అందంగా ఉంది" అన్నాడు ఛీ అని రోతబుట్టి చేతి నుండి ఎగిరిపోదాం అనుకున్నాను ఆ పాడు దైవం రెక్కలైనా యిచ్చాడు కాదు! ముండ్లతోనైనా గిచ్చిపెడ్దాం అనుకుంటే అదివఱకే ముండ్లు తుంచి జడలో తురిమిందా? "ఇది నీ తలలో ఉంటేనే దానికి రాణింపు" అంటూ వచ్చిరాని విధంగా ఆమె తలలోకి తురిమాడు నా రేకులు కేసరాలు సగానికి విరిగాయ్ "అమ్మో" అంటూ ఏడ్చాను అరణ్యరోదనమైపోయింది ఇంతలో ఆమె తలను రెండుచేతులా అదిమిపట్టి ముందుకు వాల్చుకున్నాడు ఆ చేతులమధ్య నన్ను పూర్తిగా నలిపేశాడు దాంతో మూర్ఛపోయాను

తెప్పరిల్లేసరికి ఏదో గదిలో కూర్చొని నా ఊసే అనుకోక వ్రాసుకుంటోంది పైన గిర్రున చక్రం ఏదో తిరుగుతూ గడగడ శబ్దం చేస్తూ ఎక్కడలేని గాలి గుమారం రేపింది నా నలిగిన రేకులు నాలుగూ ఎగిరిపోతే అందుకోడానికైనా లేక దిగాలుపడిపోయాను ఒళ్ళంతా చెమర్చుకుంటూ ఆ విలాసిని కాస్సేపటికిముందే బయల్దేరి ఈ ఎండలో గబగబ యింటికి వచ్చేస్తోంది ఆ చిన్ని గొడుగు కాస్తైనా నీడనిచ్చిందా? వొట్టి విలాసానికి కాకపోతే? వాడి చితికి ఎలా తీరానో చూడు" అంది పొంగివచ్చే దుఃఖంతో చెల్లిని ఓదారుస్తూ అక్క "పొఱబాట్లు అందఱూ చేస్తారు నేను మాత్రం వాడిపోయాను కాదా" అంది

"మరి నాలా ఎవ్వడం లేదుకదా? చితికిపోలేదు నీ కథ చెప్పవూ" అని ప్రాధేయపడింది

"ఆ చిన్నపిల్ల నన్ను సిగలో తురిమి ఆనందంతో జడ భుజాలమీదికి ఎగరవేసుకుంటూ యింటికి వెళ్లింది వాళ్ల అమ్మ మండిపడి "శృంగారించుకున్నావా? ఆపిడకుప్పలన్నీ పిడకలు తట్టరాదూ?" అని కసిరింది పిల్ల మూతిముడుచుకుని ఆవుల కొట్టాంలోకి వెళ్లింది అయ్యోపాప మనిపించింది నాకు మరింత ఎక్కువ పరిమళం వెదజల్లాను కుడితితొట్టిలో తొంగి తొంగిచూసుకునే పిల్ల ముఖాన్ని తొంగి చూశాను ఎంత ఆనందం? నావల్లే అంత ఆనందపడుతోందని తెలిసి చాల గర్వం వేసింది పాపం! ఆ పేడనంతా కుప్పచేసి, ఉండలుకట్టి, పిడకలు తట్టుతోంది ఆ తల ఊపులో ఎక్కడ రాలిపోతానో అని జాగ్రత్తపడింది చేతులు కడిగి నేను ఉన్నానో లేనో అని తడిమి చూసింది శ్రమతో ఎఱ్ఱపడిన ఆ చేతుల్ని రేకులతో ముద్దుపెట్టుకున్నాను ఆనందంతో లోపలికి వెళ్లగానే కూరలు తరిగే వాళ్ల అమ్మ ఆరిన పొయ్యిని రాజెయ్యమంది కళ్లు నులుముకుంటో నన్ను జాగ్రత్తపెడుతో పొగలో ఆ పిల్ల పొయ్యి ఊదుతోంటే ఏడుపొచ్చింది పాపం ఆ ముఖమంతా కందిపోయింది నా కంట్లో నీళ్లు తిరిగింది ఇంతలో వాళ్ల నాన్న రావడంతో అదంతా మరిచి నన్ను ఓమాటు చూసుకుని తలుపు తీయడానికి గెంతింది వాళ్ల నాన్న ప్రేమతో లాలిస్తే "నాన్నా ఈ తలలో ఏముందో చూడండి! ఎంతో బావుంది కదూ!" అంది "నా బుల్లెమ్మ మరింత బాగుంది" అన్నాడతను నాకూ నిజం అనిపించింది భోజనానికి పీటమీద కూర్చున్న

---

అమ్మాయికి అన్నంమీదికన్నా నా పైనే ఎక్కువ శ్రద్ధ అన్నం తినంగానే కండ్లలోకి జోగురావడంతో వాళ్ల నాన్నతో మంచం చేరుకుంది నేను నలిగిపోతానని బోర్లపడుకుంది అప్పుడప్పుడు "పువ్వు ఉందా" అని నాన్నను అడుగుతోంది "ఉన్నాను ఇక్కడే ఉన్నానని" అనా లనిపించింది కానీ నోరు పెగిలితేనా వాళ్ల నాన్న ప్రేమతో ఆ అమ్మాయిని జోకొట్టి నిద్రపుచ్చుతుంటే లాలిపాడా లనిపించింది ఈ జన్మ అంత నోచుకుంటేనా? పిల్ల నిద్రపోయింది బయటి వేడికి, దేహంలోని ఉష్ణానికి నాకు అప్పుడే ఒళ్లంతా వాడిపోతోంది నిద్రలేచి ముఖం కడుక్కొని ఫలహారంచేసి తోటలోనికి వచ్చింది అమ్మాయి మన తల్లి మొక్కదగ్గఱకిరాగానే నాకు మళ్ళీ స్వస్థలంపై ధ్యాస పోవడంతో ఆ అమ్మాయిని విడువలేకుండా విడిచి రాలిపడ్డాను ఉన్నంతసేపు ఉండబోముకదా ఈ కాస్సేపైనా పుట్టినచోట ఉండిపోదాం అనుకున్నాను పాపం ఆ అమ్మాయి నేను లేనని తెలిసి ఎంత నిరాశపడుతుందో?" అని నిట్టూర్చింది అక్క

రేకులూ కేసరాలూ తొడిమా విరిగివున్న చెల్లి అంతా విని "అక్కా ఎంత అదృష్టవంతురాలివే అబ్బా నీ మాటల్లో ఎంత ఆనందం, తృప్తి ధ్వనిస్తోందే నిజం స్వార్థంలో ఏం లేదు ఒకరికి ఆనందం యివ్వగల్గడంలోనే నిజమైన ఆనందంఉంది అక్కా జీవితమంతా వృధా అయిపోయింది విరిగిన ప్రక్కలూ, గుండె చాల నొప్పి పుడ్తోంది ఎంతసేపో బ్రతకను నిన్ను హేళనచేసినందుకు క్షమించు అక్కా!" అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది. ఇంతలో అటువేపు తొందరగా పోతున్న పిల్లగాలి చెల్లిని ఒక్క త్రోపు తోసింది మరింత బాధతో అక్కను కౌగిలించుకుని "అయ్యో! అక్కా సెలవంటూ" వాల్గింది చెల్లి "నీవు నాకన్నా క్షణం వెనక పుట్టావ్ ఓ క్షణంముందు పోతున్నావ్ మరుక్షణం నీవెంట నేనూ వస్తున్నానని" ఆ కౌగిలింతలోనే అక్కా చెల్లెండ్రు ప్రాణాలు విడిచారు

ఇంటికి మళ్లే పక్షులు, మందమారుతాలు భ్రమరాలు పూలకని రెమ్మవేపు చూసి, నిరాశతో క్రిందపడున్న ఆ వాడు పూశవాలపైన రెండు అశ్రుకణాలు రాల్చాయ్ కానీ ఆ బాటసారుల కేం తెలుసు ఆ అక్కా చెల్లెండ్రు అనుభవాలు? ★

## ముష్టి వెధవ

(10-వ పేజీ తరువాయి)

'షికారుకు వెళ్తూ మావెంటనున్న కుక్క ఒక పిల్లిని తరుముకుంటూ వొస్తే దాన్ని '

'ఎలాగైతేనేం మీరీ ఆలయంలో కాలు పెట్టడమే ఘనత '

'మాకుక్క గాని యిటురావడం మీరు చూశారా?'

'అదే వొస్తుంది లెండి ఇంతలో కొంచెం తీర్థం ప్రసాదం పుచ్చుకొని '

'మొన్ననే కొన్నానా కుక్కను రెండు వందలిచ్చి మీకు తెలుసునో తెలియదో మహామంచి కుక్క సుమండీ' మన మొక ఛాన్సులో కొట్టేశాం. లేకపోతే ఏ ఐదు వందలకో '

ఇంతలో పరుగెత్తే పిల్లిని వెంటతరుముతూ వొచ్చింది కుక్క ఆ భైరవాకారంచూసి గగ్గోలుపడి చెల్లాచెదరై పోయారుజనం ఒక్క ఉదుటులో పిల్లి విగ్రహాల వెనక్కిపోయి దాక్కుంది ఒక్కదూకుతో కుక్క విగ్రహాలమీదపడి అంతా చిందరవందర, కలగాపులగంచేసి విడిచిపెట్టింది ప్రమిదలు బోర్లపడి ఆరిపోయాయి దీపాలు కేకలుపెడుతూ పైకి పారిపోయారు ప్రజలు కంగారుతో

* * * *

కొన్ని క్షణాలు గడిచిపోయాయి నిశ్శబ్దంగా హృదయ విదారకమైన గాఢాంధకారం, భయంకర నీరవతా అలముకున్నై ఆలయంలో మళ్లీ అంతా సర్దుకుందుకు యింటికి వెళ్లివచ్చాడు పూజారి కొవ్వొత్తి వెలిగించుకొని మినుకుమినుకు మంటున్న కొవ్వొత్తి కాంతిలో ఎవరో దేవుని విగ్రహానికి ఎదురుగా సాష్టాంగపడి ప్రార్థిస్తూవున్నట్టు అస్పష్టంగా అవుపించిం దతనికి చీకటిలోకూడా భగవంతుని ఎదుట మోకరించే ఆ మహాభక్తు డెవరా అని కుతూహలంతో సమీపించాడు పూజారి నిర్జీవమైన యాచకుని శరీరం తన కంటపడ్డది కొరడుబారిన కళేబరం యిరువైపులా అరటిపండ్లూ, కొబ్బరిచెక్కలూ కుప్పతిప్పలుగా పడివున్నై

పూజారికి కొంత జాలివేసినా మళ్లీ ఒళ్లు మండుకొచ్చింది ఈ వెధవ యీఅధ్వాన్నపు చవు గర్భగుడిలో చావకపోతే మరోదగ్గిర చావకూడదూ! ఇప్పుడే దేవాలయం యావత్తూ మైలడిపోయింది దేవుడు మైలపడ్డాడు దేవాలయాన్ని పుటంపెట్టి, దేవుణ్ణి ప్రోక్షించాలి అన్నా! ఎంత చిక్కు తెచ్చిపెట్టాడు యీ దిక్కుమాల్న ముష్టాడు! ★

---

"ఒకే, రెండణాలుపెట్టి ఆ ఐస్‌ఫ్రూట్ తినకపోతే ఎవరైనా బీదలకు ధర్మంచెయ్య గూడదూ?"

"ఆపనే చేద్దామనుకున్నా గాని, బేడా ఐస్‌ఫ్రూట్ వాడికిస్తే వాడే ఆధర్మం చేస్తాడుగదా అనిపించింది."

* * * *

"మా అమ్మాయిని పెళ్లాడితే దాన్ని పోషించటానికెంత రాబడి ఉంటుంది నీకు?"

"ఏడాదికి వెయ్యిరూపాయలు"

"ఇంకేం, మాపిల్లకొక వెయ్యిరాబడి ఉంది అదీ ఇదీకలిసి—"

"అదికూడా లెక్కవేసే చెప్పాను లెండి."

# కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో

(8-వ పేజీ తరువాయి)

"తప్పకుండా అదే మంచిది"

"సరే అయితే" అంటూ మాంట్ క్రిస్టో ప్రక్కనే ఉన్న కాలెండర్ తీసి చూశాడు "ఇవాళ ఫిబ్రవరి 21 ఇప్పుడు పదిన్నరయింది మే 21 వ తేదీ ఉదయం పదిన్నరకి సరిగ్గా నేను వస్తాను"

"సరిగ్గా ఆ వేళకి మే మందరం అన్నీ సిద్ధంగా ఉంచుతాం మీకోసం భోజనాది సదుపాయాలన్నీ చెయ్యబడతాయి"

"మీ నివాస మెక్కడ?"

"హెల్డర్ వీధిలో 27 వ నెంబరు ఇల్లు నేను మాతండ్రిగారి భవనంలో ఒక చివర ప్రత్యేకభాగంలో ఉంటాను"

"సరే అంతా నిర్ధారణయిపోయినట్లే" అని మాంట్ క్రిస్టో తన డైరీలో వ్రాసుకున్నాడు "అయితే మీ రెప్పుడు బయలుదేరుతున్నారు?"

"రేపు సాయంకాలం అయిదుగంటలకి"

"అయితే ఇప్పుడే మీవద్ద సెలవు తీసుకుంటున్నాను నేను జరూరుగా నేపుల్స్ వెళ్లవలసిన పని కలిగింది శనివారమో ఆదివారమో కాని తిరిగి రాలేను" ఫ్రాంజ్ వంక తిరిగి "మీరో? మీరు కూడా రేపే వెడుతున్నారా?"

"రేపు వెనిస్‌నగరం వెడుతున్నాను ఇటలీలో నేనింకా ఒకటి రెండేళ్లు గడపాలి"

"అయితే మనం పారిస్‌లో కలుసుకోలేమన్నమాట?"

"అంతే ననుకుంటాను"

"అయితే నే నింక ఎయలుదేరాలి" అంటూ మాంట్ క్రిస్టో యువకులిద్దరి హస్తాలూ గ్రహించి కరచాలనం చేశాడు ఫ్రాంజ్‌కి మాంట్ క్రిస్టో చెయ్యి తగలడం ఇదే మొదటిసారి మాంట్ క్రిస్టో చెయ్యి చల్లగా తగిలింది ఫ్రాంజ్‌కి చెయ్యి వొణికింది

యువకులిద్దరూ లేచి బయలుదేరారు ఇద్దరూ తమ గది చేరగానే, ఆల్బర్ట్ అడిగాడు "ఇదేమిటి ఫ్రాంజ్? నువ్వు అట్టే మాట్లాడకుండా, అంత తీవ్రంగా ఏమి టాలోచిస్తున్నావు?"

"మాంట్ క్రిస్టోనిగురించి ఎంత ఆలోచించినా నా కేమీ బోధపట్టంలేదు పారిస్‌లో అతన్ని కలుసుకోడమంటే నాకేదో చెప్పలేని భయం కలుగుతోంది"

"అరె! ఎందు కంత భయం, సంకోచం? అతనివల్ల ముప్పు కలుగుతుందని భయపడుతున్నావంటే, నీకు మతిపోయుండాలన్నమాట!"

"నాకు మతి ఉందో లేదో అదంతా అనవసరం కాని మాంట్ క్రిస్టోని పారిస్‌లో నువ్వు కలుసుకుంటావంటే నాకు చాలా భయంగా ఉంది ఎటువంటి కీడు సంభవిస్తుందోనని భయపడుతున్నాను నిజంగా నువ్వీ జన్మలో అతన్ని చూసి ఉండకుండా ఉంటే బాగుండుననిపిస్తోంది"

"ఇటు విను ఫ్రాంజ్ ఇప్పుడామాట వచ్చింది కాబట్టి అంటున్నాను నువ్వు నీ మిత్రులందరితోనూ ఉన్నట్లుగా మాంట్ క్రిస్టోతో ఉండడంలేదు ఆయనతో చనువుగా ఉండవు మితంగా, మర్యాదగా మాత్రం మాట్లాడతావు నాతో చాలా చనువుగా ఉంటావు దీనికి కారణమేమైనా ఉందా? ఇంతకుముం దెప్పుడైనా ఆయన్ని చూశావా?"

"అయితే నేను చెప్పేది ఎవ్వరిదగ్గరా ఒక్కముక్క కూడా చెప్పనని ప్రమాణం తీసుకుంటావా?"

"దేవుని సాక్షిగా ప్రమాణం తీసుకుంటున్నాను"

"అయితే విను"

అప్పుడు ఫ్రాంజ్ తాను మాంట్ క్రిస్టో ద్వీపానికి వెళ్లడం, అక్కడ అక్రమవ్యాపారులు కార్సికన్‌దొంగలు తారసిల్లడం, మొదలైన వృత్తాంతమంతా నివేదించాడు కౌంట్ సత్కారం, విందు, గంజాయిలేహ్యం, శిలాప్రతిమలు, తన స్వప్నం, తరవాత తనకు మెలకువరావడం, ఆ పైన గుహాలలో దారి కనిపెట్టలేక పోవడం, దూరాన కౌంట్ బోటు మాత్రం కనపడ్డం, అంతా పూసగుచ్చినట్లు ఏ ఒక్క వివరమూ మరిచిపోకుండా ఏకరువుపెట్టాడు తరవాత రోమ్‌నగరంవద్ద కలోసియమ్‌లో తాను విన్న సంభాషణ, పెపినోని విడిపించడానికి లూగీవాంపాకు కౌంట్ ఇచ్చిన వాగ్దానం నెరవేరడం నివేదించాడు ఆఖరున, గడిచిన రాత్రి ధనం కొరవ కావడం, మాంట్ క్రిస్టో స్వయంగా అల్బర్ట్‌ని విడిపించడం వివరించాడు.

అంతా విని ఆల్బర్ట్ ఇలా అన్నాడు: "ఇదంతా బాగానే ఉంది కాని ఇందులో ఆక్షేపణకి ఏముంది? కౌంట్‌కి ప్రయాణాలంటే ప్రీతి ఆయనకి ధనం ఉంది స్వంతబోటు వుంది ప్రయాణాల మధ్య విశ్రాంతి కోసం మాంట్ క్రిస్టోద్వీపం అనువైనస్థల మనుకుని ఉంటాడు టస్కనీ ప్రభుత్వం అధీనంలోకి పోకుండా ఉండడానికి ఆ ద్వీపాన్ని కొని కౌంట్ బిరుదు తెచ్చుకుని ఉంటాడు అస లేదీ కొనకుండానే, ఏ రాజ్యమూ లేకుండానే బిరుదులు తగిలించుకుని తిరిగే వా రెంతమంది లేరు? ఇందులో నాకు తప్పేమీ కనపడదు"

"కాని అతని ఓడలో కార్సికన్ దొంగలమాటేమిటి? వాంపావంటివాళ్లు దుర్మార్గులనైనా ఒప్పుకుంటావా? వాళ్లకి అక్రమంగా దోచుకోడంతప్ప వేరేపని ఉండదు అటువంటి దుండగులలో మాంట్ క్రిస్టోకి ఉన్న పరపతి ఎటువంటి దంటావు?"

"ఆ పరపతే లేకపోతే నే నీపాటికి ఏమైపోయేవాడినో తెలియదు అందువల్ల అదెటువంటి తర్కించడం నాకు ఉచితంకాదు నువ్వైతే అటువంటివాళ్లతో అతని స్నేహాన్ని నిరసించవచ్చును కాని ఈ స్వల్ప దోషా లెంచడం నాకు తగదు నా ప్రాణాలుకాపాడ్డానికి వచ్చిన భక్తవత్సలుడని మరీ ఆకాశానికెత్తడంలేదు నాకు నాలుగువేల స్పానిష్‌డాలర్లు, అంటే 24 వేల లివర్లు నష్టంతప్పించాడు ఫ్రాన్స్‌లో నా ప్రాణం విలువ ఇంత ఉంటుందని ఎవ్వరూ భావించరుకూడా ఎంత మహానుభావుడికైనా సరే జన్మభూమిలో పరపతి ఉండదుకదా!"

"జన్మభూమి అంటే జ్ఞాపకం వచ్చింది ఈ వింతవ్యక్తి జన్మభూమి ఏదయుంటుందో చెప్పగలవా? అతని మాతృభాషేమిటో, వృత్తి ఏమిటో, ఇంత సంపద అతని కెక్కడనుంచి లభిస్తున్నదో, అతని జీవితవిశేషా లేమిటో, ఇంతటి చిత్రప్రకృతికి విలక్షణాలకూ మూలహేతువు లేవో తెలియదుకదా! నేనే నీ స్థితిలో ఉంటే ఈ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు తెలుసుకోడానికి ప్రయత్నిస్తాను"

"ఫ్రాంజ్! నా ఉత్తరం చూడగానే నువ్వు మాంట్ క్రిస్టో సహాయం కోరావు 'నామిత్రుడు అపాయంలోచిక్కుకున్నాడు మీరు సహాయంచెయ్యాలి' అని అడిగావు 'ఆల్బర్ట్ ఎవరు? అతని వృత్తి ఏమిటి? జీవనాధారం ఏమిటి? ఏ దేశం అతనిది' అని ఆయన నిన్ను ప్రశ్నించాడా? నిన్నీ మాదిరి ప్రశ్నలు వేశాడా?"

"నిజమే నన్నేప్రశ్నలేవీ అడగలేదు"

"అడగలేదు వెంటనే వచ్చినన్ను విగుదల చేయించాడు నే నెంత నిర్లక్ష్యంగా ఉన్నప్పటికీ అక్కడుండడం నాకు ప్రీతి కాదుకదా! ఒక్కమాట అడగకుండా వెంటనే సహాయంచేసిన ఆవ్యక్తి, నన్ను ఈ చిన్న సహాయం అడిగినప్పుడు నిరాకరించమంటావా? పారిస్ నగరం దర్శించే రష్యన్ రాకుమారులు, ఇటాలియన్ సామంతులు మొదలైనవారికి ఈ సహాయాన్ని అడక్కుండా కూడా చేస్తాం కదా! నే నలా ప్రశ్నించగలననే భావించావా ఫ్రాంజ్?"

ఫ్రాంజ్ ఒక్క నిట్టూర్పు విడిచాడు. "నీకు తోచినట్లు చెయ్యి ఆల్బర్ట్ నీవాదాన్ని కాదనగల సమర్థత నాకు లేదు అయినా మాంట్ క్రిస్టో చిత్రమైన వ్యక్తి అని నువ్వు ఒప్పుకోక తప్పదు"

"మాంట్ క్రిస్టో దానశీలుడు పారిస్ దర్శించాలనుకున్నాడంటే, మానవసౌశీల్యం, ధర్మవర్తనల ప్రచారంకోసం ఏర్పాటయిన బహుమతి సాధించాలనే ఉద్దేశం ఉండిఉంటుంది నా వల్ల అది ఆయన పొందగలిగేటట్లయితే పలుకుబడిగాని, మరొకటిగాని వినియోగించడానికి వెనుదియ్యను ఇంక ఈ మాటలు ఇప్పటికి మానేద్దాం సెంట్ పీటర్స్ చర్చికి పోదామా?" ఫ్రాంజ్ సమ్మతించాడు.

మరునాడు సాయంకాలం యువకులిద్దరూ రోమ్‌నగరంనించి ప్రయాణమై వెళ్లిపోయారు

## ౩౯

మే 21 వ తేదీ ఉదయం హెల్డర్‌వీధిలో 27 వ నంబరు ఇంట్లో విందుసన్నాహాలు జరుగుతున్నాయి పెద్ద భవనానికి అంటి చివర నున్న చిన్న భాగంలో ఆల్బర్ట్ నివాసం భవనానికి ముందొక పెద్ద ఆవరణా, వెనక ఒక తోటా ఉన్నాయి చుట్టూ ఎత్తైన గోడలున్నాయి పెద్దద్వారంగుండా బగ్గీలు పోగలవు ఆల్బర్ట్ నివాసానికి పక్కగా ఒక చిన్నద్వారం ఉంది ఆల్బర్ట్ బసలో ముంగుసావడికి కిటికీలగుండా వీధిలో వచ్చేపోయేవారిని గమనించవచ్చును వెనక తోటలోకి రెండు కిటికీలున్నాయి చిన్నద్వారం తలుపులు తుప్పుపట్టి ఎన్నడూ వాడుకలో లేనట్లు కనపడతాయి కాని జాగ్రత్తగా పరిశీలిస్తే ఉతకలకు ఆముదం పట్టించి ఎవరో రహస్యంగా వాడుతున్నట్లు తెలుస్తుంది తియ్యని కంఠాలిక్కడ గుసగుసలాడడం, మృదువైన హస్తాలు ఈ కవాటాలను తట్టడం పరిపాటి తోటలో బెంచీలపై కూర్చునేవారి ఏకాంతానికి భంగం కలగకుండా, లో కిటికీలముందు అడ్డుగా పొదలు, తీగలు అల్లుకుని ఉన్నాయి మేడపైన పడకగదిలోకి మెట్లమధ్యనించి రహస్యద్వారం ఒకటుంది మిద్దెపైన అటకమీద వేటసామగ్రి, సంగీతవాద్యాలు, చిత్రలేఖనసామగ్రి, కత్తులు మొదలైనవన్నీ ఉన్నాయి ఆల్బర్ట్‌కి ఎందులోను పరిపూర్ణపాండిత్యం లేకపోయినా, సరదాలు తక్కువకాగు ఆల్బర్ట్‌నివాసమంతా చక్కగా అలంకరించబడి ఉంటుంది

ఆరోజున ఆల్బర్ట్ కింది సావడి చక్కగా అలంకరించాడు అంతటా పుష్పగుచ్ఛాలు కలకలలాడుతున్నాయి సరిగ్గా పదిగంటలకు అతని పరిచారకుడు జర్మేన్ వచ్చాడు ఈ పరిచారకునికి ఆల్బర్ట్ ఆంతరంగిక రహస్యాలన్నీ తెలుసు అతనికి ఆల్బర్ట్ పట్ల ప్రీతి, భక్తి అధికం కొన్నిపత్రాలు, ఉత్తరాలు తెచ్చి ఇచ్చాడు ఆల్బర్ట్ గబగబా తిరగేసి అందులో రెండు ఉత్తరాలు పైకి తీశాడు వానిపైన చిరునామాలు చిన్న అక్షరాలలో, తీర్చిదిద్దినట్లు వ్రాయబడిఉన్నాయి ఆ ఉత్తరాలు విప్పగానే గుప్పున అత్తరువాసనలు వ్యాపించాయి ఉత్తరాలు చదివి "ఇవెలా వచ్చాయి?" అని అడిగాడు

"ఒకటి తపాలాలో వచ్చింది మరొకటి డాంగ్లర్ ఇంటి నౌకరు తెచ్చిఇచ్చాడు"

"డాంగ్లర్ భార్యకి నాటకప్రదర్శనాలయంలో ఆమెవద్ద కూచోడానికి వస్తానని తెలియపరుచు నాటకంనించి తిరిగి వచ్చేటప్పుడు విందుకి వస్తానని రోజాకి తెలియపరుచు నాకు కావలసిన ద్రాక్షసారాయం తెలుసుగా నీకు? అది రోజా ఇంటికి పంపి నాకోసం ప్రత్యేకమని చెప్పు"

"ఈపూట భోజనం ఎన్ని గంటలకి?"

"పదిన్నరకి ఈపూట డిబ్రె రాడేమో అతను ప్రభుత్వకార్యాలయానికి వెళ్లవచ్చును సరిగ్గా పదిన్నరకే కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో వస్తానన్నాడు వస్తాడని నా కొట్టే నమ్మకంలేదు కాని, నేనుమాత్రం సిద్ధంగా ఉంటాను మా అమ్మగారు లేచారేమో తెలుసా?"

"తెలియదండి కావలిస్తే తెలుసుకుని వస్తాను"

"తెలుసుకో, ఇవాళ మధ్యాహ్నం మూడు గంటలకి నేనామెను చూస్తానని చెప్పు నా మిత్రుడు ఒకరిని పరిచయం చెయ్యగోరుతున్నానని చెప్పు"

ఇంతలోనే ఓ బగ్గీ వచ్చి ఆగింది లూషియన్ డిబ్రే వచ్చాడు సన్నగా, పొడుగ్గా, చక్కగా ఉంటాడు కొంత అధికారభావంతో అటూ ఇటూ చూశాడు నవ్వలేదు ఆట్టే మాట్లాడడు "సరిగ్గా అనుకున్న వేళకే వచ్చావే! అందరికంటే ఆలస్యంగా వస్తావనుకున్నాను ఇవాళ విశేష మేదో ఉంటుంది ఏం? మంత్రులెవరైనా రాజీనామా ఇచ్చారా?"

డిబ్రె కూర్చుని తాపీగా "ఏం భయపడకు, ఎవరూ రాజీనామా ఇవ్వలేదు మా మంత్రివర్గాల కేముందిలే ఎప్పుడు కూలిపోతుందా అన్నట్లుంటాయి కాని కూలిపోవు ఇంక స్థిరపడిపోతుందిలే నాకు నమ్మకం కుదిరింది"

"అవునవును ఆ స్పానిష్‌వాణ్ని ఏం చేశారు? స్పెయిన్ దేశానికి తరిమేశారా?"

"నీకసలు బొత్తిగా తెలియదు, మా రాజకీయా లెలా ఉంటాయో! ఈ మాదిరి తికమకలు పడితేనే కాని ఎలా చెప్పు? వాడి మూలంగా స్పెయిన్‌లో అల్లరి బయలుదేరడమేమిటి, డాంగ్లర్‌కి నలభై వేల పౌనులు లాభం రావడమేమిటి! అదంతా అంతేలే"

"అంతే లాభానికి లాభం వచ్చింది నీకు స్పెయిన్ రాజు పతకం వచ్చింది"

"అవును అందుకే ఇవాళ పెందరాళే వచ్చాను"

"ఆ శుభవార్త చెప్పడానికా?"

"కాదు రాత్రంతా ఉత్తరాలు రాయడంతో సరిపోయింది—ఇరవై అయిదు పత్రాలు, మాటలు కాదు ఇంటికి వచ్చేసరికి తెల్లవారింది నిద్రపోదామని ప్రయత్నించేశాను కాని తలనొప్పి చంపేసింది పొద్దున్నే కొంతదూరం గుర్రంపైన సవారి చేశాను కొంతదూరం వెళ్లేసరికి ఆకలి వేసింది నువ్వీపూట విందు ఇస్తున్నావని జ్ఞాపకంవచ్చి, వెంటనే ఇక్కడికి వచ్చేశాను నాకు ఆకలి వేస్తోంది ఏదైనా తెప్పించు చాలా చికాగ్గా ఉంది కూడా, కబుర్లేవైనా చెప్పు"

"నువ్వు నా అతిథివి తప్పదులే జర్మేన్! బిస్కట్లు సారాయం తెచ్చిపెట్టు ఈలోగా చుట్టలు కాలుద్దామోయి

అంగుకో మనలోమాట, ఇవి చాటుగా తీసుకొచ్చానుసుమా రుచి చూడు ఇటువంటివి తెచ్చుకోకుండా మీ ప్రభుత్వం నిషేధించింది మనకి నానా తుక్కూ ఇచ్చి చంపకుండా ఇటువంటి హవానాచుట్టలు దిగుమతిచేసుకోనిమ్మని మీ మంత్రికి చెప్పు"

"ఛీ! అటువంటి పనెప్పుడూ చెయ్యనివ్వను అదీకాక మాది ఆంతరంగిక వ్యవహారాలశాఖ. నీ చుట్టలు ఆర్థికమంత్రిగారి చేతిలో ఉన్నాయి కాని నిన్ను చూస్తే ముచ్చటగా ఉందోయి ఏ పనీ లేదు ఎప్పుడూ తీరికే"

"మహా రాజకీయవేత్తవి నువ్వేం చేస్తావు అస్తమానం? అయినా నీ కేం! ఒక మంత్రిగారికి ఆంతరంగిక కార్యదర్శివి నువ్వు యూరప్‌ఖండమంతా తిరిగే గూఢచారులూ, రాజకీయవేత్తలూ, పారిస్‌కుట్రలూ అన్నీ నీకు తెలుసు మహారాజుల్ని కాపాడతావు మహారాణుల్ని చూస్తావు పార్టీలలో చేరతావు ఎన్నికలు నిర్వహిస్తావు నెపోలియన్ కత్తులూ, విజయాలూ ఎందుకు పనికొస్తాయి నీ కలం, తంతివార్తలముందు? ఏడాదికి మిగతా ఆదాయంకాక పాతిక వేలు జీతం వస్తుంది చక్కని గుర్రం ఉంది నీకు క్లబ్బులు, నాటకాలు, విందులు అన్నీ చూస్తావు నీకు కాలక్షేపానిక లోటేమిటి? నేను చెయ్యగలిగేది ఒక్కటే ఒక కొత్త వ్యక్తితో పరిచయం చెయ్యగలను అదుగో బోశాంప్ వస్తున్నాడు ఇంకేం? పత్రికల్నిగురించీ వార్తల్ని గురించీ మీ రిద్దరూ తెగవాదించుకోవచ్చు"

డిబ్రే నిరసనపూర్వకంగా అన్నాడు "ఆల్బర్ట్! నేను పత్రికలు చదువుతాననుకున్నావా?"

బోశాంప్ వచ్చాడు ఆల్బర్ట్ అతన్ని ఆహ్వానించి "ఇదుగో డిబ్రే ఏమంటున్నాడో విన్నావా? నీ పత్రికలు చదవకుండానే నిన్ను నిరసిస్తున్నాడు"

"అందులో తప్పేం లేదు" అన్నాడు బోశాంప్ "అతనేం చేస్తున్నాడో నాకు నిజంగా తెలియకపోయినా, అతని చర్యల్ని ఘాటుగా విమర్శిస్తాను ఏమిటోయ్ విశేషాలు కెప్టెన్?"

డిబ్రే చిరునవ్వు నవ్వాడు!! "అయితే అది అప్పుడే తెలిసిపోయిందన్నమాట! ఏమనుకుంటున్నారోయ్ అందరూ?"

"ఏమనుకుంటారు? బాగానే ఉందనుకుంటారు కొందరు కుట్రలు పన్నారంటే, మరి కొందరు డబ్బు దోచుకున్నారన్నమాటే! అంతేగా"

"అందులో తప్పేముంది? వెళ్ళిపోకు విందు జరుగుతోంది ఉండు నీ తెలివితేటలకి నువ్వు నాలుగైదేళ్ళలో లక్షాధికారివి కావాలి"

"ఆగాగు, తొందరపడకూడదు పట్టుమని ఆరు మాసాలు నిలిచిన ఒక్క మంత్రిని చూపించు ఆల్బర్ట్ నేను త్వరగా వెళ్ళాలి విందు కింకా ఎంత ఆలస్యముంది?"

"ఇద్దరికోసం కనిపెట్టుకున్నాను వాళ్ళు రాగానే ఉపక్రమించవచ్చు"



# గొప్పోరింట్లో పెళ్ళి

(16 వ పేజీ తరువాయి)

సొర ముండది గాబట్టి పోటీ సేసేవోళ్ళు, సూట్టానికి రావొచ్చు హా?"

మద్దానానికల్లా పాటింపు పూరూరా రాల్లింది మరుసనాడు పొద్దుటజాంకి ఎక్కడెక్కడోళ్ళు సేరా రావూరు బలే సందడిగా వుండదా పూట సిన్నోళ్ళు, ముసిలోళ్ళు సానా సానా దూరాన్నుంచొచ్చారు. పూరిమద్దెన పెద్ద పెల్లాలో జనం పోగడ్డారు

కూసేపట్లోకి బరిలోకి దిగాడు మంగాయ సంక సొరకాయబుర్ర, సేత్తిన నాగుబాము బుట్ట, జనమంతా నిస్సబ్దంగా వుండారు యిసికేత్తే రాలేట్టులేదు

బుట్టలోంచి తీసిండు కోడెతాచుని దణ్ణమెట్టి బుర్రందిపుచ్చుకున్నాడు నోటికి. యీలలు, తప్పెట్లు కొట్టారు బలే సంబరంగ వుండది

పెబిలీగ్గా ఇంత తెగిచ్చి నోడా సుట్టుపక్క లెవడూ లేడు వూత్తున్నాడు నాగరాజు తిరుగుతున్నాడు ముప్పయ్ నిమిసాలయింది అదేపనిగా మంగాయ సొరం అందుకుంటే తోకమీన సుంచోని కోడె తాసు పడగిప్పి ఆడతా వుండది యెదురెండకు యెండిలా మెరిసిపోతా వుండది

ఇంతలోకే సిసింద్రీలాగా ఒకడు కట్టుయిప్పేసాడు అది తెలవక మంగాయి తిప్పలగుతుండాడు అట్టిటు సూసి తెలవగానే సిరునవ్వు నవ్వుతుండాడు మంగాయ తిరగా కట్టు కట్టేసేశాడు జనమంతా ఆడెంక అదేపనిగా సూసి "అంత పెయ్యోజికుడివేరా? ఆడ్ని యెదిరిచ్చి నిలుత్తావా?" అన్నారు జనం

మళ్ళీ కట్టూడతీసేతలికి మంగాయ రోసంతో కోరమీసం మెలేశాడు శివమెత్తినట్టుండాది మంగికి బయం, బయంగా వుండది యిడవకుండా గుక్కట్టేసాడు మంగాయ మాటెనకోడి, సోదానం తప్పింది యెట్ట తిప్పితే అట్ట తిరిగే నాగు యియ్యాల సెయితప్పిపోయింది సెమటలు కారతా వుండయి తుడుసుకునే యవదానంకూడ లేదు కళ్ళెర్రబడుతుండయి తిరిగి తిరిగి నున్నటి నాగు కాటందుకుండాడు సెయ్యాత్తేసి మళ్ళీ మొదలేసాడు లాబం లేకపోయింది సర్రున జనంలో దూరపోయేతల్కి పట్టేసిండు మెడ భూమి తిరుగుతుండట్టుగా వుండ డాడికి కళ్ళు తిరిగి ఆడే భూమిమీన ఒరిగాడు మంగాయ



మార్క్‌ట్వేన్ వద్దకు వచ్చిన ఒక స్నేహితుడు ఆయనవద్ద చాలా పుస్తకాలుండి కూడా బీరువాలు లేకపోవటానికి ఆశ్చర్యపడగా—

మార్క్‌ట్వేన్: "అవును, అవును. కాని మిత్రులను బీరువాలు అరువిమ్మని అడగటం చాలా కష్టం.

సినిమా:

# సినిమాలలో అనుకరణ



“గొంతుకలుకోటి, ప్రతిధ్వనులు నాలా” అన్నది ఇతర కళలకు వర్తించినట్లే సినిమాకు వర్తిస్తుంది సినిమా చిత్రనిర్మాణంలో అనుకరణ ఒక జాడ్యంగా ఉన్నదనుకోవటం కూడా పాతబడింది ఇప్పుడు అనుకరణ తప్పనిసరి అయింది

మొదట కథలు తీసుకుందాం ఏటా భారతదేశంలో తయారయే చిత్రాల సంఖ్య ప్రపంచంలోకల్లా రెండోది ఈ దేశంలో ఏటా దాదాపు 200 చిత్రాలు తయారవుతున్నాయి ఇన్నిటికీ కథలు కావాలి చిత్రనిర్మాణంలో అన్ని దేశాలనూ తలదన్నే హాలీవుడ్ వారు కథలకు తడుముకోనవసరంలేదు వారు ప్రపంచంలోగల అన్ని దేశాలకూ సంబంధించిన కథలు తీసుకుంటారు చారిత్రక చిత్రాలూ, సంగీత చిత్రాలూ, సాంఘికచిత్రాలూ తీస్తారు ప్రసిద్ధనవలలనూ, నాటకాలనూ కథలనూ చిత్రాలుగా తీసుకుంటారు విశ్వసాహిత్యం వారికి అందుబాటులో ఉంటుంది కథలకోసం వారు లక్షలు ఖర్చుచేస్తారు

ఈ సౌకర్యం మనకు లేదు నిరక్షరులైన మన ప్రేక్షకులను చరిత్ర ఆకర్షిస్తుందన్న నమ్మకం లేదు వారికి సంగీతం లేని చిత్రాలు పనికిరావు ఏదో కథ అడ్డం పెట్టుకుని అచ్చంగా సంగీత చిత్రాలు తీస్తే వారు చూడకపోవచ్చు అన్ని చిత్రాలలోనూ అన్ని లక్షణాలూ—రసవంతమైన కథా, పాటలూ, డాన్సులూ, గుర్రాలూ, ఆనందమూ, సాంఘిక లక్ష్యమూ—ఉండాలి సాహిత్యం చూసినట్లయితే పండిత పామరులనూ, యావద్భారతాన్నీ కదిలించే సాహిత్యం సృష్టించిన రచయితలు, శరత్‌చంద్రవంటివారు ఏ ఒకరిద్దరో ఉన్నారు ఎబ్బు పెరసికొనటానికైనా ప్రజలను బలంగా ఆకర్షించే సాహిత్యం, సినిమా చిత్రాలకు కూడా పనికివచ్చేది, దాదాపు లేనేలేదు

ఈ పరిస్థితిలో మన దక్షిణదేశపు చిత్రనిర్మాతలు తమ కథాదైన్యాన్ని “జానపద చిత్రాలు” అన్న అద్భుత కల్పనలతో పరిష్కరించుకున్నారు మన చిత్రాలను ఎక్కువగా పల్లెప్రజలు చూస్తారు కనుక ఇది సాధ్యమయింది బొంబాయి, కలకత్తా ఢిల్లీ, లక్నో, అలహాబాద్ మొదలైన నగరాలలో ఈ జానపద చిత్రాల పరంపర ప్రదర్శించటానికి అంత అవకాశం లేదు అందుచేత హిందీ చిత్రనిర్మాతల సమస్య అనుకరణతోగాని తీరదు హిందీ చిత్రనిర్మాతలు టాకీలు వచ్చిననాటినుండీ పాశ్చాత్యసాహిత్యం నుంచి ఇతివృత్తాలు తీసుకోవటమూ, ఇంగ్లీషు చిత్రాలను అనుకరించటమూ చేస్తూనే ఉన్నారు ఇటీవల వచ్చిన చిత్రాలు చూసినట్లయితే “దాస్తాన్” కు మాతృక “ఎంబాంక్మెంట్”, “జాదూ” కు మాతృక “లవ్స్ ఆఫ్ కార్మెన్”

దక్షిణదేశంలో జానపదచిత్రాలు ఏవిధంగా ఉపయోగపడుతున్నాయో, ఉత్తరదేశంలో ఈ అనుకరణచిత్రాలు అదేవిధంగా ఉపయోగపడుతూ, జీవితానికి విలక్షణంగా ఉండే వాతావరణంతో కూడిన కథలద్వారా ప్రజలకు “ఆనందం” ఇస్తున్నాయి ఇందువల్ల కలిగే కష్టనష్టాలను గురించి ఇంకోసారి ఆలోచించుకుందాం

జానపదచిత్రాలన్నీ విజయవంతం కాకపోవటంతో అనుకరణావశ్యకత దక్షిణదేశంలోకూడా అంతో ఇంతో ఏర్పడుతున్నది “బాబిలర్ మదర్”కు అనుకరణ అయిన “కుంవారా బాప్” ను అనుకరించి “జీవితం” చిత్రం వచ్చింది “*Les Miserables*”కు అనుకరణంగా “బీదలపాట్లు” వచ్చింది “గోల్డెన్ ఇయర్‌రింగ్స్” చిత్రాన్ని అనుకరించాలని ఒకరిద్దరు ప్రయత్నించినమీదట ఆ చిత్రం తాలూకు కథ “మాయలమారి”లో అంతర్భాగంగా వెలువడింది సినిమాచిత్రాలకు పనికివచ్చే కథలు విరివిగా రాకపోవటమే ఈ అనుకరణకు అధికంగా దారితీస్తున్నది

సంగీతంలోనూ, పాటలలోనూ కూడా ఇదే కనిపిస్తుంది ఏటా హిందీలో తయారయే నూటయాభై చిత్రాలకు గాని, దక్షిణ భాషలలో తయారయే 50 చిత్రాలకు గాని స్వతంత్రంగా మట్లూ అవీ కుదర్చాలంటే మాటలు కావు ఒక నౌషద్‌లాటివాడు లేక అనిల్ బిస్వాస్‌లాటివాడు సంగీతంతో అపార విజయం చేకూర్చుకోగానే చిత్రనిర్మాతలందరూ అతనిపైన పడతారు మన తెలుగుచిత్రాల విషయంలో కూడా సాధ్యమైతే అందరూ ఘంటసాల వెంకటేశ్వరరావు చేత మట్లు పెట్టించుకోవాలని చూస్తారు ఇటువంటి పరిస్థితిలో సంగీత దర్శకుడు తనను తానే అనుకరించుకోవటమో, ఇతరులను అనుకరించటమో తప్పనిసరి అవుతుంది



“బహురాణిలో”

సులోచనా ఛటర్జీ

సంగీతం విషయంలో మనకు ఇంకొక చిక్కు ఏర్పడి ఉన్నది ఇతరదేశాలలో-ముఖ్యంగా అమెరికాలో-ప్రజారంజకమయిన సంగీతం సినిమా స్టూడియోలలో ఉత్పత్తి కావాలన్న అగత్యంలేదు వారి జీవితంలోనే రకరకాల సంగీత పద్ధతులు అమలులో ఉన్నాయి ప్రజలందరికీ తెలిసిన పాటలూ, బాణీలూ ఉన్నాయి వాటిని మెరుగుపెట్టటమూ తెరమీదికి తీసుకురావటమూ మాత్రమే చిత్రసంగీత దర్శకులు చేయవలసినది అంతేకాక వారి చిత్రాలలో చాలా భాగం పాటలులేని చిత్రాలు

మన కట్లాకాదు మన ప్రతి చిత్రంలోనూ పదేసి పాటలుండాలి మనకు సినిమాలు తప్ప ప్రజాసంగీతం సృష్టించే సాధనమే లేదు అదివరలో నాటకాలు ప్రజాసంగీతాన్ని ఉత్పత్తి చేస్తూ ఉండేవి ఆ పాటలు రసేగాగైనా చాలా కొద్దిమంది ఉండేవారు వారు పోయిన

(26-వ పేజీ చూడండి)



"బిజ్లీ"తో రేహానా | "దీక్ష"తో శివరాం వరలక్ష్మి సుధ →

# సినిమా

(23-వ పేజీ తరువాయి)

తరవాత కొత్తగా పాటలు రాలేదు ఉన్న పాటలు అప్పటికే ఒకటిరెండు పుష్కరాల పాటు ప్రజలలో ప్రచారమై ఉన్నాయి మహారాష్ట్రపు పాటలబాణీలు గ్రామఫోను రికార్డులద్వారా నాటకరంగాన్ని కొంత వరకు జయించాయి గాని ఈలోగా పద్యాలు వచ్చి పాటలను కొట్టేశాయి పాటను మించి పద్యం రంగస్థలాన్ని ఆక్రమించసాగింది

ఈ పద్యాలు సినిమాకు నప్పలేదు ప్రజలను ఆకర్షించే పాటలు అవసరమయేసరికి ఆ పాటలు సృష్టించే ఇతర సాధనం ఏమీ లేకుండాపోయింది ఈలోగా హిందీఫిల్ములలో పాటలు సినిమా చిత్రాలద్వారానూ, గ్రామఫోను రికార్డులద్వారానూ దేశాన్ని ముంచిఎత్తడంచేత వాటి ప్రభావానికి దక్షిణదేశపు సినిమాచిత్రాలు తల ఒగ్గక తప్పింది కాదు

మనం హిందూస్థానీబాణీలు నెమరు వేస్తుంటే హిందీచిత్రాలవారు పాశ్చాత్య సంగీతాన్ని కొంచెం కొంచెం నెమరు వెయ్యటం నేర్చుకుంటున్నారు ఒకరిద్దరు సంగీతదర్శకులు మనవాళ్లుకూడా పాశ్చాత్య సంగీత ఛాయలు అప్పుడప్పుడూ కనబరుస్తునే ఉన్నారు

అనుకరణ నృత్యంలో కూడా ఉన్నది సంప్రదాయసిద్ధమైన భరతనాట్యాన్ని సినిమాలు ఆదరించనందుకు చాలామంది చింతిస్తున్నారు ప్రజారంజకమైన నృత్యానికి కూడా సినిమాకళే ఏకైక ఆధారంగా పరిణమించింది ఏనాడో స్తంభించిపోయిన భరతనాట్యం ఈనాడు ప్రజలకు సన్నిహితంగా లేదు ఆ భరతనాట్యాన్ని ప్రజలను అంగుబాటులోకి తేవటానికి ప్రయత్నమైనా జరగాలి, లేదా మన సాంప్రదాయాలకు విలక్షణమైన నృత్యాన్ని తీసుకువచ్చి తద్వారా ప్రజలను సంతృప్తిపరచనైన పరచాలి మన సినిమానాట్యకర్తలు చేసే భరతనాట్యంకన్న అమెరికన్ చిత్రాలనుంచి అనుకరించే విజాతీయ నాట్యాన్నే ప్రజలు ఎక్కువగా ఆదరిస్తున్నట్లు కనిపిస్తుంది నాట్యభంగిమల్లో ఉండే భావాలు సంప్రదాయం తెలిసినవారికి మాత్రమే అర్థమయేవి వాటిలోని సౌందర్యం అందరికీ ప్రత్యక్షంగా గోచరమయేది విదేశీ నృత్యరూపాలు ప్రజలను ఆకర్షించటానికి ఇదే కారణం

ఆఖరుకు నటనలో - భావప్రకటనలో - కూడా విజాతీయత అంతో ఇంతో ప్రవేశిస్తోంది భావప్రకటనలో కూడా జాతీయత ఉంటుందా అని సందేహం కలగవచ్చు అటువంటి శంక అనవసరం బ్రిటిషుచిత్రాలలో నటనకూ అమెరికన్ చిత్రాలలో నటనకూ కొంత తేడా ఉంటుంది మన దేశంలోనే తీసుకున్నప్పటికీ నగరవాసుల భావప్రకటనకూ గ్రామీణుల భావప్రకటనకూ, కార్మికుల భావప్రకటనకూ, కర్షకుల భావప్రకటనకూ బోలెడంతవ్యత్యాసం ఉంది కాని మన చిత్రాలలోని కథలే అరువు సొమ్మయినప్పుడు నటనావిధానం కూడా అరువు తెచ్చుకోవలసివస్తోంది, అనుకరించవలసి వస్తోంది

ఇన్ని రకాల అనుకరణలతో సినిమాకళ జాతీయస్వరూపాన్ని పూర్తిగా కోల్పోతోంది ఇది కేవలం భావదాస్యంవల్ల ఏర్పడినది కాకపోయినప్పటికీ భావదాస్యానికి దారితీయక తప్పదు అనుకరణల అవసరం ఉన్నంతవరకు మన సినిమాకళ ఎప్పటికైనా బయటపడితీరాలి లేకపోతే చాలా నష్టాలున్నాయి అనుకరణలనుండి తప్పించుకోవటాని ఒకటే మార్గం చిత్రనిర్మాతలు కొద్దిమందిపైన మాత్రమే ఆధారపడక అనేకమంది కథకులనూ, సంగీత స్రష్టలనూ తదితరులనూ ప్రోత్సహించాలి వీరంతా ఎక్కడున్నారనవచ్చును. సముద్రగర్భంలో ఏ రత్నాలున్నదీ ఎవరూ చెప్పలేరు ఇవాళ తారఅయి అందరికీ పరిచయం అయిన మనిషి నిన్న ఎక్కడ ఉన్నదీ ఎవరూ ఎరుగరు అవకాశాలుంటాయనే ఆశ కలిగితే చాలామంది ముందుకు రాగలరు

దీనితోబాటు ప్రజలను ఆకర్షించే సంగీతమూ, నృత్యమూ మొదలైనవి ఇతర జీవిత రంగాలలో కూడా విరివిగా ఉత్పత్తి కావాలి కర్నాటక సంగీతంలోనూ, భరతనాట్యంలోనూ ఉత్తీర్ణులైనవారినుంచే కొత్త కళాస్వరూపాలు సృష్టి కావాలి వారిద్వారానే ప్రచారం కావాలి ఇప్పటికే మన ఆడపిల్లలు సంగీతంపేర అవే కృతులూ, నాట్యంపేర అవే భంగిములూ నేర్చుకోవటం శోచనీయం గతానికి భావదాస్యం చెయ్యటంచేతనే కర్నాటక సంగీతమూ, భరతనాట్యమూకూడా చచ్చిపోయి శుష్క సంప్రదాయాలై ప్రజాభిరుచులకు దూరమైనాయి 

**కథానిక**

# కారెక్కని సత్యం



మానవుడు ఆర్థికంగా ఎన్ని అవస్థలు పడుతూన్నా తాను నమ్మిన ఆదర్శాలను మాత్రం వదలకుండా అలాగే పట్టుకుని కూర్చోగలడని తానెన్నడూ విశ్వసించలేకపోయేడు. మానవుల ప్రవర్తన, ముఖ్యంగా నైతిక ప్రవర్తన, ఆర్థిక అవసరాలమీద ఆధారపడి వుంటుందని తను గాఢంగా విశ్వసిస్తాండేవాడు దీనికి బలీయమైన కారణం వుంది, అది వెంకటేశ్వర్రావులో వచ్చిన మార్పే కూడాను

ఎన్నో సంవత్సరాల తర్వాత మళ్ళీ ఆనాటికి వెంకటేశ్వర్రావు కన్పించేడు పార్కులో ఆతని కనుబొమలు ముడిపడి వున్నయి దీర్ఘాలోచన, అతని మునిపంటితో క్రింది పెదాన్ని నొక్కుతూంది

తనని చూడంగానే వక్క క్షణంపాటు క్రింది పెదాన్ని మునిపంటి వొత్తిడినుంచి సడలింపజేసి 'గుడ్ మార్నింగ్ బ్రదర్. కులాసాయేనా' అంటూ తనప్రక్క వొచ్చి కూర్చున్నాడు అతను క్రింది పెదిమ తిరిగి మునిపంటి క్రిందికి వెళ్ళిపోయింది ఆతని మెదడు ఎవ్వో ఆలోచనల్ని తీసుకోడంతోను, పంపడంతోను 'బిజీ' అయిపోయినట్లుంది

వెంకటేశ్వర్రావుని చూడంగానే తనకి సత్యం గుర్తుకిరాకుండా మానదు వెనకాలే చదువుకునే దినాలు గుర్తుకి వస్తాయి తమ ఆశయాలు, ఆదర్శాలు, నిర్ణయాలు గుర్తుకొస్తాయి సత్య, అహింసలఎడ తమకుండే భక్తి గౌరవాలు, లంచగొండితనం, వ్యభిచారం, అన్యాయం, మొదలైన అవినీతి కరకార్యాలఎడ తమకుండే అసహ్యత గుర్తుకొస్తాయి వాటికోసం వాగ్వివాదాలే కాకుండా కొందరితో తన్నులాడుకున్న దినాలుకూడా లేకపోలేదు – ఆరోజుల్లో!

చదువులయ్యేక ఎవరిదారి వారిదయ్యింది సత్యం ఎక్కడో మద్రాసులో గవర్నమెంటు నౌఖరీలోను, తను వక 'అమెరికను ఫరం'లోను, వెంకటేశ్వర్రావు వాడి చదువుకి తగ్గట్లు తాలూకా ఆఫీసు గుమాస్తాగాను వాళ్ళవూళ్ళోనే చేరేడు తను పెద్ద చదువు చదవకపోయినా, తన అదృష్టంవల్లనయితేనేం, నేర్పువల్లనయితేనేం, నెలకి రెండు వందలు సంపాదిస్తున్నాడు హాయిగానే వుంది కాని వాళ్ళిద్దరో

'కులాసాయే,' అని జవాబు చెప్పి, తను వెంకటేశ్వర్రావును సాలోచనగా వకసారి నఖశిఖ పర్యంతం చూచేడు వెంకటేశ్వర్రావులో గత రెండేళ్లలోను చాలా మార్పు వచ్చినట్లు కన్పించసాగింది

ముఖ్యంగా తనకి వెంటనే తట్టిన మార్పు; వెంకటేశ్వర్రావు ఏనాడూ యింత ముభావంగా వుండి ఎరుగడు ఆతనిలో యింత ఆలోచనా లేదు ఏనాడూ కూడా. ఆతనిలోని ప్రత్యేక విశేషత, ఎంత కష్టాల్లోనూ నవ్వుతూ హాస్యంగా మాట్లాడుతూండటమే!

తామిద్దరూ వోనాడు వెంకటేశ్వర్రావింట్లో ఎవో ఆకబుర్లు యీకబుర్లు చెప్పుకుంటూ సాయంత్రంవరకు కూర్చొని, బయటికి పోదామని లేచేరు తాము గుమ్మం దాటబోతూండగా ఆతని భార్య శారద, వెనకాల్నుంచే చెప్పింది, 'కట్టెలు లేవు, దార్లో అడితీదగ్గర ఆగి వో 'శలక' పంపించండి' అని

వెంకటేశ్వర్రావు వెనక్కి తిరిగి చిర్నవ్వుతో "ఒక్క శలకేనా? వేడినీళ్లు కాచుకోడానికే దానికే వుంటాయి, రెండు శలకలు వుండనీ" అంటూనే రోడ్డెక్కేరు తాము అడితీని దాటి వెళ్ళిపోతుండగా తాను గుర్తుచేసేడు 'ఒరే కట్టెల సంగతి మరచిపోయేవురా' అని

వాడు ఓ చిన్ననవ్వు నవ్వేసి "ఎల్లా మరచిపోతారా! తెల్లారి లేచిందిమొదలు యిల్లాంటి వాటితోటే మెదడులోని శక్తంతా కాలిపోయేది నడు–" అన్నాడు

---

రచన

**'శివం'**

"మరి కట్టెలు తీసుకోవూ?" అడిగేడు తను

"ఇంకా నయం వాడే గోడ్డుమీద నుంచి నడవనిస్తున్నాడు ఇప్పుడు కట్టెలు అడిగితే రేపట్నించీ అసలు బయట నడవనియ్యడు కూడాను నీకేం పిచ్చేరా. నడు" నవ్వేసేడు

అడితీని దాటిపోయేరు తాము 'మరెట్లా వంటచేస్తుందిరా?' అడిగేరు తను

'ఏమో? ఆడవాళ్ళకి ఆమాత్రం సర్దుకుని అవస్థపడే స్వభావం దేవుడిచ్చేడు కనకే మనం కొంతవరకు అదృష్టవంతులం అనుకో లేకపోతే మనకొచ్చే 70 రూపాయల జీతంతో యీ సంసారం త్యజించి ఎన్నడో సన్యాసాశ్రమం స్వీకరించేవాళ్లం కాదుటోయి"

తన కాశ్చర్యం వేసేది మనస్సులో బ్రహ్మాండమంత బాధవున్నా చిర్నవ్వుతో మనుష్యులు ఎట్లా మాట్లాడకలరా అని వెంకటేశ్వర్రావుని జూస్తూంటే, అట్లా మాట్లాడటమే కాకుండా యీ యీతిబాధల్ని, సామాన్యకష్టాల్ని అంటించుకోకుండా తామరాకుమీద నీటిబిందువులా వ్యవహరించడం కూడా సాధ్యమే ననిపిస్తుంది

కాని ఆవెంకటేశ్వర్రావులో యిప్పుడా పూర్వపు చిర్నవ్వే లేదు ఆ చిలిపితనమే లేదు ఏదో ప్రపంచం మునిగిపోతూన్నట్లు, ఏదో నేరం చేసినట్లు దీర్ఘచింతనం!

సంసారపు గొడవలు, వుద్యోగంలోని అవస్థలు, బయటనుంచి ప్రపంచాన్ని ముంచుకురాబోయే మూడో యుద్ధంసంగతి అంగుబాటులోలేని ధరలు, యివీ వెంకటేశ్వర్రావు పార్కులో మాట్లాడిన విశేషాలు ఓ పావుగంటలో

మనిషి (*Mental make up*) లోనే కాకుండా, బాహ్యక వేషధారణలో కూడా వెంకటేశ్వర్రావులో చాలా మార్పుండటం కన్పిస్తూంది

తెల్లటిమల్లెలా మెరుస్తూన్న 'లన్‌లిన్' షర్టు 'హవానా' పేంట్సు, ఖరీదైన బూట్సు! వీటికితోడు చేతికి కొత్తవాచీ, కండ్లకి 'కూలింగ్ గ్లాసెస్'

వింతగా వీటిని చూస్తున్న తనకి గతంలోని వకనాటి విషయం జ్ఞాపకం రాసాగింది తలుచుకోడానికి కూడా తను చాలా సిగ్గుపడాల్సిన విషయం కాని అట్లాంటిదే ఆ సమయంలో గుర్తుకొచ్చింది ఎందుకో తనకి

తను ఏదో పనిమీద ఆరోజునో తిరిగి వచ్చేడు గుంటూరుంచో, తెనాలినుంచో.

ఇంటికి వెళ్లి స్నానం చేసుకుని, యిస్త్రీ బట్టలు తొడుక్కుని కాఫీహోటలుకి బయల్దేరాడు కాఫీహోటలులోంచి వస్తూండగా వెంకటేశ్వర్రావు అవుపించేడు !

కొంతదూరం, ఏదో నవ్వుతూ మాట్లాడుతూ, మాట్లాడుతూ ఆకస్మికంగా తన చిరిగిపోయిన చొక్కావైపు చూపిస్తూ "ఒరేయి యింతవరకు చొక్కాలన్నీ చిరిగిపోయినా బాధపడలేదు కాని, చిరిగిపోయిన వాటినికూడా చాకలాడు పారేస్తున్నాడు అని బాధపడాల్సొస్తోందిరా యిప్పుడు ఏమైనా నీకు పనికిరానివి నాల్గు చొక్కాలు చిరిగిపోయిన వుంటే యిద్దూ' నవ్వుతూనే చొక్కాలు కుట్టించుకోడానికి డబ్బుని మిగల్చడం ఎంత కష్టమో వినహాయించి మిగతా సంగతులు అనేకం మాట్లాడేస్తున్నాడు

తానాగిపోయి వక్కక్షణం వాడివంక చూసేడు నిజంగానే చొక్కా చాలా దైన్యస్థితిలో వుంది వాడా నవ్వుతూ అడగటం నావంతు కాని, విడమర్చి చెప్పటం నావంతు మాత్రం కాదుసుమా అన్నట్లు ఏమేమో మాట్లాడుతున్నాడు

ఉన్నాయి తనవద్ద చిరిగిపోయిన చొక్కాలు చాలాను కాని తన మనస్సు చివుక్కుమంది తోటి స్నేహితుడికి చిరిగిపోయిన చొక్కాలు ముష్టాడికిచ్చినట్లు ఎట్లా యివ్వాలో అర్థమయ్యింది కాదు

'బజారు రారా నాతో! రెండు చొక్కాలు చింపిస్తా'

'కొత్తవి తొడుక్కోడానికి మనం ఏమీ తాసీల్దారులం కామురోయి ఎవ్వో ఇట్లాగే చిరిగినవే, గుమాస్తాలంతా తొడుక్కోవాలని న్యాయశాసనం తాసీల్దారవనీ కొత్త చొక్కా తొడుగుదాము' నవ్వుకూడాను

తనేమీ చెయ్యలేడు వాడికి పాతవి తాను యివ్వలేడు, కొత్తవి వాడు తీసుకోలేడు ఎంతబాధ ! అంత బాధలోనూ వాడు నవ్వే

ఏమయ్యిందో ఆ నవ్వు అతని ముఖమంతా వెతుకుతున్నాడు తనిప్పుడు.

వెంకటేశ్వర్రావు తన ఆలోచనలని పసిగట్టినట్లు తలెత్తి చూచి, పూరికే, నేనేదో ఖూనీచేసినట్లు నన్నట్లా చూడకురా నేను ఒప్పుకుంటున్నా, నేను పూర్తిగా మారిపోయేనని "

తను జాలిపడ్డాడు అతన్ని చూసి బాధపడ్డాడు అతని పరిస్థితి చూసి అతనిలో యీ మార్పుకి ఎంత బాధో! చేపని నీరు లోంచి వొడ్డుని విడిచినట్లు అతని మనస్సే యింత పరిస్థితుల్లో ఎట్లా గిజగిజ లాడుతూందో!

పాపం! అంతా కలిపి 72 యిచ్చేవారు జీతం ఇరవై రూపాయల యింటద్దెపోను, బియ్యానికి 15 రూపాయలు, యితర దినుసులకో 15 చాకలి, మంగలి, పాలవాళ్లకి, పెరుగువాళ్ళకి మరో యిరవైపోను, పెళ్లాం బిడ్డలనీ, తల్లినీ పోషించాలసిన అతనికి చొక్కా కుట్టించుకునే తాహతెట్లా వస్తుందానాడు ఆ జీతంతో, మకిలిదాని అతని చేతులకి కొత్త చొక్కాని పట్టుకునే అర్హత ఎక్కడిదీ అసలు?

'అవుననుకో కన్పిస్తూనే వుంది అయితే ప్రస్తుతం జీతం ఎంత యిస్తున్నారని?'

'ఎంత? 72కి మూడు రాళ్ళు ఆరు కలుపు' హీనంగా నవ్వేడతను ఆ నవ్వు వెనక అగాధమైన విషాదం

ఒక్క క్షణం ఆగి ఏదో ఆలోచిస్తూ అన్నాడతను

'ఇంకా కొంచెం నీచమైన పన్లున్నాయి తెల్సుగా - అబద్ధాలాడటం, ముఖస్తుతి చెయ్యటం, లంచాలు యివ్వటం, పనిచేస్తున్నట్లు నటించటం యిట్లాంటివి కొన్ని మిగిలిపోయేయి ఇవికూడా యిప్పటినుంచీ అలవాటు చేసుకుంటే యింకో రెండేళ్లలో నేను చిన్న 'కార్'ని భరించగలను ఈసారి నువ్వొస్తే ఆ కార్లోనే మాయింటికి రావడం'

తర్వాత తామేమీ మాట్లాడుకోలేకపోయేరు మాట్లాడుకోడానికి చాలా సిగ్గుపడాల్సిన విషయాలు మిగిలినవన్నీ! మాట్లాడుకోకుండా చెయ్యాల్సినవే మిగిలినవన్నీ!

అయితే తన కొక్కటే విచిత్రంగా కన్పించింది చిన్నప్పుడూ ముగ్గురూ అనుకునేవారు కారులో ఎక్కి తిరగాలని, కారుని భరించాలని, కారుని 'డ్రైవ్' అయ్యాలని ముగ్గురిలోనూ, తను వక్కడే చెప్పడే కారుని కొనేసి, ప్రస్తుతం దాన్ని తోలుతూ చిరకాల వాంఛని తీర్చుకుంటున్నాడు

వెంకటేశ్వర్రావు, సత్యము కూడా

* * *

తిరిగి వస్తున్నాడు తెనాలలో పని చూసుకుని, తను స్టేషన్వైపు వకనాడు మెడికల్ షాపు ముందు చేతిలో చిన్న మందు సీసాతో పధ్నాలుగేళ్ల కుర్రాడు తారసపడ్డాడు వాడు తనవంకే చూస్తూ, 'యిక్కడున్నావేం బాబాయి' అన్నాడు

తనింకా గుర్తుపట్టనేలేదు, ఆ కుర్రాడు గుర్తుపట్టేసేడు తనని ఆలోచనల్లోంచి తేరుకోకముందే వాడనేసేడు 'నేను బాబాయి సత్యం తమ్ముడ్ని'

చాలా ఎదిగేడు కుర్రాడు! చిరిగిన బట్టలతో సన్నగా పూచలా వున్నాడు అడిగేడతను 'సత్యం వద్దనుంచి వుత్తరాలు వస్తున్నాయా' అని

వాడొక్క క్షణంలో గుక్కతిప్పుకోకుండా పెద్ద విషాదగాథని విన్పించేడు. సారాంశం అతని తల్లి చాలా జబ్బుగా వుందని సత్యంవద్దనుంచి రెండు నెలలనుంచి వుత్తరాలే లేవని 'సరే నడు నేనూ వస్తా' అంటూ వాడి వెనకాలే నడిచేడతను

సత్యం తల్లి చాలా కృశించిపోయి వుంది తనని గుర్తుపట్టలేకపోయింది తనే చెప్పుకున్నాడు ఫలానా అని

అంత నీరసంలోనూ ఆవేదనంతా వెళ్లబుచ్చుకున్నదా వృద్ధమాత

'సత్యానికి రానేరా పరిస్థితులు యిట్లా వున్నాయని' అడిగేడు తను

'వాడికెందుకు నాయనా యీ గొడవలన్నీ అక్కడ ఏం తింటున్నాడో, ఏదో తెలియక నా ప్రాణం కొట్టుకుపోతూంటుంది వాడి అవస్థలు వాడు పడుతున్నాడు కుయ్యిమనకుండా ఈ ఇంటి గొడవలతో వాడి మనస్సును కూడా ఎందుకు పాడుచెయ్యడం?' చెప్పిందామె

'అది కాదమ్మా ఇక్కడ వక్కడ్తివీ కుర్రాడితో ఏం అవస్థపడతావు. నువ్వయినా అక్కడికి వెళ్లి పోరాదూ యీ కొంప అంతా అద్దెకిచ్చేసుకుని - కుర్రాడితో' అన్నాడతను

'ఆ మధ్య సత్యం అదే రాసేడు బాబూ ఇంకా కొన్నాళ్లల్లో తన కేదో ప్రమోషన్ రావచ్చుట ఆ పరీక్షలన్నీ ప్యాసయ్యేడట 'ఏ తాసీల్దారుగానో యీ వైపు ఎక్కడో వేస్తారు అంతా హాయిగా వుండొచ్చు నిన్ను సుఖపెడతా. మన



 

కష్టాలెంతో కాలం వుండవు అమ్మా' అని రాసేడు ఎప్పుడో వొస్తుందా సుదినం కష్టాలు ఎల్లకాలం వుండవు నాయనా! అన్నట్లు నీ కేమైనా పిల్లలా' అడిగిందామె

పరధ్యానంగానే 'యిద్దరు' అని చెప్పి, ఆమె కష్టాలని గురించి ఆలోచించ సాగేడతను

'బావుంది! వాడక్కడ ఏం అవస్థలు పడుతూన్నాడో ఏమో ఎప్పుడైనా అటు వెడితే చూసిరా బాబూ! చిన్నప్పటి నుంచీ కలిసి చదువుకున్నారా మీయిద్దరూ ఏదో యీ యింటిమీద వచ్చే అద్దెపైకం 50 రూపాయలు మా యిద్దరి పొట్టలకి చాలులే చిన్నప్పటినుంచీ ఎంతో గారాబంగా పెరిగేడా యిరి, మా నాయన ఏ కష్టాలు ఎరగడు వారు పోయేక, పాపం వాడికి అన్నీ అవస్థలే! ఎన్నాళ్లుంటాయిలే యీ కష్టాలు

ఇంకో రెండు మూడేళ్లలో చిన్నాడి చదువుకూడా పూర్తి అవుతుంది అందరం హాయిగా ఒకే చోట ' ఆయాసంతో కళ్లు మూసుకుంది - ఆమె

కుర్రాడిని అడిగేడు 'మందెవరు యిస్తున్నార్రా' అని

'హోమియోపతి డాక్టరు - రంగయ్యగారు '

సరే తనిక చేసేదేముంది? లేచి వచ్చేసేడు స్టేషన్‌కి దారిపోడుగునా తన చెవిలో అవే మాటలు గింబరు మంటున్నాయి 'కష్టాలు ప్రమోషన్ గట్టెక్కడం సౌఖ్యం '

మాటలు ఒట్టి మాటలు బరువు లేని మాటలు—నిజం కాలేని మాట లవ్వి తనకి తెలుసు అయినా ఆశలవ్వి!

* * *

సత్యనారాయణ గదికి తాళం వేసి వుంది తను వెళ్లేసరికి సాయంత్రం 6½ గంటలయినా అతనింకా ఏం చేస్తున్నాడో అర్థం అయిందికాదు ప్రక్కగదిలోని వాళ్లె నడిగితే వాళ్లు చెప్పారు, 'యింకా ఆఫీసులోనే వుంటాడని '

తన సామాన్లు ప్రక్కవాళ్ల గదిలోనే వుంచి తను మౌంట్ రోడ్డు మొగలో పేవ్‌మెంటుమీదకు వచ్చి నిలబడ్డాడు, సిగరట్ ఒకటి వెలిగించుకుని

మరలోంచి బియ్యం జారినట్లు, 'టర్నింగు'లోకి కార్లు - రకరకాలవి జారి, మెరిసి, అదృశ్యమయిపోతూన్నాయి ట్రాములతో సమంగా మరోవైపు పార్సీవాళ్లు పరుగులెత్తుతున్నారు, ఏదో మునిగిపోతూన్నట్లు కనుచూపుమేరలో సత్యం వచ్చే జాడలు అవుపించడం లేదు, ఎక్కడా తనకి

పిటీ న్యూస్ ఏజెంటు షాపులో ఒక 'యింగ్లీషు వీక్లీ' తీసుకుని, బొమ్మలు చూస్తూ తను అనుకున్నాడు, 'యిదన్నమాట వీడి జీవితం? జీవితంలో మరోటేదీ చెయ్యాల్సింది లేనట్లు ఏడింటివరకు ఆఫీసు పనేమిటి?'

తన కంళ్లు పత్రికమీదనుంచి మళ్ళీ ఒక్కసారి ట్రాములమీదకి, కార్లమీదకి జరిగి, ఎదురుంగా వున్న కార్లు నిలిపేచోట ఆగింది సత్యం బీడీ పీలుస్తూ నిలబడి వున్నాడు ఎదురుంగా ఆనందంగా కేకేసి చేతు లూపేడు తను సత్యం యిదేమీ గమనించడం లేదు అతని దృష్టంతా వంకరలో తిరిగి, మెరిసి, జారిపోతూన్న రంగురంగుల కార్లపైన వుంది స్వంత కారుకోసం నిరీక్షిస్తున్న వ్యక్తిలా వున్నాడతను అక్కడ! 'ఇది కాదు, ఇది కాదు, ఇది కాదు ' అన్నట్లు అతని కంళ్లు వరసగా ఒక కార్లు మీదనుంచి మరోదానిమీదకి పాకుతున్నాయి మృదువుగ

ఉన్నట్లుండి నీరసం వచ్చినట్లు నెమ్మదిగా ఎలక్ట్రిక్ స్తంభానికి జేర్లబడి, నోట్లోని బీడీని తీసి నేలకు విసిరిపారేసేడు సత్యం చిరిగిపోయిన చొక్కాతో, చెమటకారే ముఖంతో సత్యం యీ ప్రపంచానికి సంబంధించని వ్యక్తిలాగ వున్నాడక్కడ

త్వరితంగా, నేర్పుగా కార్లను, బండ్లను తప్పించుకుని సత్యం దగ్గరకి జేరేడతను సత్యం తనవైపు చూచి కూడా తనని గుర్తించలేకపోయేడు 'ఏరోయి' అంటూ తను బాగా దగ్గరకి వచ్చేసరికి, బలవంతంగా తెచ్చుకున్నాడు చిరునవ్వుని— అతని పెదాలపైకి ఎందుకో ముఖంలో సిగ్గ ఒకటి!

'ఏమి టిక్కడ యీ ధ్యానం?' తిన్నగా అడిగే డతను

'ఇక్కడ ఎన్నాళ్లున్నా ఆ కార్లని దాటలేననే అనుమానం! వాటికింద పడకుండా అవతలకి జేరలేననే భయం! ఏం చేసేది? అయితే ఏమిటి సంగతులు? ఎప్పుడొచ్చేవు' అడిగేడు సత్యం

తన హోదా, తన జీతం, తన వూళ్లోని పరిస్థితులు అన్నీ వివరంగా చెప్పేడు తను, యివతలకువచ్చి వాళ్ల గదివైపు నడుస్తూ, క్రిందటిసారి తను అతని తల్లిని చూడటం, ఆమె ఆశలు అన్నీ చెప్పి, 'అయితే నీ పరిస్థితులు ఎట్లా వున్నాయి?' తను అడిగేడు

సత్యం గది తాళం తీసి, లోపలికి నడుస్తూ 'బాగానే వున్నాయి' ధర్వాతేదన్నాడు

గదంతా బీడీ ముక్కలతోను, దుమ్ముతోను నిండివుంది నేలమీద ఒకమూల ఒక జంబుఖానా పరవబడివుంది తలవైపున తలగడగా నాలుగుజతల చొక్కాలాగులు అమర్చబడి వున్నయి

కుడివైపు ఒకమూలని ఒక ట్రంకు దానిమీద మూడువరసల పుస్తకాలు! కొన్ని రచనల వ్రాతప్రతులు!

తను హీనంగా నవ్వి పుస్తకాలదగ్గర కూర్చుంటూ, ఒక వ్రాతప్రతిని చూస్తూ 'మరిన్నాళ్ల సర్వీసు వుంది, ప్రమోషన్ ఏమీ రాలేదూ?' అడిగేడు! ఊ కవిత్వం కూడాను

తర్వాత పుస్తకాలు చూచేడు

అన్నీ ఖరీదైన పుస్తకాలు! ఇదా వీడు చొక్కాలు కూడా కొనుక్కోకుండా, డబ్బుతో చేస్తున్న నిర్వాకం

'ఒచ్చేదే మరి నా కన్న వెనకచేరిన వాళ్లకి కూడా వచ్చింది ఒస్తుంది రేపో మాపో నాకూను' చెప్పేడు సత్యం

'రావాల్సిందే ఇప్పుడేమిస్తున్నారేంటి?'

'అంతా కలిపి ఎనభయిరెండు '

'పైన ఏమీ?'

'ఛీ! ఛీ!'

'ఏం, మేం అంతా తీసుకోవడం లేదూ?'

తన మాటలు తనకే విచిత్రంగా కన్పించినయి ఒకనాడు తను యీ ఆచారం నీచమని వాదించేడు అసహ్యించుకున్నాడు తానిప్పుడు

పరీక్షలరోజులు గుర్తొచ్చినయి తన తండ్రి తనని వెంటబెట్టుకొని 'ఎగ్జామినర్' యింటికి లాక్కెళ్లాడు ఆయనఎదట చిన్న కుర్రాడిలా తన తండ్రి కళ్లనీళ్లు కారుస్తూ తన జీవనాధారాన్ని పాసు చేయించమని వేడుకున్నాడు

ఎగ్జామినర్ చాలా దర్జాగా నవ్వి 'ఏం తెచ్చేవు?' అడిగేడు

తన తండ్రి మామిడిపళ్ల బుట్టని లోపల పెట్టించేడు ఆయన మందహాసం చేసి 'ఒక వంద రూపాయలుకూడా పట్రా ' ఆ మర్నాడే ఏభయి సెంట్ల భూమిని అమ్మి తన తండ్రి వంద రూపాయలు చెల్లించేడు ఎగ్జామినర్‌కి తను పరీక్ష ప్యాసయ్యేడు!

తన వుద్యోగానికీ అంతే. రెండు వందలు! ఆ మధ్య తన యింటిగోడ పడిపోయింది సిమెంటు దొరకదు 10 బస్తాలు తెమ్మకోడానికి 50 రూ లు 'ఫీజు!' లేచినది మొదలు తన కళ్లముందు, ప్రపం

చంలో పైసా చూపనిదే ఏ పనీ జరగటం లేదు మహాసముద్రంలో తను ఎదురీద గలడా! వాలుకి ఈదసాగేడు

ఇదంతా విని సత్యం నవ్వి వూరుకున్నాడు

కాస్సేపు యితర విషయాలు మాట్లాడుకున్నాక భోజనానికి బయటికి నడిచేరు 'నడుస్తూ ఏ హోటలు?' అడిగేడు తను

సత్యం కార్లని జాగ్రత్తగ తప్పించుకుంటూ వకహోటలుముందు ఆగి 'ఇక్కడ చేద్దామా?'

'మీ హోటలు ఏదీ అన్నాను?' అడిగేడు తను మళ్లీ

'ఒక హోటలు ఏమిటి మనకి?'

'మరి నెలవారీభోజనం చెయ్యడం లేదూ?'

'డబ్బు లుంటేద్దూ వక్కసారిగ ఎక్కడ పడితే అక్కడే క్రిందటి నెల చేసిన అప్పులు తీర్చేసరికి ' వూరుకున్నాడు - సత్యం

'మరి తర్వాత?'

విషాదంగా తనవంక 'చెప్పాలా?' అన్నట్లు చూచేడు గ్రహించేడు తను 'పస్తులు' అన్నమాట!

సత్యం వద్దన్నా వినకండా తను జేబులోంచి డబ్బులు తీసి రెండు భోజనం టిక్కట్లు కొన్నాడు

తిరిగి గదిలోకి వచ్చేక తను చెప్పేడు వాళ్ల అమ్మని తమ్ముడ్ని తీసుకొచ్చేసి అంతా యిక్కడే కలిసి వుండటం బావుంటుందని!

'నా కోరిక కూడా అదే! నన్నింత పెద్ద వాణ్ణి చేసిన అమ్మకి ఏమీ సాయం చేయ లేకపోతున్నానే అని ప్రతీక్షణం నా హృదయం మధనపడిపోతూంది ఎప్పుడో నాకు జీతం హెచ్చించక పోరు ప్రమోషన్ రాకపోదు అమ్మని తీసుకొచ్చి సుఖ పెట్టకపోను ఇప్పుడు నాతోబాటు వాళ్లూ కష్టపడటమేగాని యిక్కడేం సుఖపడతారు? ఒస్తాయి మంచిరోజులు'

తా నిది భరించలేకపోయేడు. 'చూడు సత్యం మన చిన్ననాటి ఆశయాలూ, ఆదర్శాలు వేరు, యీనాటి జీవితం వేరు ఆ ఆదర్శాలకీ యీనాటి ప్రపంచానికి లంకె కుదర్చలేము ప్రపంచంతోబాటు మనమూ మారాలి, లేకపోతే మన గతి యింతే! ఈ నాడు, న్యాయం, సత్యం, దయ మొదలైన వాటికి స్థానం లేదు అవెక్కడుంటే అక్కడ సర్వనాశనం!'

సత్యం చిత్రంగా తనవైపు చూచేడు

'అవును నువ్వు నన్ను నమ్మవు దయగా సత్యప్రవర్తనతో జీవితం గడపినవాళ్లెవరూ యింతవరకు బాగుపడలేదు లంచాలు తీసుకుని, అబాద్ధాలాడి, ఏ ఎండకా గొడుగు పట్టినవాళ్లు మేడలు కట్టుకొని కార్లల్లో వూరేగుతున్నారు ఆత్మగౌరవం చంపుకొని, అన్యాయాలకు వడిగట్టుకున్న వాళ్లు యీనాడు వేదికలెక్కి నీతినిగురించి మహోపన్యాసాలిస్తున్నారు-మహానాయకులై' వుద్రేకంగా అన్నాడతను

సత్యం బాధగా తన చేతులు పట్టుకుని 'నీకు దణ్ణం పెడతా. ఆ విషయం వదిలెయ్యి'

తనకి జాలేసింది తను మాట్లాడలేకపోయేడు 'నీ యిష్టం మరి నేను వెళ్లి రావాలి బండీకి' లేచేడతను ప్రక్కవాళ్ల గదిలోంచి తన సామాను తీసుకుని స్టేషన్‌కు వెళ్ళబోతూండగా ఆ గదిలోని ఆయన 'నేనూ వస్తా సెంట్రలులో కొంచెం పనుంది నాకు' అంటూ ఆయనా వచ్చేడు, తనతో

ఆయనకీ సత్యం ఆఫీసులోనే పని ఆయన తనతో సత్యం గురించి చాలా వింతగా చెప్పేడు సత్యం ముక్కుకు సూటిగా పోతాడట ఏదో వకగుమాస్తా లంచంతిని వంకరత్రోవన పోతోంటే అది తప్పని వీడు పేపరుమీదే 'రిమార్కు' చేస్తాడట మిగతా గుమాస్తాలకి వీడంటే తగని అసహ్యం ముఖ్యంగా హెడ్డుగుమాస్తాకి ఏదో పెర్మిట్లు అక్రమంగా యింకొరికిచ్చేరని వోసారి ఆఫీసర్ మీద కూడా ఎదురు తిరిగేడట-సత్యం

తనకి బాగా అర్థమయ్యింది సత్యం అవస్థ! అందుకనే అతనికి ప్రమోషన్ రాలేదు ప్రమోషన్ సంగతి దేవుడెరుగు వాడ్నింకా అసలు వుద్యోగంలో వుంచేరు

* * *

మూడేళ్లు గడిచేయి సత్యం సంగతులు ఎప్పటికప్పుడు తెలుస్తూనే వున్నాయి వాళ్లవల్ల వీళ్లవల్ల తన పరిస్థితులు మారేయి, వెంకటేశ్వర్రావు పరిస్థిలు మారేయి వెంకటేశ్వర్రావు సబ్ కలెక్టర్ అయ్యేడు, ఒక కారు, పాతికఎకరాలు కొన్నాడు. రెండు సొంతకార్లు, ఒక పెద్దమేడ-పర్వాలేదు మద్రాసు ట్రాన్స్ఫరు యీ మధ్య, అయిదొందల జీతంమీద! ఇక సత్యం, తమ్ముడు ఎక్కడికో పారిపోయేడుట అది విని అతను తన తల్లిని మద్రాసు పిల్చుకు వచ్చేడట ఎక్కడున్నాడో ఎట్లా వున్నాడో చూడాలని అన్పిస్తుంది తనకి ఎప్పుడైనా!

* * *

చల్లటి సాయంత్రపు గాలిలో తేలిగ్గా జారిపోతూంది తన క్రొత్త 'వాక్సాల్' - మౌంట్‌రోడ్డుమీదనుంచి ఎదురుంగావున్న అద్దంలోంచి తన కారు ంటె తక్కువ ఖరీదైనవి, ఆగడం, మెరవడం, మాయవడం కన్పిస్తూంటేను, మనుష్యులు, ట్రాముల్లో సీట్లకోసం తన్నులాడుకోడం కన్పిస్తూంటేను, యితరులకంటె తానెంత అదృష్టవంతుడో జ్ఞప్తికి వస్తూంటుంది.

ఆకస్మికంగా తన కండ్లు 'సిటీ న్యూస్ ఏజెంటు' షాపువైపు తిరిగేయి సత్యం ఆ షాపుముందు బీడిని కాలుస్తూ నిలబడి వున్నట్లు ముందే వూహించుకున్న తనకి, ఎన్నో క్రొత్త ముఖాలు, బాధలతోగూడిన ముఖాలు, గుమాస్తా ముఖాలు అవుపించినయి

కండ్లు రెండు ముందు మిర్రర్‌లోకి తొంగిచూసేయి వెనకనుంచి 'ఆస్టిన్' కుడివైపు ఛర్రున నేర్పుగా వంకర తిరిగేడు తను 'సెంట్రలు' వైపు జారిపోతూంది తన కారు - మెత్తగా!

ఆకస్మికంగా ఎదురుగావున్న అద్దంలో సత్యం కన్పించినట్లయింది తనకి ఎలెక్ట్రిక్ స్తంభంవద్ద, నోట్లో బీడీ ముక్కతో సత్యమే అతను బ్రేక్ వేసేలోగా సత్యం అద్దంలోంచి అదృశ్యమయిపోయేడు

ఆ ఒక్క క్షణంలో అపరిమితమైన అసహ్యంవేసిం దాతనికి సత్యం పైన. న్యాయంకోసం, సత్యంకోసం, నలిగిపోయిన 'సత్యం' ఎంతో పిరికిపందగా కన్పించేడాతనికి కనకనే కారు వెనక్కి త్రిప్పలేకపోయేడు తను తిన్నగా పోసాగింది తన కారు బాధగా మూల్గుతూ!

అరిపోయిన బీడీని విసిరివేసి, ఎలెక్ట్రిక్ సంభాన్ని ఆనుకొని, జారి, మెరసి, అదృశ్యమయి పోయే కార్లని అట్లానే చూస్తూ నిలబడిపోయేడు, చిరుగుల చొక్కాతో అక్కడేవున్న సత్యం! కారు నెక్కలేని గుమాస్తా సత్యం! ★

భర్త: నేను నిన్ను పెళ్లాడేనాటికి నీపేర ఒక్క చింకిపాత కూడా లేదు.

భార్య: ఇప్పుడన్నీ చింకిపాతలే.

# అదీ - ఇదీ

## కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ

కాంగ్రెసుపార్టీకి ప్రతిగా కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ స్థాపించటానికై పాట్నాలో జరిగిన మహాసభను గురించి జూన్ 17 "నేషనల్ హెరాల్డ్" పత్రిక "మరొక కాంగ్రెసా?" అని శీర్షికకింద సంపాదకీయం వ్రాస్తూ "ఆశయాల్లోగాని విధానాల్లోగాని కాంగ్రెసుతో విబేదాలు లేవని కృపలానీ తన ప్రారంభోపన్యాసంలో" అన్నాడనీ, "ఈ కొత్త కాంగ్రెసు 'ఇంకా మంచి' కాంగ్రెసు వాదులతో కూడుకున్నదనుకున్నప్పటికీ మరొక కాంగ్రెసును సృష్టించటానికి బలమైన కారణాలను కృపలానీ" చెప్పలేదనీ విమర్శించింది

ఆదర్శాలు ఇరవయ్యో శతాబ్దంవారిని భయపెట్టటానికి ఉత్పన్నమైనవని చెబుతూ, అదివరలో ఆదర్శవిభేదాలు లేకుండా ప్రజాస్వామికపార్టీ లుండేవనీ కృపలానీ చేసిన వాదాన్ని ఈ పత్రిక ఖండిస్తూ, "నేటిఇండియా 20 వ శతాబ్దపు ఇండియా, దీనిపై ఆదర్శాల ప్రభావం ఉండితీరుతుంది," అన్నది "ఇండియాలో ఆంతరంగిక కల్లోలమూ, పైనుంచి ప్రమాదమూ తోబాటు ఆదర్శవైవిధ్యంకూడా ఉన్నది ప్రజాస్వామిక ఖేలనార్థం కాంగ్రెసు రెండుగా చీల వీలులేదు ప్రజాపార్టీ ప్రత్యేకతను కృపలానీ రుజువు చెయ్యలేదు," అని "నేషనల్ హెరాల్డ్" అన్నది

కాంగ్రెసునూ, ప్రభుత్వాన్నీ కృపలానీ విమర్శించటాన్ని ఈ పత్రిక సమర్థించి, ఆ విమర్శతో చాలామంది కాంగ్రెసువాదులు ఏకీభవిస్తారని చెబుతూ, "కాంగ్రెసు గడచిన కష్టాలనూ, గడవనున్న కష్టాలనూ" కృపలానీ పేర్కొని ఉండవలసిందనీ, బాహ్యప్రపంచం గురించిగాని ఇండియాకు దానితోగల సంబంధాలను గురించిగాని కృపలానీ శ్రద్ధ చూపలేదనీ, ఇండియా పాకిస్తానుల సంబంధాలవల్లా, కాశ్మీరుసమస్యవల్లా, మతవిచక్షణవల్లా ఏర్పడ్డ సమస్యలు అచ్చగా ఒక పార్టీకి సంబంధించినవి కాక, దేశానికి సంబంధించినవని, ఏక పార్టీ ప్రభుత్వంవల్ల కలిగే నష్టాలను పేర్కొన్నమాత్రాన అవి పరిష్కారం కావనీ అన్నది

పరిపాలన అవినీతిరహితం చెయ్యటానికే, దొంగవ్యాపారాన్నీ, లాభకాంక్షనూ అంతమొందించటానికి విప్లవయుతమైన పద్ధతులుండాలనీ, అటువంటి పద్ధతుయు ఈ పార్టీలో లేవనీ "నేషనల్ హెరాల్డ్" పత్రిక సూచించింది

## ఇండియాలో విభేదాలు

"ఇండియాలో విభేదాలు" అన్న శీర్షికతో జూన్ 9 "న్యూస్టేట్స్‌మన్" పత్రిక, ప్రస్తుతంలో ఇండియాలో పరిస్థితులు వామపక్షాలను బలహీనపరచటానికీ, అభ్యుదయ నిరోధకశక్తులను ప్రోత్సహించటానికీ అనుకూలంగా ఉన్నాయన్నది ఈ పత్రిక అంచనాప్రకారం, బ్రిటిషువారు వెళ్ళిపోగా, ముస్లింలీగ్ లాగే, కాంగ్రెసుకూడా ప్రతిపక్షం లేని కారణంగా విచ్ఛిపోతున్నది, బ్రిటిషువారు ఈ సమయంలో ఇండియాలో ఉన్నట్లయితే వారిని హిందువులూ, ముస్లిములూ, సిక్కులూ, ధనికులూ, దరిద్రులూ తీవ్రంగా ప్రతిఘటించి ఘోరంగా ఓడించేవారు, ప్రస్తుతం ఇండోచైనాలో ఫ్రెంచివారికి పట్టినగతే బ్రిటిషువారికీ పట్టి ఉండేది, నాయకత్వం - ఆసియాలో పాశ్చాత్యులు తను అధికారాన్ని నిలబెట్టుకొనచూస్తున్న ప్రతిచోటా జరుగుతున్నట్టుగానే - కమ్యూనిస్టుల చేతిలోకి పోయేది, అని ఈ పత్రిక అంటోంది

వచ్చే ఎన్నికలలో ప్రత్యేక పార్టీగా నిలబడి పోటీ చెయ్యటానికి కృపలానీ చేసిన నిర్ణయాన్ని గురించి వ్రాస్తూ ఈ పత్రిక, ఈ కొత్తపార్టీ సోషలిస్టులను కలుపుకొంటుందని భావించవచ్చుననీ, అయితే ఇండియాలో అనుసరించబడే విధానాలపై సోషలిస్టుల ప్రభావం ఏమీ లేదనీ, కృపలానీ సోషలిస్టు కాడనీ అంటున్నది

"ఈ సంఘటనల విచిత్రఫలిత మేమంటే వామపక్ష నాయకుడైన నెహ్రూ ఇక్ష్వాకులనాటి విధానాలుగల టాండన్‌తో పొత్తు కలిశాడు టాండన్‌కు రాజకీయాలలో ఆసక్తి ఉన్నట్లయితే తాత్కాలికంగా కూడా ఈ పొత్తు సాధ్యం కాకపోయేదేమో అయితే టాండన్ మత విశ్వాసాలు హిందూమహాసభకూ, అర్ధఫాసిస్టుసంస్థ అయిన స్వయంసేవక సంఘానికీ ఎక్కువ సన్నిహితంగా ఉంటాయని నెహ్రూ అనుచరులకు బాగా తెలిసి ఉండాలి

ఎన్నికలను గురించి జోస్యం అప్పుడే చెప్ప వీలులేదు, ఇంకా ఎన్నికల తేదీ కూడా నిర్ణయం కాలేదు కాని ఇటీవలి సంఘటనల పరిణామం మటుకు చెప్పవచ్చు ప్రతిదీ అభ్యుదయ నిరోధకశక్తుల అభివృద్ధికీ ఇండియాలోని వామపక్షాలు బలహీనపడటానికీ అనుకూలంగా ఉంది"

ఈ పత్రిక అంచనా ప్రకారం కమ్యూనిస్టులు తమ హింసాకాండవల్లా, పొరపాట్లవల్లా, గతయుద్ధంలో మిత్రమండలిని బలపరచటంవల్లా లెక్కలోకి రాకుండా పోయారు, అంతకాలంపాటు నెహ్రూ పటేలుతో కలిసి ఉండి, ఆంతరంగిక సంస్కరణలు ఉపేక్షించి అంతర్జాతీయ రాజకీయాలపై దృష్టి నిలపటంవల్ల, ఆయన నాయకత్వం ఆశించిన అభ్యుదయకాముకులు నెహ్రూతో అసంతృప్తి చెందారు కాంగ్రెసు తలపెట్టిన సాంఘిక, ఆర్థిక కార్యక్రమానికి అంతరాయంగా ఉన్నవారు సంస్థానాధిపతులూ, జమీందార్లూ పటేల్ కృషివల్ల సంస్థానాలన్నీ ఇండియా యూనియనులో చేరినా చాలామంది సంస్థానాధిపతులింకా ధనికులైఉండి, రాజకీయప్రభావం కలిగి ఉన్నారు జమీందారీలను రద్దుచెయ్యటంలో ప్రభుత్వం ఇంకా పూర్తి విజయం సాధించలేదు దేశమంతటా సంస్కరణ అమలు కావాలంటే జరగవలిసినది చాలా ఉంది జమీందార్లు క్రోధావేశులై ఉన్నారు ఇండియా ప్రజాస్వామికానికి వీరు శత్రువులుగా పరిణమించవచ్చు

ఈ అభ్యుదయ నిరోధక వర్గాలన్నీ హిందూ మత సంప్రదాయాల నాశ్రయిస్తాయని ఈ పత్రిక అంచనా వేస్తున్నది, అయితే హిందూ ఆచారాలను సంస్కరించటానికై బిల్లు ప్రవేశపెట్టినందుకు నెహ్రూను అభినందిస్తున్నది, రాజ్యాంగాన్ని సవరణచేయవలసిన అగత్యం కలిగినందుకు నొచ్చుకుంటున్నది, ఇండియాలోని యువకుల ఆదర్శాలను కాంగ్రెసుగాని, సోషలిస్టులుగాని, కమ్యూనిస్టులుగాని తృప్తిపరచలేనందుకు విచారిస్తూ నానాటికీ హిందూజాతీయవాదం విజృంభిస్తున్నదనీ, నెహ్రూగాని ఆయన అనుచరులుగాని ఎదుర్కొనవలసవచ్చేది ఈ హిందూజాతీయవాదాన్నే అవుతుంది, గాని వామపక్షాలను కాదని హెచ్చరిస్తున్నది ★



# వాన చిన్నది

శ్రీ వి. కోదండపాణి



భోరని శబ్దం
భోయ్యని శబ్దం
గలగల శబ్దం
జలజల శబ్దం
మంజులధ్వనీ
మధురరాగమూ
చల్లని పాట
చక్కని గీతం
సప్తస్వరాల
సర్వవిధాల
ఆలాపించి
ఆకర్షించి
వచ్చుచున్నది
వానచిన్నది

*

మబ్బునుండి
మాకులనుండి
ఆకులనుండి
మూలలనుండి
వేడిమట్టిపై
వేగుమట్టిపై
సెగలనార్చి
పొగలతీర్చి
పైడిపైరుల
పాడిపంటల
పచ్చదీవల
పసుపు పూల
వాసన పూల
వాలు రెమ్మల
చక్కగ పెంచి
చల్లని జోల
ఆలాపించి
ఆకర్షించి
వచ్చుచున్నది
వానచిన్నది

*

వర్షగీతితో
హర్షముతోడ
కప్పకులాలు
విప్పిబలాల
బెకబెకలాడి
బేరాన ఓడి
భగ్గునమండి
జన్మమునుండి
పొట్టపగిలి
తోలు ఎగిలి
హెచ్చుగపాడి
చచ్చెను ఓడి

బొమ్మరిల్లు సీరియల్

# రాజు - పేద

మార్క్ ట్వైన్

జరిగిన కథ —

1537 వ సంవత్సరం లండన్‌లో హెన్రీ మహారాజుకి ఎడ్వర్డు అనే కొడుకూ నిరుపేద జాన్ కాంటీకి టామ్ అనే కొడుకూ కలిగారు. ఇద్దరూ ఒకే పోలిక. పదేళ్ల వయస్సప్పుడు టామ్ రాజభవన కేసి వెడతాడు. యువరాజు ఎడ్వర్డు టామ్‌ని లోపలికి తీసుకుపోయి ఆదరిస్తాడు. ఒకరి జీవితంమీద మరొకరికి ఆసక్తికలిగి దుస్తులు మార్చుకుంటారు. టామ్ దుస్తుల్లో యువరాజు కోటబైటకు రాగానే అతన్ని ప్రజలు నానాబాధ పెడతారు. తను యువరాజునంటున్న కొద్దీ వాళ్లు అతన్ని ఇంకా ఎక్కువబాధ పెడతారు. అక్కడ కోటలో యువరాజు దుస్తులుధరించిన టామ్‌ను యువరాజుగానే అంతా పరిగణిస్తారు. అతడు తను బిచ్చగాళ్ళ కుర్రాడినని చెప్పినా వాళ్లు ఎచ్చెక్కిందనుకుంటారేగాని అతనిమాట నమ్మరు. ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోతాడు. అసలు యువరాజు ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీరయువకుడు రక్షించి తనుండే సత్రానికి తీసుకుపోతాడు. స్వతంత్రలో ఇరువురూ భోజనం ఆరగించి మర్నాడు మధ్యాహ్నం దాకా విశ్రాంతి తీసుకుంటారు. తరవాత మైల్స్ హెండన్ బాలరాజు నిద్రపోతుండగానే లేచి అతనికి మంచి దుస్తులు కొనుక్కురావడానికని బజారుకు వెడతాడు. తిరిగి వచ్చి చూసేసరికి బాలరాజు ఉండడు. తాగుబోతు జాన్ కాంటీ చేతుల్లో అతడు పడినట్లు తెలుస్తుంది. మైల్స్ హెండన్ బాలరాజును అన్వేషించే నిమిత్తం బయలుదేరతాడు. ఇక చదవండి.

## 17

బాలరాజును అన్వేషించడానికి మైల్స్ హెండన్ బయల్దేరిన అదే రోజు తెల్లవారుఝామున టామ్ కాంటీ రాజభవనంలో హంసతూలికా తల్పాలమీద సుఖస్వప్నాలు అంతమై నిద్రలేచాడు. ఇంకా కంటూ నిద్రిస్తున్నాడు కల. చీకటిగానే వుంది.

అనువాదం




నండూరి రామమోహనరావు

"హా, నాన్! బెట్! ఎక్కడ మీరు? ఇంకా చెత్తపరుపుల మీదే దొర్లుతున్నారా? ఇటు

రండి ఎంతమంచి కల వచ్చిందో నాకు? బలే తమాషాకల! నాన్! బెట్!" అని పిలిచాడు

ఆ చీకట్లో టామ్‌కాంటీ ఒక వ్యక్తి తన మంచం పక్కన నుంచుని ఉండటం చూశాడు

"ఏం సెలవు మహారాజా!" అని ఆ వ్యక్తి వినయంగా అడిగాడు

"మహారాజునా నేను ఓ, అంతా తెలిసింది, తెలిసింది ఇది కల కాదన్నమాట ఎంత దురదృష్టవంతుణ్ణి. ఎవరు నువ్వు? . నువ్వెవరివైతేనేం? అసలు నేనెవర్ని?"

"తమరా? నిన్నటివరకూ తమరు వేల్సు యువరాజులు నేటినుండీ ఇంగ్లండు సార్వభౌములైన ఎడ్వర్డు ప్రభువులు"

టామ్ తలగడల మధ్య తల దాచుకుని బరువుగా నిట్టూర్పులు విడుస్తూ,

"అది కల కాదన్నమాట కలే అయితే ఎంత బావుండేది? నువ్వీక పోవచ్చు." అన్నాడు. మళ్లీ నిద్రలో మునిగిపోయాడు ఇంకో కల వచ్చింది· ఒక పచ్చని మైదానంలో టామ్‌కాంటీ ఒక్కడే ఆడుకుంటున్నాడు అతనిచుట్టూ లేళ్లు, కుందేళ్లు, జింకలు ఉల్లాసంగా పరుగెత్తుతున్నాయి అతడు పిల్లంగోరు ఊదుతూ తన్మయుడై వున్నాడు. ఇంతలో పన్నెండంగుళాలకంటే ఎత్తులేని ఒక మరుగుజ్జు ప్రత్యక్షమయ్యాడు ఒక చెట్టు చూపించి దాని మొదట్లో పిల్లంగోరుతో తవ్వమని చెప్పాడు టామ్‌కాంటీ అలాగే తవ్వాడు గలగల్లాడుతూ పన్నెండు పెన్నీలు బయటపడ్డాయి ఈ అపారధనం చూసి టామ్ సంతోషం పట్టలేకపోయాడు. మరుగుజ్జు ఇంకా ఇలా చెప్పాడు

"నేను నిన్నెరుగుదును నువ్వు చాలా బుద్ధిమంతుడివి. ప్రతి ఆదివారం నాడూ ఇక్కడ తవ్వు పన్నెండు పెన్నీలు నీకు దొరుకుతాయి యీ రహస్యం ఎవరికీ చెప్పకు"

టామ్ పన్నెండు పెన్నీలు మోగించుకుంటూ ఆఫల్ కోర్టుకు వచ్చాడు. 'ప్రతిరాత్రీ మా నాన్నకో పెన్నీ ఇస్తాను. దాంతో వాడి బాధ వదిలిపోతుంది నాకు చదువు చెప్పే ఫాదర్ ఆండ్రూకు వారానికో పెన్నీ జీతమిస్తాను. మిగతా నాలుగు పెన్నీలు మా అమ్మకీ, నాన్, బెట్‌లకీ యిస్తాను. మా దరిద్రం వదలిపోతుంది రోజూ కడుపునిండా మెక్కి హాయిగా వుంటాము," అనుకున్నాడు తనలో తను ఇంటికి రాగానే తల్లిని పిలిచి పన్నెండు పెన్నీలు చేతిలో పోశాడు.

"ఇదిగో మన డబ్బు ఇందులో నాలుగు పెన్నీలు మీరు తీసుకోండి ఇది దొంగలించి గాని, బిచ్చమెత్తి గాని తెచ్చిన డబ్బుకాదు గౌరవంగా చెమటోడ్చి సంపాదించిన డబ్బు," అని చెప్పాడు.

ఇంత డబ్బు చూసి టామ్ తల్లి తనకళ్లు తనే నమ్మలేకపోయింది. టామ్‌ను సంతోషంతో పొదివిపట్టుకుని, అన్నది

"మహారాజా! బాగా పొద్దెక్కింది ఇక లేవరా?"

ఇదేమిటి వాళ్ళమ్మ ఇలా అంటుందేం? టామ్ కళ్లు తెరిచి చూశాడు ఎదురుగా నుంచున్నది వాళ్లమ్మకాదు కల అంతమైంది. కిటికీలగుండా వెచ్చని సూర్యకాంతి గదిలో బంగరుతివాసీలా పరుచుకుని వున్నది మంచంపక్కన శయ్యాగారప్రభువు మోకరించి వున్నాడు ఇంకా తను ఈ కారాగారంలోనే ఖైదీగావున్నట్టు గ్రహించాడు టామ్ "ఎప్పటికో నాకు విముక్తి?" అనుకుంటూ చుట్టూ చూశాడు. పొడుగాటి ఆ గదిలో టామ్‌శయ్యనుండి ద్వారందాకా వరసగా ప్రభువులు నుంచున్నారు టామ్ లేచి కూర్చుని పట్టుతెరలు వొత్తిగించాడు వెంటనే టామ్‌కు రాజోచిత సంస్కారాలు ప్రారంభమయినై.

ద్వారందగ్గిర నుంచున్న ప్రధాన సేవక ప్రభువుతో ప్రారంభమైంది కార్యక్రమం ఆయన ఒక చొక్కా రెండు చేతులా అందుకుని జంతుశాలప్రభువుకు అందించాడు ఆయన దాన్ని మహాబట్లరు ప్రభువుకందించాడు ఆయన శయ్యాగారపు అసిస్టెంటు ప్రభువుకు, ఆయన విండ్సర్ అరణ్యాధికారికి, ఆయన కోశాధ్యక్షుడికి, ఆయన వస్త్రశాఖా సేవక ప్రభువుకు, ఆయన సైన్యాధ్యక్షుడికి, ఆయన లండన్ గోపురాధికారికి, ఆయన అంతఃపుర ప్రధానాధికారికి, ఆయన బర్కిలే ప్రభువుకు, ఆయన నౌకాశాఖాధిపతికి, ఆయన కాంటర్బరీ ప్రధాన మతగురువుకు, ఆయన శయ్యాగార ప్రభువుకు అందించాడు. శయ్యాగార ప్రభువు చొక్కా నందుకుని

టామ్‌కు తొడిగాడు. ఈ తతంగమంతా చూసి టామ్ విస్తుపోతూ చొక్కా తొడిగించుకున్నాడు.

టామ్‌కు తొడగబడిన రాజ దుస్తుల్లో ప్రతిఒక్కటీ ఈ సుదీర్ఘ పంక్తిలోంచి అంచెలంచలుగా టామ్‌శరీరాన్ని చేరుకున్నది ఈ దీర్ఘ కార్యక్రమంతో మనఖైదీకి నడుం నెప్పెట్టింది, కాళ్లు లాగడం మొదలెట్టాయి. కాని అది రాజ సంప్రదాయం దాన్ని టామ్‌కోసమని ఈ రోజున మార్చుకోమంటే ఎల్లా కుదురుతుంది?

తొడగవలసిన దుస్తుల్లో ఆఖరివైన మఖమల్ బూట్లు తమ దీర్ఘ ప్రయాణం సాగించాయి. ఎలాగైతేనేం అవి శయ్యాగార ప్రభువును చేరుకున్నాయి. ఆయన ఒక్కసారి వాటిని పరీక్షగా చూశాడు ఆయన ముఖంలో కోపం ప్రజ్వలించింది బూట్లను తిరిగి కాంటర్బరీ ప్రధాన మతగురువు కందించి,

"చూడండి, ప్రభూ!" అన్నాడు. మతగురువుముఖం కందగడ్డలా ఎర్రబడింది ఆయన వాటిని నౌకా శాఖాధిపతి కందించి "చూడండి ప్రభూ!" అన్నాడు. ఆయనముఖం మంచులా పాలిపోయింది. "చూడండి ప్రభూ!" అని ఆయన అనే లోపుగానే బర్కిలే ప్రభువు అందుకున్నాడు. ఆయనముఖం నల్లని బొగ్గులా మాడిపోయింది. బూట్లు అందుకుని అంతఃపుర ప్రధానాధికారి ఆముదం తాగినముఖం పెట్టాడు, లండన్ గోపురాధికారిముఖం తుమ్మల్లో పొద్దుగూకినట్టయింది. ఈ విధంగా బూట్లు తిరుగుప్రయాణం సాగించి ప్రధాన సేవకప్రభువును చేరుకున్నాయి ఆయన 'ఏమిటీ ఈ గందరగోళమంతా' అని కంగారు పడుతూ బూట్లు పరిశీలించి చూశాడు ఒక బూటుకు బిగించే తాడు లేదు. ఇదీ ఈ గందరగోళానికి కారణం. కొత్త బూట్లు తేవడానికి ఒక సేవకుడు పరుగెత్తుకుపోయాడు. ప్రధాన సేవక ప్రభువు జంతుశాలప్రభువు చెవిలో రహస్యంగా అన్నాడు: "ఇంత గొప్ప నేరం చేసినందుకు బూట్ల శాఖాధికారికి యావజ్జీవ ఖైదు శిక్ష పడక తప్పదు"

మొత్తానికి, అంటే, ఎట్టకేలకు, కొత్త బూట్లు రావటం, టామ్‌కాళ్లకి అవి తొడగబడటం, అతడు మంచం దిగి నుంచోటానికి తగిన పరిస్థితికి చేరుకోవటం మొదలైన వ్యవహారమంతా సజావుగానే జరిగిపోయింది. ఒక ప్రభువు నీళ్లు పోశాడు; మరొక ప్రభువు టామ్ ముఖం కడిగాడు, ఇంకొకడు తువ్వాలుతో తుడిచాడు కాలక్రమాన టామ్ తల దువ్వించుకొనటానికి సిద్ధం చేయబడ్డాడు ఆపనికూడా పూర్తయింది. ఈ అలంకారాలన్నిటితోనూ టామ్ కొత్తగా ఈడొచ్చిన ఆడపిల్లలా అందంగా తయారయ్యాడు తరవాత భోజనశాలకు తీసుకుపోబడ్డాడు.

ప్రాతఃకాల భోజనం పూర్తయ్యాక టామ్‌ను దర్బారుకు తీసుకుపోయారు. అతనికి అటూ, ఇటూ వెనకాల, విచ్చుకత్తులు ధరించిన యాభైమంది సైనికులు నడిచారు. దర్బారులోని ఉన్నత సింహాసనం మీద టామ్ కూర్చోపెట్టబడ్డాడు. అక్కడ రాజ్యపరిపాలనకు, సంబంధించిన కొన్ని చిల్లర వ్యవహారాలు జరగవలసి వున్నాయి. మహారాజు మేనమామమైన హెర్ట్‌ఫర్డు ప్రభువు అవసరమైనప్పుడల్లా సలహా లివ్వడానికి సిద్ధంగా టామ్ ప్రక్కన చేతులు కట్టుకుని నుంచున్నాడు

హెన్రీ మహారాజు చనిపోయేముందు తన కుమారుడికి రాజ్యపాలనలో సహాయం చేసేందుకుగాను ఒక మంత్రివర్గాన్ని ఏర్పరిచాడు వారందరూ దర్బారులో ప్రవేశించి టామ్‌కు నమస్కరించి నుంచున్నారు ఈ మంత్రివర్గానికి నాయకుడు కాంటర్బరీ ప్రధాన మతగురువు. ఆయన మంత్రివర్గంలోని సభ్యుల పేర్లు చదివి వినిపించాడు వాటిలో హెర్ట్‌ఫర్డు పభువు, సెంటుజాన్ ప్రభువు మొదలైన ప్రముఖులపేర్లున్నాయి ఈ మంత్రివర్గం గాక బాలరాజుకు ఒక "రక్షకుడు" కూడా అవసరమైవున్నాడు కాని హెన్రీ రక్షకుని నియమించకుండానే ప్రాణాలు వదిలాడు

కాంటర్బరీ మతగురువు ఏవో కాయితాలు చదువుకుపోతున్నాడు. అవన్నీ రాజ్యపాలనకు సంబంధించిన క్లిష్టవ్యవహారాలు. అవి టామ్‌బుర్రలోకి ప్రవేశించటానికి ఎన్నో ప్రయత్నాలు చేశాయిగాని లాభంలేకపోయింది. మతగురువు చదువుతున్న విషయాల్లోకల్లా ఒక్కటే బ్రహ్మాండ

మైన సమస్య అతన్ని జలగలావట్టుకుంది. హెర్ట్‌ఫర్డును పిలిచి టామ్ రహస్యంగా అడిగాడు.

"మహారాజుకు అంత్యక్రియలు జరిగేది ఎప్పుడు?"

"వచ్చేనెల 16 వ తారీకున మహారాజా!"

"తమాషాగా వుందే! ఇన్ని రోజులదాకా శవం కుళ్లిపోకుండా ఉంటుందా?"

పాపం టామ్ కేం తెలుసు రాజ సంప్రదాయాలు? ఆఫల్ కోర్టులో దిక్కూ మొక్కూ లేక చచ్చిపోయినవాళ్లని నిమిషాల్లో బరబర అవతల కీడ్చెయ్యటంమాత్రమే అతనెరుగును. మరి రాజ కుటుంబాల్లో అలా కాదు. మరణించినతర్వాత ఎన్ని రోజులవరకైనా సరే శవం చెడిపోకుండా చేసే ఉపాయాలు అవలంబించి నిలవఉంచుతారు

ఈ లోగా ప్రభుత్వ కార్యదర్శి ఒకడు వచ్చి మర్నాడు 11 గంటలకి, ఇతర దేశాల రాయబారులు వచ్చి మహారాజుదర్శనం చేసుకోగోరుతున్నారని విన్నవించాడు. వాళ్లకి తన్ను చూడవలసిన అవసరమేమిటో టామ్ కర్థం కాలేదు. హెర్ట్‌ఫర్డు వివరించి చెప్పాడు: "తమరు అలాగేనని సెలవివ్వండి ఇంగ్లండుదేశానికి, రాజకుటుంబానికి గొప్పదుఖం సంభవించిందిగదా! అందుచేత తమతమ దేశాలతరఫున సానుభూతి తెలపడానికి రాయబారులు రాగోరుతున్నారు.''

టామ్ సరేనన్నట్టు తల ఊగించాడు

మరొక కార్యదర్శి వచ్చాడు. అతడు గత 6 నెలల్లోను రాజకుటుంబానికి అయిన ఖర్చుల పద్దు తీసుకొచ్చాడు. ఆరునెలలకి 28 వేల పౌనులు (దాదాపు 4 లక్షలరూ లు) ఖర్చయిందని వినగానే టామ్‌కి మూర్ఛ వచ్చినంత పని అయింది అంతపెద్దమొత్తాన్ని టామ్ జన్మలో ఎప్పుడూ చూడలేదుసరిగదా, చెవులతో విననైనా లేదు. ఇందులో 20 వేల పౌనులు ఇంకా తీర్చలేదని వినగానే అతనికి మళ్లీ గుండె ఆగినంత పని అయింది ఇంతే కాదు, ప్రభుత్వ కోశాగారంలో పెన్నీ కూడా నిలవలేదని, రాజభవనానికి చెందిన 1200 మంది సేవకులకు జీతాలు ముట్టలేదని, వారందరు ఇబ్బందిపడుతున్నారని కూడా ఖజానాకార్యదర్శి మనవిచేశాడు టామ్ గొంతుక పిగుల్చుకుని అన్నాడు.

"ఇలాగైతే మనం కొద్దిరోజుల్లో కుక్కలకంటె కనాకష్టంగా జీవించవలసివస్తుంది ఈ ఇంటి యజమానులు మన్ని వెళ్లగొట్టేస్తారు కనుక ముందుగానే జాగ్రత్తపడటం ఎందుకైనా మంచిది చిన్న ఇల్లొకటి అద్దెకు తీసుకుందాం. సేవకులందర్నీ పంపించేద్దాం ఈ సేవకులుండటంమూలాన పనులు ఆలస్యం కావటం తప్ప మనకి మరేలాభమూ లేదు. ప్రతిపనికీ అడ్డం వస్తారు, ఏ పనీ మనంతట మన్ని చేసుకోనివ్వరు బిల్లింగ్స్ గేటువద్ద చేపల మార్కెట్టుందే, దాని కెదురుగా ఒక చిన్న ఇల్లుంది. అది తీసుకోవటం మంచిదనుకుంటాను—

హెర్ట్‌ఫర్డుప్రభువు టామ్ బుజాన్ని నొక్కి— ఈ పిచ్చివాగుడు నాపకపోతే, అతడింకా ఎందాకా పోయేవాడో తెలియదు. అయితే కొత్త "రాజు" పిచ్చివాడయ్యాడని అక్కడ అందరికీ ముందే తెలుసు గనక ఎవరూ ఆశ్చర్యం ప్రకటించలేదు.

ఇంకో కార్యదర్శి వచ్చి కీర్తిశేషుడైన మహారాజుగారి వీలునామా చదివి వినిపించాడు. అందులో విషయాలు· హెర్ట్‌ఫర్డు ప్రభువుకు "డ్యూక్" (సామంతుడు) పదవి ఇవ్వాలి, ఆయన తమ్ముడైన సర్ థామస్ సేమూర్‌ను, కొడుకును జమీందార్లను చెయ్యాలి. అలాగే రాజ్యంలోని కొందరు ఉన్నతాధికార్లకు పెద్ద పదవు లివ్వాలి

టామ్ ఇదంతా సావధానంగా వింటున్నాడు. "పాత బాకీలు తీర్చేసింతర్వాత మిగతా విషయాలు చూసుకోవచ్చుగా," అని హెర్ట్‌ఫర్డ్ చెవిలో చెప్పాడు. కాని హెర్ట్‌ఫర్డు

"మీరు మాట్లాడకుండా వూరుకోండి అన్నిటికీ సరేననండి," అని సలహా యిచ్చాడు.

టామ్‌కు బాగా ఆశ్చర్యం కలిగించిన విషయమేమిటంటే తాను పెదవి కదల్చనైనా అక్కరలేకుండా తల వూగిస్తే చాలు, కింది అధికారులు పై పదవుల్లోకి, పై అధికారులు ఇంకా పై పదవుల్లోకి పోతారు. ఇంత గొప్ప మహిమ తన కున్నందుకు అతని ఆశ్చర్య, సంతోషాలకు మేరలేదు. అతనికో మంచి ఆలో

చన తట్టింది. తన తల్లిని ఆఫల్ కోర్టు జమీందారిణిగా చేస్తే? కాని తను కేవలం నిమిత్తమాత్రుడు ఈ ప్రభువుల, మంత్రుల చేతిలో తను కీలుబొమ్మ. వాళ్లెలా ఆడిస్తే అలా ఆడాలి వాళ్లు తనమాట వింటారా?

ఈ విధంగా చాలాసేపు రాజ్య వ్యవహారాలు జరిగాయి అంతా మందకొడిగా వుంది. తనకు సంబంధం లేని అయోమయ విషయాలు విని విని, టామ్ బుర్ర వేడెక్కింది. చెప్పలేని విసుగు పుట్టింది. "నేనేం పాపం చేశానని దేవుడు నన్ను రాజు చేశాడు. హాయిగా ఎంతలో ఎండుతూ, వానలో నానుతూ, బురదలో దొర్లేవాడికి నాకీ ఖర్మఏమిటి?" అని చింతించాడు. ఈ చింతతో అలిసిపోయి సింహాసనంమీదనే కునికిపాట్లు పడసాగాడు చివరికి చల్లగా నిద్రపోయాడు దాంతో సామ్రాజ్య వ్యవహారాలన్నీ ఎక్కడివక్కడ స్తంభించిపోయాయి. నిద్రపోయే ఆ పసివాణ్ణి అందరు మౌనంగా చూస్తూ నేలలో పాతుకుపొయ్యారు.

పది పదకొండు గంటలవేళ యువరాణి ఎలిజబెత్, జేన్ గ్రేలు టామ్‌ను పరామర్శ చెయ్యటానికి వచ్చారు. ఆ తరవాత పెద్దయువరాణి మేరీ వచ్చి కాస్సేపు మాట్లాడి పోయింది. మేరీ అక్కడ కూర్చున్నంతసేపూ టామ్‌కు ముళ్లమీమున్నట్టేవుంది ఎందుకంటే యువరాణి మేరీ చిరచిరస్వభావం గలది, ఆవిడ నవ్వుతుండగా మనుష్యమాత్రు డెవరూ చూసి ఎరగడు, ఈమెగారే ఎడ్వర్డు తరవాత రాజ్యానికి వచ్చి అనేక వందలమంది ప్రొటెస్టెంటు మతస్థులను మంటల్లో కాల్పించి చరిత్రలో ప్రసిద్ధికెక్కింది.

పరామర్శకు వచ్చినవారంతా వెళ్లిపోగానే టామ్ "అమ్మయ్యా" అనుకుని నడుం వాల్చాడు కాని ఇంతలో ఒక పన్నెండేళ్లకుర్రాడు దర్శనంకోసం వచ్చాడు. బక్కపలచగా వున్నాడు; నల్లటి దుస్తులు వేసుకున్నాడు, జంకుతూ జంకుతూ వచ్చి టామ్ ఎదట మోకరించి తలవంచాడు.

"ఎవరు నువ్వు? ఏం పని?"

"మరిచిపోయారా మహాప్రభూ! నేనేనండి, నేనే"

"నువ్వంటే? నిన్నెప్పుడూ చూసినట్టు గుర్తులేదే?"

"నను 'దెబ్బలబ్బాయి' నండి."

"నా దెబ్బలబ్బాయివా?"

"అవును మహారాజా! నా పేరు హాంఫ్రీమార్లో"

టామ్‌కు పెద్దసమస్యే వచ్చిపడింది ఈ 'దెబ్బలబ్బాయి' ఎవరై ఉంటాడో ఎంత ఊహించినా తోచడంలేదు ఏమిటి చేయడం? 'ఒహో నువ్వా?' అంటే కాని తరవాత వాడు చెప్పేదొక్కటీ అర్థంకాక తెల్లపోవలిసివస్తుంది. ఈ పరిస్థితిలో ఏం చెయ్యాలి? ఆఁ. బలే ఉపాయం తట్టింది. ఇకముందు కూడా ఇలాంటి కొత్తవాళ్లు తరుచు తటస్థపడేట్టున్నారు. మాట అందించేందుకు హెర్ట్‌ఫర్డు, సెంట్‌జాన్ ప్రభువులు కూడా దగ్గిర్లోలేరు, వాళ్లు మంత్రివర్గంలో సభ్యులుకనక రాజకార్యాల్లో మునిగివున్నారు ఇక తనకి సహాయం చేసే దెవరు? ఈ కొత్త కుర్రవాడి ద్వారా అన్నింటికీ కూపీలు లాగగలిగితే చాలామటుకు చిక్కు తీరిపోతుంది. ఆఁ. అదే మంచిది. వీడి ద్వారానే కావలసిన సమాచారమంతా లాగాలి. ఇంత మంచి ఆలోచన తట్టినందుకు తన్ను తనే మెచ్చుకున్నాడు. కొత్త కుర్రవాణ్ణి ఎగాదిగా చూసి,

"ఆఁ. కొద్దిగా జ్ఞాపకం వస్తోంది. నువ్వు—నువ్వు—ఊహు. అంత బాగా జ్ఞాపకం రావడంలేదు. కొద్దిగా అందిస్తే జ్ఞాపకం వస్తుందేమో చూస్తాను ఏదీ మళ్లీ చెప్పు ను వెవ్వరివో?"

"చిత్తం మహారాజా! రెండు రోజులకిందట తమరు గ్రీకుపాఠం అప్పజెప్పడంలో మూడుసార్లు తప్పులొచ్చాయి జ్ఞాపకం ఉన్నది కదండి"

"ఆఁ అవును ఇప్పుడిప్పుడు అవన్నీ గుర్తుకొస్తున్నాయి. (తనలో ఏడిసినట్టుంది, నేను గ్రీకుపాఠం అప్పజెప్పడమేమిటి, వీడి తలకాయ నేనే గ్రీకుపాఠం అప్పజెప్పేట్టుంటే మూడుకాదు ముప్ఫయి తప్పులొస్తాయి) సరే. తరవాతేమయింది?"

"మీకు పాఠం సరిగా రానందుకు మేష్టారికి కోపం వచ్చింది. అందుచేత ఈరోజున నన్ను బాగా చితకగొడతానని కూడా అన్నారు"

"నిన్నా? పాఠం రానిది నాకైతే నిన్నెందుకు కొట్టడం?" అని టామ్ అత్యంతవిస్మయంతో అడిగాడు

"తమరు మళ్లీ మరిచిపోతున్నారు మీకు పాఠాలు రానప్పు

డల్లా ఆయన నన్ను కొడుతూ వుంటారు."

"ఆc. ఆc. అవును. నాకు పాఠాలు నేర్పేది నువ్వేగా. నాకు పాఠం రాకపోతే నువ్వు సరిగా నేర్పటం లేదని ఆయన కొడుతూ వుంటారు—"

"మహారాజా! అలా అంటారేమిటి? నేను తమకు పాఠాలు నేర్పుతానా? నేను తమ సేవకుల్లో హీనాతిహీనుణ్ణి. నేను తమకు ఉపదేశించేవాడినా? మళ్లీ పొరబాటు పడుతున్నారు"

"ఏమిటయ్యా ఈ గొడవంతా? నాకేం అర్థంకావడంలేదు మరి నిన్నెందుకు కొడతాడు మేష్టారు? పిచ్చెక్కిందినాకా నీకా? చెప్పు. నాకు పాఠం రాకపోతే నిన్నెందుకు కొడతాడు?"

"మహారాజా! తమకు మన స్థిమితం లేనందున ఇంత చిన్న సంగతి మరిచిపోయారు. వేల్సు యువరాజు పవిత్ర శరీరాన్ని ఎవరూ కొట్టరాదుగదా అందుచేత యువరాజు తప్పుచేసినప్పుడల్లా ఆయనబదులు నేను శిక్ష అనుభవిస్తూఉంటాను. ఇందులో దోషమేమీలేదు. అది నా ఉద్యోగం. యువరాజుబదులు నేను దెబ్బలు తినకపోతే నాకు జీవన మెలా గడుస్తుంది?"

ఈ వివరణతో టామ్ ఆశ్చర్యానికి పట్టపగ్గాలు లేవు. ఇలా గనుకున్నాడు: "రాజుల ఇళ్లలో ఆచారాలు ఎంత విచిత్రంగా వుంటాయి? తప్పుచేసిం దొకరైతే శిక్ష అనుభవించే దింకొకరు.—నాబదులు తలదువ్వించుకొనడానికి, నీళ్లు పోసుకుని బట్టలు తొడిగించుకోడానికి కూడా ఒక కుర్రవాణ్ణి ఏర్పాటుచేస్తే బావుండును. బతికిపోతాను, అంతేగాదు. అప్పుడెన్ని దెబ్బలు తినమన్నా సంతోషంగా తింటాను" తరవాత టామ్ దెబ్బలబ్బాయి నడిగాడు

"మరయితే మేష్టారివ్వాళ నిన్ను కొట్టారా?"

"లేదు మహారాజా! మన కందరికీ సంభవించిన ఈ మహాదుఃఖం గొడవలో మేష్టారి సంగతి ఇప్పటిదాకా మరిచిపోయినట్టున్నారు. పైగా మీరు ఆరోజున నాతో అన్నారుకూడా, నన్ను కొట్టకుండా ఆజ్ఞాపిస్తామని. ఆ విషయం జ్ఞాపకం చేద్దామనే ఇలా వచ్చాను"

"అవును అంతా జ్ఞాపకం వస్తోంది. నీ వీపుకేమీ ప్రమాదం రాకుండా చూసే పూచీ నాది"

దెబ్బలబ్బాయి సంతోషం పట్టలేకపోయాడు తనకు దెబ్బలు తప్పగలవని. మోకరించి అన్నాడు'

"మహారాజా! మీఋణం తీర్చుకోలేను కాని మరొకచిన్న మనవి ఉన్నది ప్రభూ!"

"ఏమిటది?" టామ్ ప్రసన్నుడై అడిగాడు.

"తమ రిప్పుడు వేల్సు యువరాజులు కారు. తమ తండ్రిగారు కాలధర్మం చెందడంతో మహారాజులయ్యారు. తమ మాటకు ఈ రాజ్యంలో ఎదురాడేవాడు లేడు ఇదివరకు తమరు తండ్రిగారి బలవంతంమీద చదివేవారు. ఇక ముందు మీ ఇష్టారాజ్యంకనక తమరు పుస్తకాలన్నీ తగల బెట్టెయ్యొచ్చు. చదువు మానివెయ్యవచ్చు. అటువంటి సందర్భంలో నేను సర్వనాశనమైపోతాను నాతోపాటు నా చెల్లెళ్లుకూడా—"

"సర్వనాశనమైపోతావా? ఎల్లా?"

"తమ రెరగని దేమున్నది మహారాజా! నా వీపే నా జీవనాధారం. నా వీపుకు పనిలేకపోతే నా నోట దుమ్మే. తమరు చదువు మానేస్తే, 'దెబ్బలబ్బాయి' ఒకడు ఉండవలసిన అవసరం పోతుంది. అప్పుడు నా ఉద్యోగం ఊడిపోతుంది. ."

దెబ్బలబ్బాయి విచారం చూసి టామ్ కూడా ఎంతో ఇదయ్యాడు.

"నువ్వేం బెంగపడకబ్బాయ్! నీ ఉద్యోగాన్ని నీకూ, నీ సంతతి వాళ్లకూ శాశ్వతం చేస్తున్నాను—" అంటూ టామ్ కత్తిని ఆ కుర్రవాడి బుజానికి ఆనించాడు. "లేవోయ్ హంఫ్రీ మార్లో! నువ్వికనుండీ ఇంగ్లండు రాజకుటుంబానికి వంశానుగత దెబ్బలప్రభువువి. విచారపడకు నేను చదువు మానెయ్యను నీ వీపుకి ప్రతిరోజూ పని ఉండేలాగ, తద్వారా నీ జీతం మూడింతలయ్యేలాగ చదువుతాను. సరేనా?"

హంఫ్రీ కళ్లు కృతజ్ఞతతో ప్రకాశించాయి

"ధన్యుణ్ణి మహారాజా! మీ ఔదార్యఋణం తీర్చుకోలేను. ఇక

నాకూ, మార్లోవంశానికీ శాశ్వతంగా భోజనసమస్య తీరిపోయింది ”

తరవాత చాలసేపు టామ్ కాంటీకి, హంఫ్రీమార్లోకిసంభాషణ జరిగింది. టామ్ తెలివైనవాడుగనక ఆ ట్టేపార బాట్లు రాకుండానే మొత్తానికి బోలేడు సమాచారం లాగాడు. రాజభవనంలో ఎవరెవరో, ఎప్పుడు ఏ పని చెయ్యాలో, ఎలా సంచరించాలో మొదలైన అమూల్యమైన భోగట్టా చాలా సంపాదించాడు ప్రతిరోజూ హంఫ్రీ మార్లోవద్ద కొంతసేపు శిష్యరికం చెయ్యాలని అన్నిసంగతులూ పూర్తిగా నేర్చుకోవాలని టామ్ నిశ్చయించుకున్నాడు హంఫ్రీ తన దగ్గరకు రావాలని కోరినప్పుడల్లా రానిచ్చేటట్లు సేవకులకు కట్టడి చేశాడు.

హంఫ్రీ నిష్క్రమించగానే హెర్ట్‌ఫర్డ్‌ప్రభువు యమకింకరుడులా ప్రవేశించాడు బాలరాజు మతిస్థిరం తప్పిందని ప్రజలనుమానిస్తే ఆ సంగతి రాజద్రోహులకు తెలిస్తే కొన్ని అపాయాలు సంభవించవచ్చుననీ, అటాంటి అనుమానాలు రాకుండా చెయ్యాలంటే బాలరాజు అడపా తడపా నలుగురి మధ్యకూ వస్తూ పోతూ వుండాలనీ, జాగ్రత్తగామసులుకోవాలనీ హెర్ట్‌ఫర్డ్ ప్రభువు చెప్పాడు అందుకోసమని బాలరాజు ఇంకా రెండు మూడు రోజులాగి, ప్రతిరోజూ బహిరంగంగా భోజనమారగించాలనీ, నడకలోనూ, మాటలోనూ మరి కొంచెం రాజఠీవి చూపిస్తే ఎటువంటి అనుమానాలకూ తావుండదనీ ఆయన చెప్పాడు

తరవాత ఏ సందర్భంలో ఎలా ప్రవర్తించాలో, ఎవరిపట్ల ఏయే మర్యాదలు ప్రదర్శించాలో హెర్ట్‌ఫర్డ్‌ప్రభువు టామ్‌కు “జ్ఞాపకం చెయ్యడం” ప్రారంభించాడు కాని టామ్ ఈ విషయాలు చాలామటుకు హంఫ్రీమార్లోనుంచి ఇదివరకే నేర్చుకొని ఉండడంమూలాన అతడు మాటిమాటికీ “ఈ సంగతి నాకిదివరకే తెలుసు, ఆ సంగతి కూడా తెలుసు, అదీ తెలుసు,” అని అడ్డం వచ్చాడు మహారాజు ఆరోగ్యం బాగుపడుతున్న సూచనలు కనిపిస్తున్నందుకు హెర్ట్‌ఫర్డ్ ప్రభువు సంతోషించాడు హంఫ్రీమార్లోనుంచి ఈ భోగట్టా అంతా టామ్ సేకరించినట్టు ఆయనకేం తెలుసు? అందుచేత మహారాజుకు మరొక ముఖ్యవిషయం కూడా జ్ఞాపకం వచ్చిందో లేదో పరీక్షించడానికి హెర్ట్‌ఫర్డ్‌ప్రభువు నిశ్చయించాడు

“మహారాజుమనస్సు క్రమంగా కోలుకొంటున్నందుకు నేను దేవుడికి ధన్యవాదాలర్పిస్తున్నాను మీరు ఇంకొంచెం ప్రయత్నిస్తే మమ్మల్నందర్నీ కలవరపెడుతున్న మరో సమస్యకూడా తీరిపోతుంది రాజముద్ర ఏమైందో తెలియాక నిన్న ఎంత పెద్ద గొడవ జరిగిందో తమకు గుర్తున్నదిగదా! అది తమ తండ్రిగారి సంతకానికి చెందిన ముద్రకనుక ఈరోజునుంచీ దానితో అవసరంలేదు అయినప్పటికీ అది కనిపించక మేమందరం తల్లడిల్లుతున్నాము. దాన్ని తండ్రిగారినుంచి తమరే స్వయంగా తీసుకున్నారు ఎక్కడ పెట్టారో జ్ఞాపకం తెచ్చుకోవలసిందని నా విన్నపం ”

టామ్‌కు నట్టేట్లో మునగానాం, తేలానాం అన్నట్టుగా వుంది ఈ రాజపదవి అన్నీ చిక్కులే, అన్నీ సమస్యలే, అన్నీ కష్టాలే. ఆ దిక్కుమాలిన రాజముద్ర ఏమిటో టామ్ ఎప్పుడూ చూడలేదు, అసలది ఎలా వుంటుందో కూడా అతనికి తెలియదు ఒకక్షణం సందేహించి అమాయకంగా అడిగాడు•

“రాజముద్ర అంటే ఎలా ఉంటుంది? ఏం చేస్తారు దాంతో?”

హెర్ట్‌ఫర్డ్‌ప్రభువు ఈ సమాధానం విని కుంగిపోయాడు “మహారాజుమనస్సు బాగుపడుతోందని సంతసించాను ఇక ఒకటే బాగుపడడం పసిరాజుకు ఎంత కష్టం సంభవించింది!” అని లోపల అనుకున్నాడు నెమ్మదిగా విషయం తప్పించాడు. మిగతా రాజకీయ వ్యవహారాలేవో కాసేపు మాట్లాడాడు. తరవాత సెలవుతీసుకుని నిష్క్రమించాడు

★

(ఇంకావుంది)



అది సాయంత్రం సమయం ఓ వైపునుండి చల్లని పిల్లవాయువులు మెల్లగా వీస్తున్నాయి కుందేలమ్మ అప్పుడే హాయిగా ఆడుతూ పాడుతూ వస్తూంది షికారుకు ఇంతలోకే యెదురుగా ఒక బండా, దాని ప్రక్కనే ఒక ఎర్రని టోపీ పెట్టి వున్నాయి కుందేలమ్మని చూడంగానే బండ ఈలా అనింది "కుందేలమ్మా? కుందేలమ్మా? ఈ టోపీని కాస్త యెత్తి నా నెత్తిన పెట్టావంటే నీకు పుణ్యముంటుంది," అంది బండ ఎంతో ప్రాధేయపడుతూ

"పోనీలే పాపం, ఇంతగా బ్రతిమాలుకుంటే అది ఎత్తి పైనపెడితే నా చేతులు అరిగిపోతాయా," అని అనుకుంటూ కుందేలమ్మ అదియెత్తి బండపైన పెట్టి యధాప్రకారంగా మళ్ళీ ఆడుకుంటూ పాడుకుంటూ బయలుదేరింది షికారుకు ఇంతలోకే వెనకనుంచి ఏమిటో ధడధడ మనే శబ్దం వినిపించింది కుందేలమ్మ ఎవరు చెప్మా? అని వెనక్కు తిరిగి చూచింది ఇంకేముందీ? ఇందాకటి బండే తన్ను తరుముకొస్తోంది! తనేం నేరంచేసిందని దానికట్లా! అమ్మయ్యో? కాళ్ళకి బుద్ధిచెప్పింది పరిగెత్తుకుంటూపోయి వేపమ్మ దగ్గరికెళ్ళి మొరపెట్టుకుంది తనను ఆపదనుండి రక్షించమని-

"ఛా, ఛా, పో! మాకు ఇంక తలిమ్మా పనేమీ లేవనుకున్నావా? వెళ్ళు, వెళ్ళు," అంటూ కసరికొట్టింది వేపమ్మ "అయ్యో దేముడా, నాగతి ఇంతేనా?" అనుకుంటూ మళ్ళీ దౌడుతీసింది కుందేలమ్మ వెంటనే మామిడమ్మవద్దకి వెళ్ళి, 'మామిడమ్మా, మామిడమ్మా నన్ను ఓ బండ వెంటాడుతూంది దాన్నుండి నన్ను రక్షించి పుణ్యం కట్టుకో," అంది ప్రయాసతో

"పో పో, నీసంగతి నాకక్కర లేదు," అంది అంతా ప్రశాంతంగా విన్న మామిడమ్మ "నాగతి ఇంతేనా?" అనుకుంటూ గుర్రంవద్ద కెళ్ళి మొరపెట్టుకుంది కుందేలమ్మ "అమ్మయ్యో! అంతపెద్ద బండనుంచేమిటి, నిన్ను రక్షించేదేమిటి?" అంటూ ఎగిరిపడింది మహాగర్వంగా గుర్రం పాపం కుందేలమ్మకి ముందర తన కర్తవ్యం ఏమిటో పాలుపోయిందికాదు

ముందర కుందేలూ వెనక బండా సాగిపోతున్నాయి ఇంతలోకే ఎక్కడనుండో ఒక జిత్తులమారి నక్క ఎదురుగా ప్రత్యక్షమయింది వీరిద్దరి వింత హడావిడి చూచేటప్పటికీ నక్కకు ఎక్కడలేని ఆశ్చర్యమేసింది

"ఆగండర్రా? ఆగండి," అంటూ ఇద్దరినీ ఆపుచేసింది నక్క ఇద్దరినీ కొంచెం స్థిమితపడనిచ్చి, "ఏమిటి మీసంగతి" అని అడిగింది

"చూడు, ఈ భడవ బలవంతాన నా నెత్తిన ఇంత పెద్ద టోపీ యెత్తి కొట్టింది," అంటూ గుడ్లురిమి ఎగిరిపడింది బండ

"లేదు లేదు తాను పెట్టమంటేనే నేను మెల్లగా పెట్టాను," అంది కుందేలు ఓ వేడి నిట్టూర్పు విడుస్తూను

దాంతో నక్కకు అంతా అర్థమయింది "సరేకానీ, ఓయ్ కుందేలా? అసలు నీవు టోపీ మొదట ఎట్లా చూచావో అట్లా పెట్టు" అనింది నక్క ఆ సమయం కోసమే యెదురు చూస్తూన్న కుందే



# బంగారు పంజరం

శ్రీ సిద్ధాంతి మల్లికార్జునం

మన దేశానికి తూర్పున సయాం దేశంవుంది ఆ దేశపు రాజుకు తొమ్మిమంది కుమార్తెలుండేవారు వాళ్ళందరిలోకీ చిన్నకూతురు చాలా అందగత్తె అందరికంటె చిన్నది కాబట్టి ఆమెకు "చిన్న" అనేపేరు పెట్టుకున్నారు

చిన్న చాలా చక్కనిదే కాకుండా చాలా మంచిదికూడా! కాని ఆమె అక్కలందరు ఏవేవో పేర్లుపెట్టి ఆమెను వెక్కిరిస్తూ, అల్లరి చేస్తుండేవారు

సయాం దేశపురాజు ఏటేటా తన పుట్టినరోజు పండుగ చేసుకునేవాడు సాధారణంగా ఆనాడు ప్రజలందరు రాజుగారికి మంచిమంచి బహుమానాలు తెచ్చి యిస్తారు కాని ఈ రాజు అలాంటివేవీ తీసుకునేవాడు కాదు పైగా తన దగ్గరుండే వస్తువులన్నీ అందరికీ దానంచేస్తూండేవాడు

ఒకానొక సంవత్సరం రాజుదగ్గర వస్తువులేమీ లేకపోవడంవల్ల తన తొమ్మిదిమంది కుమార్తెలకి, తొమ్మిది బంగారు పంజరాలు, వాట్లలో తొమ్మిది చక్కని చిలుకలు పెట్టి బహుమానంయిచ్చాడు ఆ పిల్లలందరు ఆ చిలుకలనెంతో అల్లారుముద్దుగా పెంచుకుంటూ వాటికి మాట్లాడటం నేర్పారు కొన్ని పాటలు కూడా నేర్పారు అంతేనా! ఆ చిలుకలు చాలా భాషలు మాట్లాడటంకూడా నేర్చుకున్నాయి

ఇట్లావుండగా ఒకరోజు పొద్దునే తన చిలుకను చూడాలని చిన్న, పంజరం దగ్గరికొచ్చింది పాపం! ఏంచెప్పను! చక్కని చిలుక చచ్చిపోయింది! దానికోసం చిన్న ఎంతో ఏడ్చింది దాసీ లెంత ఓదార్చినా చిన్న ఏడుపు మానలేదు ఏమీ తోచక వాళ్ళుపోయి రాణిగారితో చెప్పారు రాణిగారికి కోపంవచ్చింది తనకూతురి చేష్టలకు చిలుక చస్తే యింతగా ఏడవ్వాలా? అని రాణి చాలా ఆశ్చర్యపడ్డది చిన్న ఒట్టి తెలివితక్కువ పెద్దమ్మ అనుకుంది ఆ రాత్రి అన్నం పెట్టకుండా చిన్నను పడుకోపెట్టమని ఆజ్ఞాపించింది దాసీలు అలాగే చేశారు

చిన్న పడుకుందేగాని నిద్రఎలా పడుతుంది తన ముద్దుల చిలుక మళ్ళీ వస్తుందా? అలాగే పరుపు మీద పడుకొని ఏడుస్తూంది చిన్న ఈ ఏడుపుతోడు కడుపులో ఆకలి ఎక్కువైంది మరి భోజనం ఎలా వస్తుంది?

ఇట్లా ఆలోచిస్తూండగా ఒక చిన్నపక్షి కిటికీలోగుండా దూరి ఆమె గదిలో కొచ్చింది దాన్ని చూచి చిన్న లేచి కూర్చుంది ఆ పక్షి అట్లా లోపలికి వచ్చి పాడటం ప్రారంభించింది ఎంత బాగుందని దానిపాట! దాని పాటవింటూ చిన్న ఆకలి మర్చిపోయింది ఏడుపు మానింది

"ఏపాట చాలా బాగుంది" అన్నది చిన్న ఆ పక్షితో

"అలాగా, సంతోషం

---

లమ్మ దాన్ని నెత్తి క్రింద పెట్టింది దాంతో కూడా బండ కాళ్లూ చేతులూ కట్టేసినట్లు పడిపోయింది

అప్పుడు కుందేలమ్మ సంతోషంతో నక్కకు ధన్యవాదాలు సమర్పించుతూ మళ్ళీ షికారుకు బయలుదేరింది 

అయితే.. నీచిలుక చనిపోయింది గదా, నన్ను నీదగ్గరుంచుకుంటావా రాజకుమారీ?. . నేను నీ చిలుకలాంటి అందగత్తెనుకాను కాకపోయినా, నాకు అంతకంటే మంచి గొంతు వుంది." ఈ మాటవిని చిన్న సంతోషంతో చప్పట్లు చరించింది.

తర్వాత ఆ పిట్ట చిన్న పరుపు మీదికొచ్చి మంచి పాట పాడి చిన్నను నిద్రపుచ్చింది

తెల్లగా తెల్లవారగానే చిన్న నిద్రలేచింది ఆపిట్ట వెంటనేచిన్నను హెచ్చరించింది ఇంతలో దాసీలు రాజకుమారికి భోజనం తెచ్చారు ఆ భోజనంలో కొంతభాగం ఆ పిట్ట నోట్లో పెట్టింది చిన్న పళ్లెంలోనే ఆపిట్ట స్నానంచేసింది ఆ పళ్లెంలో నీళ్లే చిన్న, ఆ పిట్ట తాగేశారు ఇదంతా చూచి దాసీలు ఎంతో ఆశ్చర్యపడ్డారు

భోజనం కాగానే ఆపిట్ట తిరిగీ పాడటం మొదలెట్టింది ఆ పాటవిని దాసీలు ముక్కుమీద వేలు వేసుకున్నారు అంత చక్కని పాట అంత తియ్యనికంఠం వాళ్లెక్కడా వినలేదు చిన్న చాలా గర్వపడ్డది అదంతా చూచి

"నిన్ను నా అక్కయ్యలందరికీ చూపిస్తాను రా" అని చిన్న తన చేతివేలు చూపించింది పిట్టకి చప్పున ఆవేలిమీద కూర్చుంది పిట్ట ఒక్కొక్క రాజకుమార్తెదగ్గరికి దీన్ని తీసుకెళ్లింది చిన్న ఒక్కొక్కరి దగ్గర ఒక్కొక్క పాటపాడింది పిట్ట దీనికెన్నో పాటలువచ్చు కాని చిలుకలన్నిటికీ ఒక్కటే ఒక పాట వచ్చు పైగా దీని గొంతు చాలా బాగుంటుంది.

రాజు, రాణిదగ్గరికూడా వెళ్లి యీ పిట్టను చూపెట్టింది చిన్న. వాళ్లు కూడా చాలా సంతోషించారు దానిపాటను చాలా మెచ్చుకున్నారు.

చిన్న రాజభవనంలో పాట పాడుతూ తిరుగుతూంటే యీ పిట్ట ఆమెవెంటనే పాడుకుంటూ తిరుగుతూండేది వీళ్లిద్దరి పాటలువిని సంతోషించనివారేలేరు—

చిన్న అక్కయ్యలకు మాత్రం యిదేమీ నచ్చలేదు వాళ్ల చిలుకలెందుకు పనికిరావడంలేదు యీ పిట్టముందు కొంత కాలం యిలాగే జరిగింది

ఒకనాడు చిన్న గదికి ఆమె అక్కయ్య లందరు వచ్చారు

"చిన్నా, పాపం నీచిలుక చచ్చిపోయింది ఎంత చక్కటిదే ఆచిలుక! చూడు, మాలాగే నీకు ఒక పెంపుడు చిలుక లేకపోవడం ఏమీ బాగాలేదే," అన్నది ఒకతె "చిన్నా, మేమందరం కలిసి మాదగ్గరుండే డబ్బుతో నీకో మంచి చిలుకను కొనిపెడతాం సరేనా" అన్నది మరొకతె

"నాకో పెంపుడుపక్షి వుందిగా నాకు చిలుక వద్దు ఏమీ వద్దు," అన్నది చిన్న

"మంచి దానివేనే, చిన్నా. ఊరికే వస్తూ పోతూండే ఆఅసహ్యపుదా నీ పెంపుడుపక్షి?" అన్న దొకతె

"సరే గాని, అసలా పక్షి ఎక్కడుంది?"

"తన మామగారింటికి ఒకనాటి వెళ్లొస్తానంది" అన్నది చిన్న

"అది మళ్ళీ వస్తుందని నమ్మకమేమిటే, చిన్నా?" అన్న దొకతె

"అదెప్పుడూ తిరిగి వస్తుంది" అన్నది చిన్న

"మంచిదే నీవు మాసలహా తీసుకుంటే నీకు నష్టంవుండదు. ఏమంటావా? అది తిరిగొచ్చాక చిన్నగా దాన్ని యీ పంజరంలో దాచేసెయ్ ఇక అదెక్కడికీ పోదు. సరేనా?" అన్నారు వాళ్లు

"నిజమేకాని అది నా గదిలో ఎగురుతూంటే నాకెంతో యిష్టమే.

"నీ మొహం. అదెప్పటికైనా మోసమే మనమే ముందు జాగ్రత్త పడాలి," అన్నారు కొందరు

ఈ మాటలు చెప్పినప్పటినుంచి దిగులుపడి కూర్చుంది ఆ పిట్ట యింకా రాలేదు అప్పటికే చాలా ఆలస్యమనిపించిం దామెకు . ఏమైయిందో పాపం దారిలోడేగలు, వేటగాళ్లు ఏం చేశారో!. లేక యింకెవరి దగ్గరికైనా వెళ్లిందేమో . తన సంగతే మరిచిపోయిందేమో . ఇలా అనుమాన మెక్కువైంది చిన్నకు చిన్న యిలా బాధ పడుతూండగా ఆమె చెవిదగ్గర ఏదో శబ్దమైంది వెనక్కి తిరిగి చూచింది ఎప్పుడొచ్చిందోగాని ఆ పిట్ట, చిన్న భుజంమీద కూర్చొనుంది.

"నివ్వేమైనావో అని నేను చాలా దిగులు పడ్డాను," అని చెప్పింది చిన్న.

"అవును ... నాకు తెలుసు ! సంగతి అసలు యివ్వాళ నేను వచ్చేదాన్నే కాదు. మా మామ

ఏదో విందుచేస్తూ నన్ను వుండమని ఎంతో బలవంతంచేశాడు .నేనుండ లేదు . నీవెలా వుంటావోనని రివ్వు రివ్వున ఎగురుతూ వచ్చాను," అని జవాబిచ్చింది పిట్ట

ఈ జవాబు వినేసరికి చిన్నకు అనుమానం, భయం జాస్తి అయినాయి ఇంతకూ తన అక్కయ్యలు చెప్పింది నిజమే దీని మాటలు బట్టి చూస్తే యీ పిట్ట చివరకు మోసం చేసేలాగే వుంది. ఇక మీద దీన్నిట్లాగే వదలకూడ దనుకొని ఆ పిట్టను చేతికి తీసికొని పంజరం దగ్గర కెళ్ళింది. అలా తీసుకొని పోవడం అలవాటే గనక ఆ పిట్ట ఏమీ అనుమానపడలేదు మెల్లిగా దాన్ని పంజరంలో పెట్టి తలుపు మూసేసింది. ఆ పిట్టకేమీ దిక్కు తోచలేదు యిదంతా చూస్తూంటే.

"ఏమటీ గమ్మత్తు?" అన్నదా పిట్ట

"గమ్మత్తు ఏమీలేదు రాత్రిళ్లు కొన్ని పిల్లులు వేటాడుతున్నాయి నీ విక్కడే హాయిగా వుండవచ్చు" అన్నది చిన్న.

"ఆ సంగతి నాకు ముందే ఎందుకు చెప్పలేదు? ఈ చోటు నాకు బాగాలేదు "

"నీకు ప్రమాదంవుందంటే నాకు రాత్రి అసలే నిద్రపట్టదు" అన్నది చిన్న.

"సరేలే .యీ సారికేం పరవా లేదులే పొద్దునే వదిలేస్తావుగా"అని ఆ పిట్ట తృప్తిపడ్డది

రాత్రికి కావలసిందేదో తిని, పాడటం మొదలెట్టిందా పిట్ట .. కాని సగంలోనే పాట ఆగిపోయింది

"చిన్నా ఏమిటోగాని ఇవ్వాళ పాడాలని లేదు నాకు "

"సరే ! నిద్రపో."

చిన్న యీ మాట చెప్పగానే రెక్కల్లో తల దూర్చి పిట్ట నిద్ర పోయింది

తెల్లవారుజామునే పిట్టలేచింది "చిన్నా లే లే తలుపుతీ యీ చల్లటి వేళప్పుడే నేను వెళ్ళి హాయిగా తిరిగి రావాలి .నన్ను బైటవదిలేసెయ్ "

"అక్కడే నీకు హాయిగా వుంది చూడు నీ బంగారు పంజరం ఎంత ముద్దొస్తూందో దీన్ని చేసిందెవరో తెలుసా? . ఈ రాజ్యంలో వుండే కంసాలి వాళ్లలోకి గొప్పవాడు. మా తండ్రి అతని పనితనాన్ని ఎంతో మెచ్చుకున్నాడు దీనంత మంచిదే మరొకటి చేస్తాడేమోనని ఆ కంసాలితల కొట్టించేశారు మా నాన్న . అంత మంచిది నీపంజరం" అన్నది చిన్న

"నన్ను వదులు, .వదులు, చిన్నా "

"నీకు మూడుపూటలా మంచి భోజనం పెడతారు మా దాసీలు. పొద్దునుంచీ సాయంత్రంవరకు నీకేమీ చీకూచింత లేదు నీయిష్టం వచ్చినట్లు పాడుకోవచ్చు . నీకింత కంటే ఏం కావాలో చెప్పు ఇంత సుఖంగా ఏ పిట్టయినా బతుకుతూందా?"

"నన్ను వదులు వదులు, చిన్నా" అని ఆపిట్ట కేకలుపెట్టింది కమ్ములగుండా తప్పుకోపోవాలని ప్రయత్నించింది. చేతకాలేదు తలుపు తట్టింది చాలాసేపు. ఎన్ని చేసినా ఆ పిట్ట పంజరంలోనే వుండి పోయింది.

చిన్న అక్కయ్యలందరు దాన్ని చూడాలని వచ్చారు తాముచెప్పిన పని చేసినందుకు చిన్నను మెచ్చుకున్నారు. త్వరలోనే యీ పిట్ట ఆ పంజరాని కలవాటుపడుతుందని . వెనకటి విషయమంతా మరచిపోతుందని చిన్నకు నొక్కి చెప్పారు. వాళ్లున్నంతసేపు ఆపిట్ట నోరుతెరవ లేదు. వాళ్లు పోగానే, "చిన్నా నన్ను వదులు " అని అరిచింది

"ఛీ ఛీ, ఎందు కట్లా మొత్తుకుంటావ్? నీ వంటే నా కెంతో యిష్టం అందుకే నిన్ను అక్కడ దాచుకున్నా. నీకు ఏది సుఖమో ఏది మంచిదో నాకే బాగా తెలుసు. చూడు.. మంచి పాట పాడు నీకు మిఠాయి పెడతాను," అని చెప్పింది రాజకుమారి.

పంజరంలో ఒకమూల వొదిగి కూర్చుని నీలాకాశం చూస్తూందే గాని ఆ పిట్ట ఆనాడు ఒక్కపాటైనా పాడలేదు

"ఎందుకట్లా దిక్కులు చూస్తూ కూర్చోడం? పాటలు పాడుకొని నీ కష్టాలన్నీ మరచిపోరాదూ?" అన్నది చిన్న ఆ పిట్టను చూచి

"నే నెట్లా పాడేది, చిన్నా? చెట్లు, చెరువులు, పొలాలు, చూడాలని నాకెంతో ఆశగావుంది "

"అలాగా . అయితే నిన్ను నాతో షికారు తీసుకెళ్తాలే

బంగారు పంజరాన్ని చేతపుచ్చుకొని చిన్న షికారు బైలుదేరింది చెరువు, దానిచుట్టూ పెరిగిన పూల

చెట్లు చూపించింది పొలాల దగ్గర కెళ్ళి నిల్చుంది చాలాసేపు.

"నిన్ను ప్రతిరోజూ యిలాగే షికారు తీసుకెళ్తాను. నీ మీద నాకెంతో ప్రేమ. నిన్ను సంతోష పెట్టాలనే యివన్నీ చేస్తున్నా" అని పిట్టతో చెప్పింది చిన్న.

"ఈ పంజరంలోనుంచి ఆ చెట్లు, చెరువు పొలాలు మరోవిధంగా కనుపిస్తున్నాయి నాకేమో!" అన్నదా పిట్ట

తర్వాత పంజరం తీసుకొని చిన్న యింటికొచ్చింది పిట్టకు రాత్రి భోజనం పెట్టింది కాని అది ఒక్క మెతుకైనా ముట్టలేదు ఇదంతా చూచి చిన్న కొంచెం కంగారుపడి అక్కయ్యలతో చెప్పింది విషయమంతా.

"చిన్నా నీవు చాలా కఠినంగా వుండాలి సుమా," అన్నదొకతె

"అన్నం తినకపోతే చచ్చిపోతుంది," అన్నది చిన్న

"అలా అయితే తప్పంతా ఆ పిట్టదే. లేకపోతే దానికోసం నీవెంత కష్టపడుతున్నావో చూడు అంత తలబిరుసుగా వుంటే దానికి చావే సరైనమందు దాంతో నీపీడ వదులుతుంది"

"బహుశా రేపు సరిగా వుంటుందేమో" అని తృప్తిపడింది చిన్న

మరునాడుదయాన్నే నిద్రలేచి పిట్టను హెచ్చరించింది చిన్న జవాబులేదు. పంజరం దగ్గరికి పరుగెత్తింది లోపల చూచింది పిట్ట ఒకమూల కదలకుండా పడివుంది కళ్లు మూసుకొని చచ్చినట్లు పడివుంది. రాజకుమారి చాలా భయపడి పంజరం తలుపు తెరిచి పిట్టను బైటికి తీసింది. దాన్ని చూస్తుంటే చిన్నకు ఏడుపు పొంగి పొరలు కొచ్చింది చేతిలో పిట్ట నుంచుకునే సరికి ఏదో శబ్దం అవుతున్నట్టు తోచింది చిన్నకు. ఏమిటోనని కాస్త నిదానించి చూచింది పిట్ట గుండెకాయ యింకా కొద్ది కొద్దిగా కొట్టుకుంటూంది

అది వినగానే చిన్న ప్రాణాలన్నీ లేచి వచ్చాయి.

"లే అమ్మా లే" అన్నది చిన్న చాలా ప్రేమతో.

ఆమె కళ్లవెంట నీళ్లు కారాయి. అయిదారు నీటిబొట్లు పిట్ట మీద పడ్డాయి. ఆ తాకిడికి పిట్ట కళ్లు తెరచింది దానికి పంజరంలో వున్నట్లే అనిపించలేదు.

"చిన్నా విచ్చలవిడిగా వుంటేనే గాని నేను పాడలేను పాడకపోతే చచ్చిపోతా అంతే"

పిట్ట ఈ మాటలంటూంటే చిన్న. వెక్కి వెక్కి ఏడవసాగింది

"అయితే నీకు స్వేచ్ఛయిస్తున్నా నిన్ను యీ బంగారుపంజరంలో వుంచిందెందుకో తెలుసునా? నేను నిన్ను చాలా ప్రేమించాను నీవెప్పుడూ నాదగ్గరవుండాలనే యిలా చేశాను. కాని నీవింతగా బాధపడతావనుకోలేదు పో నీయిష్టంవచ్చినట్లు చెట్లల్లో, చెరువుపైన' పొలాల్లో తిరుగు నీవు హాయిగా వుండటమే నేనుకోరేది" అంటూ పిట్టను వదిలింది. "నీ యిష్టం వచ్చినట్లు వస్తూ పోతూండు నిన్ను మళ్లీ పంజరంలో పెట్టను"

"రాజకుమారీ, నీ మీద నాకెంతో ప్రేమ. అందుకనే నీదగ్గరికొస్తాను మంచి పాటలు నీకు వినిపిస్తాను. నే నెక్కడెక్కడికో వెళ్తాను.. కాని నిన్ను మరచిపోను. తప్పకుండా వస్తాను" అంటూ ఆ పిట్ట ఒక్కసారి వళ్లంతా విదిలించుకుంది.

తక్షణం రెక్కలాడించికుంటూ ఆకాశంలోకి ఎగిరిపోయింది అది పోతూంటే చిన్నకు దుఃఖంవచ్చింది. ఒంటరితనం కలిగిందామెకు.

ఈ సంగతి విన్నాక అక్కయ్యలందరు మళ్లీ ఆ పిట్ట తిరిగి రాదని గట్టిగా చెప్పారు చెప్పారే కాని ఆ పిట్ట సాయంత్రానికే తిరిగి వచ్చి చిన్న భుజంమీద కూర్చొని ఆమె చేతిగుండా ఆహారంతిని తియ్యని పాటలు పాడింది ప్రతిరోజూ యిట్లాగే జరుగుతూండేది.

ఈ పిట్ట రాక పోకలకొరకు చిన్న కిటికీ ఎప్పుడూ తెరిచివుంచేది. అట్లా వుంచడం ఆమెకూడా మంచిదే అయింది మంచిగాలి వెలుతురు ఆమెగదిలోకి వచ్చి ఆమె ఆరోగ్యాన్ని బాగుచేస్తూండేవి.

చిన్న పెద్దదైంది. రాజకుమార్తెలందరిలోకి చాలా అందగత్తె అయింది ఆమె అందాన్ని చూచి కంబోడియా దేశపురాజు ఆమెను పెళ్లిచేసుకున్నాడు తెల్లటి ఏనుగనెక్కించుకొని, చిన్నను తన పట్టణానికి తీసుకెళ్లాడా రాజు

చిన్న అక్కయ్యలందరు తలుపులు బిగించి నిద్రపోతూండేవారు. అందుచేత వాళ్లు అందగత్తెలు కాలేదు. చాలా అసహ్యంగా వుండేవారు. వాళ్లను ఏ రాజులూ పెళ్లాడలేదు. చిట్టచివరకు, సయాం దేశపు




గౌతమ బుద్ధుడు చాలా శాంత స్వభావుడు ఉదార బుద్ధికలవాడు కాబట్టే ఆయన సర్వలోక పూజ్యుడైనాడు ఎవరైనా ఆయనను ఎంత నిందించినా ఎన్ని బాధలు పెట్టినా ఆయన వారిని క్షమించటమే కాకుండా తిరిగి ఎంతో ఓర్పుతో వాళ్ళకు ఉపకారం కూడా చేసేవాడు

ఒకమారు ఒకనికి బుద్ధుని శాంత స్వభావమును పరీక్ష చేయాలని బుద్ధి పుట్టింది ఏదైనా ఒక కారణం వెతికి ఆయనను బాగా తిట్టి విసిగించి కోపము తెప్పిద్దామని భావించాడు సరే తప్పు వెదక దల్చుకొన్న వారికి తప్పులే దొరక్క పోతాయా? ఏదో ఒక వంక వెతికాడు ఇక బుద్ధుని తిట్టడం మొదలెట్టాడు బుద్ధుడు ఏమి ఎత్యం చేయకుండా ఊరికే వింటూ కూచున్నాడు అతనికి తిట్టి తిట్టి నోరు నొప్పికూడా పుట్టసాగింది అయినా బుద్ధుడు ఊ, ఆ అనికూడా అన లేదు ఇక చిట్టచివరకు అతనికి విసుగెత్తి తిట్టలేక ఆపేశాడు అంతా అయిన తరువాత అతను నోరు మెదల్చక కూర్చొనిఉండగా బుద్ధుడు అతనితో "ఏమండి మీ తిట్లు పూర్తి అయినయ్యా? అయితే నేను మిమ్మల్నొక ప్రశ్న వేస్తాను దయఉంచి జవాబుచెప్తారా" అని శాంతముగా ప్రశ్నించాడు

"అడగండి అలాగే చెప్తాను"

"చూడండి మీరు ఒకనికి ఏదైనా ఒక వస్తువును ఇద్దామనుకున్నారనుకోండి కాని ఆయనదాన్ని తీసికోదల్చుకోలేదనుకోండి అప్పుడు ఎలా ఉంటుంది" అని బుద్ధుడు ప్రశ్నించాడు

"అప్పుడు ఇచ్చేఆయన మనస్సుకు చాలా కష్టముగా ఉంటుందని ఆయన జవాబిచ్చాడు

"అయితే ఆ వస్తువు ఎవరి దగ్గర ఉంటుందని" బుద్ధుడు తిరిగి ప్రశ్నించాడు

"అది ఎవరిదో, ఎవరిస్తున్నారో ఆయనదగ్గరే ఉంటుంది" అని ఆయన జవాబిచ్చాడు

"సరే అయితే మీరు ఇందాకటి నుంచి నాకు ముట్టజెప్పదలచి ఇచ్చిన ఆ రకరకాల తిట్లు నాకు వద్దు వాటితో నాకు అవసరము లేదు అవి మీ వస్తువులు మీ దగ్గరే జాగ్రత్తగా ఉంచుకోండి" అని బుద్ధుడు శాంతముగా అన్నాడు

---

రాజు కొలువులో వుండేవాళ్లే పెళ్లి చేసుకున్నారు

అయితే ఆ ఎనిమిదిమందికి వాళ్ల నాన్న ఏం బహుమతిచ్చాడో తెలుసా?

తలా ఒక పౌను తేయాకు, ఒక సయాం దేశంలోని ఎల్లి!!! ★

ఇదివిని ఆయన సిగ్గుతో తల వంచుకున్నాడు అప్పుడు బుద్ధుడు ఆయనతో ఇలా అన్నాడు. "అయ్యా, నాకు నీవు నిందాదానము ఇచ్చేముందర దానివల్ల నీకు ఏమి ఉపయోగముంటుందో, నీకు సుఖము కలుగుతుందో దుఃఖము కలుగుతుందో, అందు వల్ల మీ ఆశయము ఎంత మాత్రము సిద్ధించుతుందో బాగా ఆలోచించుకొని ఉంటే ఎంతో బాగుండేది. ఇంకొకని వంటిమీద బురద చల్లదల్చుకొన్నవాడు మొట్ట మొదట తన చేతిని బురదలో మలినము చేసికొనవలసిందేగదా! సరే ఇంకొక విషయము చూడు నీకు సూర్యునిమీద ఏదన్నా ఒక కారణంవల్ల కోపంవచ్చి ఆయనమీద ఉమ్మివేయ తలుస్తావనుకో, అప్పుడు నీవు మెడపైకి ఎత్తివేసే ఉమియవలయునుగదా! పోనీ అలా చేసినా దానివల్ల సూర్యునికి ఏమైనా బాధగాని నష్టముగాని కలుగుతుందా? పైపెచ్చు నీ కోరు, నీ ఒళ్ళుఅంతా అశుభ్రము కావటము తప్ప నీకు కలిగే ఫలితం ఏమిటి? కాబట్టి నీవు అనుసరించిన ఈపద్ధతి మంచిదికాదు నా అంతరాత్మ నిష్కల్మషముగాను నిష్కపటముగాను ఉన్నంతకాలము నీ బోటి వారలయొక్క కఠోరములగు దూషణములు గాని, నిందలుగాని నన్ను చలింపజేయవు. నన్ను అవమానించి హేళనచేసితినని నేడు నీచ విజయ గర్వము నీకు తాత్కాలికముగా కలుగవచ్చును కాని దానివలన నాదృఢ సత్సంకల్పము ఏమాత్రము మారబోదు. కాబట్టి నీవు ఎల్లప్పుడు మంచిమాటలతో ఇతరుల హృదయమునకు ఆనందము కలుగునట్లు ప్రవర్తించుట అభ్యసించుము. నీ నిందలు తిట్లు ఇతరులకు అంటవు దాని వలన నీ హృదయమే మలిన మౌతుంది. మలిన హృదయమునకు పశ్చాత్తాపమే పరమోపాయము నిన్ను నేను క్షమించుచున్నాను" అని బుద్ధుడు ఆయనతో అన్నాడు

ఇది విని ఆయన అవమానముతో సిగ్గుపడి బుద్ధుని పాదములపైబడి క్షమాభిక్ష వేడుకున్నాడు తరువాత బుద్ధుడు ఆయనకు చాల ఉపదేశము చేశాడు ★

## గ్రంధ సమీక్ష

### ఎర్ర పూలు

రచన మాక్సిం గోర్కీ, కిషన్‌చందర్ అనువాదం అడబాల వీరాస్వామి రాజా ప్రచురణ శాంతిసాహితి, ఏలూరు ప్రతులకు ఫేమస్ బుక్ హౌస్, ఏలూరు వల ఒక రూపాయి

మొదటిది గోర్కీ రచించిన 'దొడ్డదొర' అమెరికన్ ఆర్థికవ్యవస్థా స్వరూపం కూలంకషంగా అవగతం చేసుకుని, ఒక కోటీశ్వరుని మనస్తత్వం ఈచిన్ని వ్యాసంలో విశేషమైన ప్రతిభతో చూపాడు గోర్కీ ముఖ్యంగా ఆ కోటీశ్వరుని వాంఛ 'యూరపులోని రాజులలో ఎవరినైనా కుదుర్చుకుని, వారిచేత కుస్తీపట్టించి వినోదిద్దామనుకునేది' అమెరికన్ ధనాఢ్యుల భ్రమ (దేనినైనా డబ్బుతో సంపాదించవచ్చుననేది) ను సుస్పష్టంగా వ్యక్తం చేస్తూంది ఈ వ్యాసంలో వ్యంగం పరాకాష్ఠ చెందినదని చెప్పక తప్పదు

అతిమూల్య నాలుగు కిషన్‌చందర్ రచించినవి కోట్లకొలది మానవులు నికృష్టమైన దశలో తరతరాలుగా పీడింపబడుతూ ఉండడానికిగల కారణాలపట్ల విపరీతమైన ద్వేషం ఏ విధంగానైనా, చివరికి సర్వస్వం బలి ఇచ్చిఅయినా వారిని ఉద్ధరించాలనే ఆవేదన, ఈనాటి స్థితిగతుల నర్థంచేసుకుని నిజం తెలుసుకోవాలనే జిజ్ఞాస వీటిలో ఉట్టిపడుతున్నవి ముఖ్యంగా 'స్పెయిన్ బాలుని ప్రతిజ్ఞా చిహ్నం' జీవితంలో ఎన్నటికి మరపురానిది 'చిన్న కుటీరం ఉంది చితిలా రాళ్లు పేర్చి గోడలు నిలిపారు' వంటి వాక్యాలు సత్యానికి అతి సన్నిహితంగా హృదయవిదారకంగా ఉన్నవి

అనువాదం బాగా ఉంటే మరింత ఆనందదాయకంగా ఉండేది తరువాతి ప్రచురణలలోనైనా దోషాలు సవరించుకొనడం ఉచితం — కొమరాజు.

## గ్రంధ స్వీకారం

### ప్రపంచ మతములు

కర్త శ్రీ నిర్వికల్పానందస్వామి ప్రకాశకులు జాతీయ జ్ఞానమందిరం, 5-ఎ, మాబ్రెస్ రోడ్డు, రాయపేట, మద్రాసు

వెల రూపాయిన్నర

### "ఆంధ్ర ప్రతిభ"

కర్త శ్రీ రామదుర్గుల సుబ్బారావు, ప్రకాశకులు బాలభారతి ఆఫీసు, కౌనూరగ్రహారం, (వయా) నిడదవోలు

### ప్రయోజన విద్య

(మొదటి, రెండవ పుస్తకాలు)

కర్త శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు ఎం ఏ

ప్రకాశకులు ఆంధ్రగ్రంధాలయట్రస్టు, పటమట లంక (వయా) విజయవాడ

వెల ఐదేసి అణాలు

### "మా పారాలు"

(మొదటి, రెండవ భాగాలు)

కర్త శ్రీ గోపరాజు రామచంద్రరావు (గోరా)

ప్రకాశకులు గ్రంథాలయ పుస్తకశాల, పటమట పోస్టు, కృష్ణా జిల్లా

వెల ఐదేసి అణాలు

### "గ్రంథాలయ సూత్రాలు"

[8 అణాలు]

### "గ్రంథాలయ ప్రచారం విజ్ఞాన వ్యాప్తి"

[8 అణాలు]

### "తెలుగు పుస్తకాల వర్గీకరణ"

[5 అణాలు]

కర్త శ్రీ పాతూరు నాగభూషణం ప్రకాశకులు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, పటమట లంక (వయా) విజయవాడ ★

# బుద్ధిః కర్మానుసారిణీ

(15-వ పేజీ తరువాయి)

యువని కోరుకుంటూన్న స్త్రీలకు పురుషుని ప్రక్క కూర్చుంటే తప్పేముంది? నా దగ్గర అంటే అన్నావు కాని ఇంకెవరి దగ్గరా నీ పల్లెటూరిగబ్బిలాయిమాటలు అనకు"

ఏమన్నా అంటే పల్లెటూరిగబ్బిలాయి నీకేం తెలుసంటారు మా నంకోయమ్మ బొమ్మ పరాయిపురుషుడికి స్త్రీ ఎప్పుడూ గజం దూరంలో నిలబడి మాట్లాడాలి అని ఎప్పుడూ అనేది తెలుసా?

ఆ మాటకు మాధవరావు ఘక్కున నవ్వాడు దానితో రాధకు రోషం వచ్చింది

"పోనీండి నామాటలన్నా నేనన్నా మీకు వేళాకోళమే! సరే కానీయండి ఆవిడగారు ఆ తోలుపించి అంత నిర్లక్ష్యంగా పారేసుకుపోయిందెవిటండీ?"

"పోదూ ఒక్కటే గొడవ, నాకు నిద్ర వస్తూంది రెండున్నర కావొస్తూంది ఇక నిద్రపోదాము"

మరునాడుదయం మాధవరావు ఎనిమిది గంటలకల్లా టిక్ టాక్ గా అలంకరించుకుని పుష్పలత పారేసిపోయిన మనిపర్సు పట్టుకుని మోటారులో ఆమె ఇంటికి బయలుదేరేడు వెరుకగా వెరుకగా 112 నెంబరు ఇల్లు కనబడింది అదొక చిన్న బంగళా ముందు అందమైన చిన్న తోట వుంది మోటరుహారన్ వేయగానే ఒక నౌకరువచ్చి గేటు తీసేడు తోటలో చమన్ దగ్గర మాధవరావు మోటరాపేడు గేటుతీసిన నౌకరు వచ్చి సలాంపెట్టి మాధవరావుని డ్రాయింగు రూములో కూర్చోపెట్టేడు ఆ నౌకరు చేతికి మాధవరావు తన విజిటింగ్ కార్డు ఇచ్చిపంపేడు బల్లమీద కొన్ని పేపర్లు ఇతని చేతికిచ్చి ఆ నౌకరు తాను లోపలికి వెళ్ళేడు

ఆ డ్రాయింగురూము దివ్యంగా అలంకరించి వుంది వివిధవేషాలతో తీసుకున్న పుష్పలత ఫోటోలు ఎన్లార్జిమెంటులు గోడల కలంకరించివున్నాయి ఆ గది సౌందర్యాన్ని పరికిస్తూన్న మాధవరావుకు తెర తొలగించుకొనివచ్చిన పుష్పలత ఆశ్చర్యచకితుడిని చేసింది పుష్పలత ఆనాడు తెల్లటి కాశ్మీరపుసిల్కుపై తెల్లటిపూవులు గల సిల్కు షల్వారు పాయజామాను, కుడతొడుగును ధరించి లేతగులాబీరంగు టిష్యూసిల్కు వలిపవొయ్యెదగా వేసుకుంది కాలికి జరీబుట్ దారీపనిచేసిన నల్లటి ముఖమల్ చడావులు తొడుక్కుంది అప్పుడే తలంటిపోసుకుందేమో తల విరియపోసుకుని తలపై రిబ్బన్ కట్టుకుంది ఆ గుస్తులతో ఆమె అప్సరసలాగా వెలిగిపోతూంది ఆమెను జూడగానే తాను ఇంగ్లీషు నవలలో చదివిన ఫెయిరీ ఏమోననుకున్నాడు రాగాలత బయటకు వచ్చి "ఓహో డాక్టరు పుష్ప 'నమస్తే' పొద్దున్నే దయచేశారే! నామీద చాలా దయవుందన్నమాట!" అని పలకరించి సోఫాలో అతని పక్కనే కూర్చుంది

పుష్పలతతండ్రి వరదరాజయ్య మదరాసులో ఒక చిన్న వకీలు లత ఆయన ఏకైక సుగుణపుత్రిక చాలాకాలమునకు పుట్టటచేతనూ ఒక్కర్తె అవుటచేతనూ తల్లిదండ్రులు లామెను చాలా అపురూపంగా పెంచేరు బడికి పంపితే తమ బిడ్డ ఎక్కడ కందిపోతుందో అని ఇంట్లోనే ఒక దొరసానిని పెట్టి ప్రయివేటు చెప్పించారు లతకు పన్నెండో ఏడాది వచ్చేసరికి తండ్రి వరదరాజయ్య అయిదువేల రూపాయిల ఆస్తినీ, పదివేలు ఖరీదు చేయు చిన్న బంగళాను తన సుగుణకూతుర్ని తన సతీమణి కప్పజెప్పి తాను స్వర్గస్థుడైనాడు భర్తకొరకు దుఃఖించి దుఃఖించి అండాళ్ళమ్మకూడా ఏడాదై భర్తదగ్గరకు చేరుకుంది అండాళమ్మ బ్రతికుండగా తన కూతుర్ని ఒక యింటిదాన్ని చేయాలని అనుకుంది కాని పెండ్లిచేసుకుని ఒకడి అధీనంక్రింద బానిసబ్రతుకు నేను బ్రతకలేనని లత మూర్ఖపు పట్టుపట్టింది

ఇంతలో ఆమె కోరిక తీరకుండానే



కాలధర్మం పొందింది ప్రస్తుతం ఆ ఇంట్లో ఒక్కర్తెయే నవుకర్లను పెట్టుకుని వుంది ఆమె వుద్దేశాలకు తగిన స్వేచ్ఛ దొరికింది. తన కంటికి నజరైన పురుషుని ప్రేమించి ఇష్టమున్నంతవరకూ కలసివుండి తరువాత ఎవరిదోవ వారిదనే వుద్దేశం మొదటనుండీ ఆమెలో ఎలా కలిగిందో కాని, అది నానురాను వృద్ధిఅయి దృఢ నిశ్చయంకింద మారింది దానికి తగినట్లుగా స్వేచ్ఛకూడా లభించుటచే లత సిద్ధసంకల్పురాలైంది ఏడాదిక్రితం మెడికల్ కాలేజిలో మాధవరావుఉపన్యాసం విన్నదగ్గర నుండి అతగాని తన వలలో వేసికోవాలనుకుంది అది ఈనాటికి అలభ్యయోగంగా లభ్యమైంది ఈ అవకాశమును లత వదలి పెట్టలేదు మాధవరావు దృఢమనస్కుడై నప్పటికి ఆమె పన్నిన వలలో చిక్కుకున్నాడు ఆనాటినుండీ ఆమెఇంటకి బానిసలాగ తిరుగుతున్నాడు ఆమె వినోదాలకు, విలాసాలకు ద్రవ్యాన్ని తృణప్రాయంగా ఖర్చుపెట్టుతూన్నాడు. రాధ వంటిపై నున్న ఒక్కొక్కవస్తువే మాయమౌతూన్నాయి ప్రాక్టీసుధ్యాస లేదు ఇంటిధ్యాస అసలే లేదు నలుగురూ నవ్వుతూన్నారన్న మాట మొదలేలేదు ప్రపంచకమంతా లతామయంగా కన్పిస్తూంది ఎన్నో గంటలపాటుల్లో తాను, లత కలసి ఫోటోలు తీసుకుని ఎన్లార్జి చేయించి లత ఇంటలో అలంకరించాడు తన పల్లపుపొలం తాకట్టు పెట్టేడు తాను వున్న ఇల్లు అమ్మజూపుతున్నాడు

మెల్లి మెల్లిగా మాధవరావుప్రవర్తన ధవిళేశ్వరందాకా పాకింది ముందు నారాయణరావు నమ్మలేదు కాని అసలు విషయం కనుక్కువస్తానని మద్రాసు వచ్చేరు మామగారు వున్న మూడురోజులు ప్రాణాలు బిగపట్టుకుని మాధవరావు ఇల్లు కదలలేదు తండ్రి రాధను ఈ విషయం గుచ్చిగుచ్చి అడగాడు

"అబ్బే ఏమీ లేదు నాన్నా, గిట్టనివాళ్లు ఏవో పుట్టించిన మటలు నీ వేలాగు నమ్మావో నాకు ఆశ్చర్యంగా వుంది నీ మేనల్లుడి గుణం నీకు తెలియదూ ? మేము నిక్షేపంలాగున్నాము" అని జబాబిచ్చింది

తన తండ్రితో తన్నుగురించి ఏమి చెప్పుతుందో అని భయపడుతూన్న మాధవరావు రాధ జబాబు విని సంతుష్టి చెందాడు

"ఉగాదిపండుగ నాలుగురోజులుంది నీవు అల్లుడూ పిల్లలూ వస్తే పండుగ సరదాగా చేసుకొందాము"

"అయ్యో ఎలాగు నాన్నా ? ఒక్క నిముషం వారు వూరిలో లేకపోతే గడుస్తుందా ? డాక్టరు ప్రాక్టీసా మరొకటా ? వారికి తీరుబాటన్నమాటే లేదు ఎలాగ వస్తారు ? మీకు వీలున్నప్పుడు మీరే వస్తే సంతోషిస్తారు"

"పోనీ అమ్మ, మీ దయ ఎక్కడో దగ్గర బాగుంటే అంతే చాలు" అని పాపమా వృద్ధుడు కళ్లద్దాలు తీసి కళ్లు తుడుచుకున్నాడు

"నేను ఈవాళ సాయంకాలం వెళ్లుతానమ్మ మీ అమ్మ ఒకతే వుంది

"అలాగే వెళ్లు నాన్నా అమ్మ ఒక్కతే వుండలేదు"

ఇదివరకు ఎప్పుడు వచ్చినా కొసరి కొసరి బలవంతం చేసి వుండమనే కూతురు, అల్లుడు ఈసారి వెళ్లతానన్నదే చాలునని వూరకోవటం చూచి నారాయణరావుమనస్సు శంకాకులమైంది కాని చేసేదేమీ లేక వీరిని కాపాడమని మనస్సులో భగవంతుని ప్రార్థించాడు

మూడురోజులై మాధవరావు పుష్పలతను చూడలేదేమో అతనికి మూడు యుగాలుగా వుంది మామగార్ని రైలుకు ఎక్కించి నేరుగా పుష్పలతఇంటకి వెళ్లాలనుకున్నాడు చెక్కుబుక్కు జేబులో పెట్టుకున్నాడు లత ఎంత బెంగపెట్టుకునుందో, ఎంత కోపగించుకుంటుందో అనుకుని ఆమె అలక తీర్చడానికి, రాబోయే ఉగాది బహుమానానికి గాను వుమ్మిడియార్ కు వెళ్ళి రెండువేలకు ఒక రవ్వలగాజుల జత కొని చెక్కు వ్రాసిచ్చి కీలుపాక్ వచ్చేడు వాకిట్లో వున్న నౌకరు 'మీరొస్తే అమ్మగారు ఇంట్లోలేరని చెప్పమన్నారు' అన్నాడు వాడిమాట వినిపించుకోకుండా గబగబ లోపలికి వెళ్లేడు పడకగది ప్రవేశించాడు అచ్చట వున్న సోఫాలో బట్టలవర్తకుడు మీరాసాయబు కూర్చునున్నాడు అతని చేతుల్లో లత బంధింపబడి వుంది మాధవరావు ఆ దృశ్యం చూచి నిలువునా కంపించిపోయేడు నోట మాట రాలేదు 'విశ్వాసఘాతినీ' అని మాత్రం అనగలిగేడు లత కూడా ముందు కంగారుపడినా సర్దుకుని "నీవు లోపలికి రావద్దని చెప్పితే ఎందుకు వచ్చావు ? పైగా ఆ మాటేమిటి ? నీ మీద మోజు వున్నంతవరకూ నీ దగ్గర ప్రేమపొందాను నీమీద అసహ్యం పుట్టింది నీ విక రావలసిన పని లేదు నన్ను బెదరించడానికి నీ వెవరవు ? మర్యాదగా బైటికి నడు"

"ఓసి గయ్యాళి ఎంత ప్రేమ చూపించావే నన్ను నా కీర్తినీ ఎంత నాశనం చేశావే నరరూపరాక్షసీ కులటా"

"అయ్యా డాక్టరుగారూ దయచేసి తాము అవతలకి నడవండి లేకపోతే మర్యాద దక్కదు నేను మీకింద అణిగిమణిగి వుండడానికి తాళి కట్టించుకొన్న పల్లెటూరి రాధను కానన్న విషయం గమనించాలి" అంది లత

ఎందుకైనా మంచిదని సాయబుగారు చాకొక్కటి చేతులోకి తీస్తున్నాడు ఇది గమనించి ఇక తానక్కడ వుంటే లాభం లేదని వచ్చినతోవని ఇంటదారి పట్టాడు

ఇంటికి వచ్చేసరికి శేషూ, గోపీనీ ఎదురై వాళ్ల తాతగారిచ్చిన బహుమతులన్నీ తండ్రికి చూపించారు నాన్న చెరొకవేపు ఎత్తుకుని 'అమ్మయేది' అని అడిగేడు "అమ్మ దేవుడింటిలో పూజచేసుకుంటూంది" అన్నారు పిల్లలు మాధవరావు దేవుడింటిలోకి వచ్చేసరికి అప్పుడే పూజ ముగించి రాధ దేవికి మంగళహారతి ఇస్తూ 'ఐదోతనముకు నేను అతివ వేడితినమ్మా' అని శ్రావ్యకంఠంతో మంగళహారతి పాడుతూంది మాధవరావా పాట విని కరిగి నీరైపోయేడు మంగళహారతి కండ్ల కద్దుకుంటూన్న భర్తను చూచి రాధ ఆశ్చర్యపడింది

జరిగినవిషయం అంతా మర్చిపోయి తనను క్షమించమని మాధవరావు రాధను క్షమార్పణ కోరేడు

"అబ్బ [illegible]ండీ, కష్టసుఖాలు కావడం [illegible] అని మీ రనాడు అనలా ? ఇంతే నా పుణ్యం మంచిది మీలాంటి భర్త దొరికేరు" అంది రాధ

"ఇదిగో రాధా నీకు ఉగాదికానుక రవ్వలగాజులు తెచ్చేను రేపు సాయంకాలం మన మందరం బయలుదేరి ధవిళేశ్వరం వెళ్దాము పండుగ సరదాగా అచ్చట గడుపుదాము అత్తయ్యకు మామయ్యకు సంతోషంగా వుంటుంది"

అనుకోకుండా వచ్చిన కూతురు,అల్లుడ్ని, మనుమల్ని చూచుకుని ముసలిదంపతులు మురిసిపోయారు

మాధవరావు మదరాసుకాపురం ఎత్తేసి తన అత్తమామలదగ్గరనే వుండి ప్రాక్టీసు చేస్తున్నాడు

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras













రాజా
స్నో, హేర్ఆయిల్
కస్తూరిసోపు, హేర్ ఫిక్స

FAS

Use RAJA Face Powder & RAJA TOOTH Paste

RAJA (TRADE MARK)

AGARRATHI
2 TOLAS

MANUFACTURERS:
MANYAM & CO.,
BANGALORE.3.